# చందమామ

జనవరి 2003 ❖ రూ.7/-



## స్వాభిమానం

డా|| అల్లూరి రాజకుమారి

# చతుర ప్రపంచం

## లగాన్!

ఉత్తరప్రదేశ్ లోని ఫైనాన్షియల్ కార్పొరేషన్ బహుకాలంగా తన వ్యాపారాన్ని సాగిస్తోంది. 1999-2000 నాటికి ఆ సంస్థకు 810 కోట్ల రూపాయల పెట్టుబడులున్నాయి. అంతకు ముందు సంవత్సరం ఆ కార్పొరేషన్‌కు 76 కోట్ల రూపాయలు నష్టం వచ్చింది. ఉద్యోగులు శ్రద్ధలేక, కొన్ని అవకతవకల వలన సంస్థకు 25 సంవత్సరాలుగా నష్టాలు వస్తూనే ఉన్నాయి.

ఈ పరిస్థితిలో రీటామీనన్ (ఐ.ఎ.ఎస్) ఆ కార్పొరేషన్‌కు మానేజింగ్ డైరెక్టర్‌గా నియమించబడింది. ఆమె మంచి సమర్థత గల ఆఫీసర్. నీతికి, నిజాయితీకి పెట్టింది పేరు. సంస్థను నష్టాల ఊబిలోంచి బయటకు లాగి, లాభాల బాటలో నడిచేలా చెయ్యాలనే దృఢసంకల్పం ఆమెకు కలిగింది. ఉద్యోగులు చిత్తశుద్ధితో పని చేసిననాడు సంస్థ తీరుతెన్నులు మెరుగు కాగలవని ఆమె తలంచింది. ఉద్యోగుల్లో చక్కటి స్పందన కలిగించాలని ఆమె భావించింది.

అప్పటికి 'లగాన్' సినిమా విడుదలయి రెండు వారాలు అయింది. తన ఉద్యోగులు అందరికోసం 'లగాన్' చిత్రం ప్రత్యేక ప్రదర్శన ఏర్పాటు చేసింది రీటా. వెయ్యి మంది సిబ్బంది చిత్రాన్ని చూసి బాగా స్పందించారు. 'మేము కూడా పట్టుదలతో సాధించగలం' అనే స్ఫూర్తి వారిలో బలంగా కలిగింది. చిత్రప్రదర్శనకు ముందు వారితో అన్నది - "శ్రద్ధగా సినిమా చూసి రండి. మంచి పాఠం నేర్చుకుని తిరిగి రండి."

మేనేజింగ్ డైరెక్టర్‌గా ఆమె వచ్చిన కొద్ది రోజులకే సిబ్బంది అందరికీ ప్రమోషన్ వచ్చింది. 25 సంవత్సరాలుగా వీరెవ్వరికీ ప్రమోషన్లు లేవు. ఆ ఉద్యోగులలో ఉత్సాహం కట్టలు తెంపుకొంది. లగాన్ స్ఫూర్తితో వారు విజృంభించారు.




రీటా మంత్రం పనిచేసింది. ఎవరు నమ్మినా నమ్మకపోయినా 2001-2002 సంవత్సరానికి సంస్థకు కోటి రూపాయల లాభం చేకూరింది. ఆ పెద్ద సంస్థకు ఈ లాభం తక్కువే కావచ్చు. అయితే బహుకాలంగా లాభాలు ఎరుగని ఆ కార్పొరేషన్ కోటి రూపాయలు గడించడం విశేషమే



కదా!

సినిమాలు చూసి చెడిపోవడమే తప్ప బాగుపడడం ఉండదు అనే అభిప్రాయం జనానికి ఉంది. ఇప్పుడు ఈ కార్పొరేషన్ సంస్థ యొక్క సంఘటన గురించి విన్న వారంతా సినిమాలవలన మేలు కూడా జరుగుతుంది అనక తప్పదు మరి!

## స్తన్య జీవులు

స్తన్య జీవులకు సంబంధించిన వాటిలో అతిచిన్న జీవిగా థాయ్‌లాండ్‌కు చెందిన బంబుల్ బ్యాట్‌ను గుర్తిస్తారు. దీని బరువు ఒక పైస బరువుకన్నా తక్కువ.

మెక్సికోలో నివశించే తోకవున్న గబ్బిలాలు 2 మైళ్ల ఎత్తుకి ఎగిరి గంటకి 60 మైళ్ల స్పీడులో ఆకాశంలో ఎగురుతాయి.

వెస్టన్ నార్త్ అమెరికాకు చెందిన పాలిడ్ గబ్బిలం తేలుకొండీలు శరీరంలో దిగినా చలించదు. ఇది 7,8 అంగుళాలు గల రోకలి బండలను, గొంగ శీపురుగులను పట్టి తింటుంది.

ఆఫ్రికాలోని హృదయాకారపు ముక్కు కలిగిన గబ్బిలాలు కుమ్మరిపురుగు పదధ్వనులను ఆరు అడుగుల దూరం నుంచి వినగలవు.

నార్త్ అమెరికాలోని ఎర్రగబ్బిలాలు శీతాకాలంలో మైనస్ 23 డిగ్రీల వాతావరణం వద్ద కూడా హాయిగా నివశించగలవు.

పశ్చిమ ఆఫ్రికాలోని ఊలీబాట్స్ పెద్దపెద్ద సాలిగూళ్లలాంటి గూళ్లు అల్లుకుని అందులో నివశిస్తాయి.

తెల్ల గబ్బిలాలు కొన్ని పసుపు పచ్చ ముక్కు, చెవులు కలిగి ఉంటాయి. ఇవి ఆకులను పీకి, కత్తిరించి టెంటులను నిర్మించుకుని అడవి వర్షాలనుంచి తమనుతాము రక్షించుకుంటాయి. లాటిన్ అమెరికాకు చెందిన గబ్బిలాలకి పళ్లెం ఆకారంలో రెక్కలు, పాదాలు ఉంటాయి. అరటిఆకుల్లాంటి పెద్దపెద్ద ఆకులకింద దాక్కుని తమనుతాము కాపాడుకుంటాయి.

స్తన్య జీవుల్లో ఒకటైన ఈ గబ్బిలాలలో సుమారు 1000 రకాలైన గబ్బిలాలు మనకు మేలు చేసేవే. రాత్రిళ్లు సంచరించే కీటకాలని గుంపులు గుంపులుగా పట్టి గుటకాయ స్వాహా చేస్తుంటాయి. ఒకే ఒక్క బ్రౌన్ బ్యాట్ ఒక గంటలో సుమారు వెయ్యినుంచి పన్నెండువందల కీటకాలను (దోమ సైజులో ఉన్నవి) పట్టుకోగలదు. పంటల్లో







వేళ్ల మొదట్లో వుండే నాశనకారకాలైన క్రిములను వేల సంఖ్యలో ఏరి తినివేసి వ్యవసాయదారులకు మేలు చేస్తాయి ఈ గబ్బిలాలు.

20 మిలియన్ల మెక్సికన్ గబ్బిలాలు ఒక్క రాత్రిలో 200 టన్నుల కీటకాలను గుటుక్కు మనిపిస్తాయి. ఈ బ్యాట్స్ బీజవ్యాప్తికి కూడా తోడ్పడతాయి. పళ్లను, విత్తనాలను ఎక్కడో వేరే ప్రాంతాల్లో వదలడంతో అవి తల్లి చెట్టునుంచి దూరంగా వెదజల్లబడి ఫలదీకరణం చెందుతాయి. వీటి సెలైవాతో హృద్రోగానికి మందు తయారు చేస్తారు.

గబ్బిలాలకి కళ్లు కనిపించవు అంటారు గానీ అది నిజం కాదు.

గబ్బిలం కేవలం ఆత్మరక్షణకోసం మాత్రమే కరుస్తుంది. మనుషులు దాన్ని చూస్తే భయపడచ్చుగానీ అది హానిమాత్రం చేయదు.

---

## మారువేషం

మారు వేషాలతో జనాన్ని మోసగించే వారు ఉన్నట్లుగానే ఆఫసర్లుగా అవతారం ఎత్తి ఇటు ప్రజల్నీ, అటు ప్రభుత్వాన్నీ మోసగిస్తున్న ఘనాపాఠీలు ఎందరో ఉన్నారు. ఆ కోవకు చెందిన వాడే విజయ్‌సింగ్ చౌహాన్. అతను మేజిస్ట్రేట్ అవతారం ఎత్తి 14 సంవత్సరాలుగా ప్రజలను మోసగిస్తూ వచ్చాడు. జనన మరణాల సర్టిఫికెట్ల ఎటెస్ట్ చేసి దానికి అతను 200 రూపాయలు స్వీకరించేవాడు. ఇతర డాక్యుమెంట్ల ఎటెస్టేషన్‌కు మూడువందలు గుంజేవాడు. బి.సి., షెడ్యూల్ క్యాస్ట్ సర్టిఫికెట్లకయితే అయిదువందల రూపాయలు స్వాహా చేసేవాడు.




రోజుకు కనీసం 20 నుంచి 25 సర్టిఫికెట్లను దర్జాగా జారీ చేసేవాడు. పధ్నాలుగు సంవత్సరాల దీర్ఘ నిద్ర తరవాత పోలీసులు నిద్ర లేచి ముందుగా ఓ మారు వేషంలో, నకిలీ మేజిస్ట్రేట్‌కు మూడువందలు సమర్పించి అతనినుంచి దొంగ సర్టిఫికెట్ పొంది, ఆనక అతగాణ్ణి బంధించారు.

విజయ్‌సింగ్ ఆఫీసు సోదా చెయ్యగా ఉన్నత అధికారులకి సంబంధించిన అనేక రబ్బరు స్టాంపులు లభించాయి. 1988 లో ఈ మారువేషప్రవీణుడు ఓ డాక్టర్‌గా కూడా అవతారం ఎత్తి కొంత జనాభాని తగ్గించాడు.



# చతుర

సంపుటి: 25 సంచిక : 12 జనవరి : 2003

రాష్ట్ర రాజధానిలో పుట్టి అక్కడే డిగ్రీదాకా చదివిన అతడు తన ఉద్యోగాన్ని మాత్రం కావాలని ఓ మారుమూల పల్లెలో వెతుక్కున్నాడు.

పల్లె ప్రశాంతతలో, రమణీయకతలో తన జీవితాన్ని గడపాలని అభిలషించిన అతడికి అక్కడి ఉద్యోగ జీవితం ఓ సవాలై నిలిచింది.

దానికి తగ్గట్టు భార్యగా అతడి జీవితంలో ప్రవేశించిన అమ్మాయి... మరింత ప్రశ్నార్థకంగా నిలిచి... అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసిన తరుణంలో... ఏం జరిగింది?

అతడి ఆగమనంతో ఆ పల్లెలో జరిగిన అనూహ్యమైన, అద్భుతమైన సంఘటనలెలాంటివి?

ఆద్యంతం ఆపకుండా చదివించే

డా॥ అల్లూరి రాజకుమారి రచన

# స్వాభిమానం

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

తూర్పు తెలతెలవారుతోంది. సిద్ధాంతం వద్ద గోదావరి వంతెన దాటి కోనసీమలోకి ప్రవేశించింది, హైదరాబాదు నుండి వస్తున్న ఆర్టీసీ బస్సు.

ఆకాశంలో రంగులు మారుతున్నాయి. కోనసీమలో సూర్యోదయం కన్నుల పండుగ్గా వుంది.

రోడ్డుకు ఇరువైపులా దట్టమైన కొబ్బరి చెట్లు గాలికి తలలూపుతూ అతిథులకు స్వాగతం చెబుతున్నాయి. కొబ్బరి ఆకుల సందుల్లోంచి, ఆవరించుకుని వున్న మంచు తెరను చీల్చుకుని వస్తున్న సూర్యకిరణాలు ముగ్ధమనోహరంగా కనిపిస్తున్నాయి. కొబ్బరి ఆకుల చివరినుండి జారిపడే మంచు బిందువులు కన్నతల్లి కళ్లనుండి జాలువారే ఆనందభాష్పాలుగా అనిపిస్తున్నాయి. కొబ్బరి తోటల మధ్యనుండి దూరంగా పచ్చని తివాచీ పరుచుకున్నట్టు కనిపిస్తున్న వరి చేలు. ఎటు చూసినా మనసుకి ఆహ్లాదాన్ని కలిగిస్తున్న హరిత వర్ణం.

చిలుకపచ్చ చీర కట్టుకున్న ప్రకృతి మాత అతిథులను ఆనందభాష్పాలతో సాదరంగా ఆహ్వానిస్తున్న కన్నతల్లిలా అనిపిస్తోంది.

మనసులో ఒక్కసారి దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి గేయం మెదిలింది.

'ఆకులో ఆకునై
పూవులో పూవునై
ఈ అడవి దాగిపోనా?
ఎటులైనా ఇచటనే ఆగిపోనా?' అన్నట్టు ఎట్టులైనా ఈ ప్రకృతిలో సేదతీరనా? అనిపిస్తోంది.

"మాష్టారూ! మీరు దిగవలసిన స్టేజి ఇదే"

చప్పున ఊహాచిత్రం చెదిరిపోయింది. భుజంమీద చెయ్యివేసి హెచ్చరిస్తున్నాడు బస్ కండక్టర్.

అతగాడికి 'థాంక్స్' చెబుతూ భుజానికి బ్యాగ్ తగిలించుకుని సూట్ కేస్ చేత్తో పట్టుకుని బస్సు దిగాను.

"రైట్" కండక్టరు బస్సుమీద దబదబా బాదడం, దుమ్ము రేపుకుంటూ బస్సు బయలుదేరడం క్షణాలలో జరిగిపోయింది. చటుక్కున కర్చీఫ్ అడ్డుపెట్టుకుని, ఆ దుమ్ముతెర తొలగిపోయేవరకు అలాగే నిలబడిపోయాను. తరువాత చుట్టూ చూస్తే ఎదురుగా కాలువ; ఇక రోడ్డువైపుకి చూస్తే, ఒకవైపు మూసివున్న బడ్డీకొట్టు, మరొకవైపు కాస్త దూరంగా ఒక చిన్న తాటాకుల పాక కనిపించాయి. అందులోంచి వినిపిస్తున్న సినిమా పాటలు ఆ అందమైన ప్రకృతిని కలుషితం చేస్తున్నట్టుగా వుంది. చుట్టుపక్కల ఎక్కడా నర సంచారం లేదు.

ఒక్కక్షణం నాకేం చేయాలో తోచలేదు. బస్సు దిగిన వెంటనే రిక్షా చేసుకుని ఏదైనా హోటలుకి వెళ్ళి అక్కడ ఒక రూము తీసుకుని నా సామాను అక్కడ పడేసి, కాలేజీకి ఇంటర్వ్యూకి వెళ్ళాలనేది నా ప్లాను. నిజంగానే ఇంటర్వ్యూలో సెలెక్ట్ అయితే, ఏదైనా ఒక రూము చూసుకునే వరకూ ఆ హోటలు గదిలోనే కాలక్షేపం చేయవచ్చని అనుకుంటూ వచ్చాను.

కనుచూపు మేరలో ఎక్కడా రిక్షాలాంటి వాహనం కాదు సరికదా ఎటువంటి వాహనమూ కనిపించడం లేదు. పోనీ నడిచి వెడదామన్నా హోటలు జాడ తెలిపే పుణ్యాత్ములెవరూ లేరు. దూరంగా కనిపిస్తున్న ఆ పాకలోనే మనుషుల అలికిడి వినిపిస్తోంది. అక్కడికే వెళ్ళి వాకబు చేద్దామనుకుంటూ వుండగానే, ఆ పాకలోంచి బక్కెట్టు చేత్తో పట్టుకుని కాలువవైపు వస్తూ కనిపించాడు ఒక పదేళ్ళ కుర్రాడు.

"చూడు బాబూ!" నా పిలుపుతో ఒక్కసారి ఆగి ఏమిటన్నట్టుగా నావైపు చూశాడు.

"ఈ ఊళ్ళో మంచి హోటలు ఎక్కడ వుందో అక్కడికి ఎలా వెళ్ళాలో ఒక్కసారి చెబుతావా?"

"అదేమిటయ్యగారూ ఎదురుగా ఉన్న బోర్డు కనిపించడంలేదా?" చేత్తో చూపించాడు.




నిజమే, ఆ పాక ముందు రెండు సరివి రాటలు పాతి తగిలించిన బోర్డును నేను గమనించనేలేదు. ఆ బోర్డుమీద పేరుకు పోయి వున్న ఎర్రటి దుమ్ములోంచి అస్పష్టంగా కనిపిస్తున్నాయి అక్షరాలు. 'హోటల్ న్యూఅలంకార్' అని. ఆ పేరును చూడగానే నవ్వు వచ్చింది.

"ఇది కాదు బాబూ ఇంతకంటే కాస్త మంచి హోటలు..." నా మాట ఇంకా పూర్తి కానేలేదు, ఛర్రున చూశాడా కుర్రాడు.

"ఏమిటీ, ఇంతకంటే మంచి హోటలా? ఈ చుట్టుపక్కల పదూళ్ళజనం తెల్లారేసరికి ఇక్కడికే వస్తారు తెలుసా? ఎప్పుడైనా ఈ హోటల్లో కారప్పొడి వేసుకుని ఇడ్లీలు తిని వుంటే తెలిసేది. ఇంతకంటే మంచి హోటల్ కావాలట, మంచి హోటల్" సిసింద్రీలా చిటపటలాడిపోతున్నాడు ఆ కుర్రాడు.

"అబ్బెబ్బే ఈ హోటల్‌ని నేనేమీ అనడం లేదయ్యా బాబూ! మరి... చూడు, హోటలంటే అందులో వుండడానికి గదులూ, అవీ..."

"హోటళ్లుండేది తిండానికి, తొంగోడానిక్కాదు" కొట్టినట్లే అన్నాడు.

'హతోస్మి!'

"అదికాదు బాబూ! పోనీ, ఊళ్లో మంచి లాడ్జి ఏమైనా...? " లాడ్జి అంటే ఆ కుర్రాడికి అర్థం కాదేమోనని వివరించడానికి పూనుకున్నాను. "అదే.. చూడు రోజువారీ అద్దె తీసుకుని వుండడానికి గదులు అద్దెకిస్తారు..."

"అట్టాంటియ్యేం లేవు" నా మాట పూర్తి కాకుండానే అందుకున్నాడు. ఆ కుర్రాడి అసహనం తెలుస్తూనే వున్నా అడగడానికి ఆ మానవుడు తప్ప మరెవరూ కనిపించడం లేదు. పోనీ, ఆ పాక దగ్గరికే వెడదామా అంటే; వేలెడు లేడు వీడే ఇలా చిరచిరలాడిపోతున్నాడు. ఇక...

"మరి బస్సు దిగినవాళ్ళు ఎక్కడికి వెడతారు? "

"ఇంకెక్కడికి వెడతారు? ఎవరింటికి వాళ్ళు వెడతారు. అయినా ఇళ్లు వదిలిపెట్టి ఎక్కడో గదుల్లో పడివుండాల్సిన ఖర్మ మా ఊరివారికి లేదు" కసిగా అన్నాడు.

గతుక్కుమన్నాను. నా ప్రాణానికిదేదో పద్మవ్యూహంలోంచి చిక్కుకుపోయినట్లుగా వుంది. ఆ కుర్రాడు నావైపు తీక్షణంగా చూస్తుంటే ఏం చెయ్యాలో తోచడంలేదు. అయినా నేనేమన్నానని ఈ కుర్రాడు ఇంతలా చిరచిరలాడిపోతున్నాడో నాకేమీ అర్థం కావడంలేదు.

అయినా ఈ ఊళ్లో అడుగు పెట్టగానే ఇటువంటి అనుభవం ఎదురైనందుకు మనసు చివుక్కుమంది. అసలేమయిందని అడుగుదామన్నా, నా నోట్లోంచి మాట బయటకు వస్తేనే మీదపడి కరిచేటట్లున్నాడు ఈ కుర్రాడు. అలాగని అంత చిన్న కుర్రాడికి సమాధానం చెప్పలేని నా అసమర్థతకు నామీద నాకే చిరాకు పుట్టింది.

"ఎక్స్‌క్యూజ్ మీ!" ఇంగ్లీషు మాట వినిపించేసరికి ప్రాణం లేచివచ్చింది. సంభ్రమంగా తల ఎత్తి చూశాను.

ఎదురుగా బ్రీఫ్‌కేసు చేత్తో పట్టుకుని పాతికేళ్ళ యువకుడు నిలబడి వున్నాడు. అతను... అవును నేను వచ్చిన బస్సులోనే ప్రయాణం చేశాడు.

"మీకు నేనేమైనా సహాయం చేయగలనా? " సాదరంగా అడిగిన అతనితో గబగబా నాకు కలిగిన ఇబ్బందినీ, నేను వచ్చిన పనినీ చెప్పుకున్నాను.

"ఓ మిస్టర్ విద్యాసాగర్! గ్లాడ్ టు మీట్ యూ!" స్నేహపూర్వకంగా చాచిన ఆ హస్తాన్ని అందుకున్నాను. ఒక్కక్షణం తిరునాళ్లలో తప్పిపోయిన పసివాడికి, తల్లిని చూడగానే కలిగే ఆనందం అనుభవంలోకి వచ్చింది.

"అరే నా పేరు మీకెలా తెలుసు? " ఆశ్చర్యంగా అడిగాను.

"మీ పేరేకాదు. మీ జాతకమంతా చెప్ప గలను. మీరు హైదరాబాదు వాస్తవ్యులు. తెలుగు ఎం.ఎం చేసి ఈ ఊరి కాలేజీలో జూనియర్ లెక్చరర్ పోస్టుకి అప్లై చేశారు. ఈరోజు ఇంటర్వ్యూకి వచ్చారు" అంటూనే అయోమయంగా చూస్తున్న నా మొహం చూసి గట్టిగా నవ్వేశాడు. "మరీ, అంతలా ఆశ్చర్యపోకండి సార్! నా పేరు జగదీష్. మీరు ఇంటర్వ్యూకి వచ్చిన ఆ కాలేజీలోనే నేను మాథ్స్ లెక్చరర్ని. ముందు మా ఇంటికి వెడదాం పదండి" అంటూనే ఆ కుర్రవాడివైపు తిరిగాడు.

"ఒరేయ్ సిసింద్రీ" ఆ పేరు వినగానే విచిత్రం అనిపించింది. ఎవరు పెట్టారో కానీ, ఈ కుర్రాడికి సరిగ్గా సూటయ్యే పేరే పెట్టారు.

"అయ్యగారి సూటుకేసు మీ హోటల్లో పడేసి, ఆనక ఎవరైనా అటు వస్తూంటే మన ఇంటికి పంపించెయ్. ముందు కొత్త మాస్టారుకి కాఫీ టిఫిన్లు అర్జంటుగా ఇంటికి తీసుకురా"

"పట్నం బాబులికి కాఫీ టిఫిన్లు పట్నం నుండే రావాలేమో? " మంటగా అన్నాడు.

"ఏడ్చావ్ లేవోయ్ బోడి కబుర్లూ నువ్వూనూ" అంటూనే నావైపు తిరిగాడు. "పదండి మాస్టారూ! మనం వెడదాం. సూటుకేసు తరువాత వస్తుందిలెండి"

ముందుకు దారి తీసిన జగదీష్‌ను బుద్ధిగా అనుసరించాను. మానవ సంబం ధాల పునాదులు ఇంకా పల్లెటూరి వాతావ రణంలో సజీవంగా వున్నాయనే నా ఆలో చన సరియైనదేననే నమ్మకం ఈ ఊళ్లో అడుగుపెట్టగానే కలిగినందుకు మనసులోనే సంతోషించాను.

కానీ, విచిత్రం నామీద అంతగా ఎగిరిప డిన అతగాడు ఈ జగదీష్ మాటలకు మౌనంగా తలూపాడు. ఆ మాటే అంటే జగదీష్ నవ్వాడు.

"వాడంతేలెండి. ఈ ఊరిమీద ఈగ వాల నివ్వడు. ఈ ఊరిని కానీ, వాడు పనిచేసే ఆ పాక హోటల్‌ని కానీ మనం ఏమైనా తక్కువచేసి మాట్లాడితే సహించడు. నిజా నికి మనం బుజ్జగించి చేరదీస్తే వాడంత మంచివాడు మరొకడుండడు. మనకే పని కావలసినా చేసిపెడతాడు"

"మీకు నేను రావడంవల్ల ఇబ్బంది..." మాట వరసకు అన్నాను.

"పరవాలేదు మాస్టారూ! దానిదేముంది"

ఇద్దరం సన్నని గతుకులరోడ్డు వెంబడి ఊళ్లోకి నడిచాం.

జగదీష్ వుండేది డాబామీద వేసిన రెండు గదుల పోర్షన్. డాబామీద నుంచుని చూస్తే కనుచూపుమేర ఎటు చూసినా దట్ట మైన కొబ్బరి చెట్లే. ఆ చుట్టుపక్కల ఎక్కువ పెంకుటిళ్లే కనిపిస్తున్నాయి.

"అదేమిటలా అక్కడే నిలబడిపోయారు? " గది తాళం తీసిన జగదీష్ వెనక్కి తిరిగి నన్ను ఆహ్వానించాడు.

"కోనసీమ అందాలు చూస్తున్నాను" గది లోపలకు వస్తూ అన్నాను. 'ఈ ఉద్యోగమే వస్తే ఈ ప్రకృతి సౌందర్యాన్ని ప్రతిరోజూ చూస్తూ వుండవచ్చునుకదా! ఈ అందాలని ప్రతిరోజూ అనుభవిస్తున్న ఈ కోనసీమ వాసులు ఎంతటి అదృష్టవంతులో? '

"ఓ... తెలుగు మాస్టారు కదూ" వ్యంగ్యంగా నవ్వాడు జగదీష్. "దుమ్మును రేపే గతుకుల రోడ్లు, బూజుపట్టిన పాత కాలం పెంకుటిళ్లు, కాలక్షేపం కోసం సిని మాలకు వెడదామన్నా, ఎప్పుడో బీసీ నాటి సినిమాలు, కనీసం ఈ ఊరినుండి బయట పడదామన్నా గంటల తరబడి రోడ్డుపక్కన నిలబడి బస్సుల కోసం ఎదు రుచూడడం, ఇవే నాయనా ఇక్కడ దొరికే అదృష్టాలు"

చిన్నబుచ్చుకున్న నన్ను చూసి గట్టిగా నవ్వాడు జగదీష్.





"నా మాటకు అఫెండవకయ్యా బాబూ! ఏదైనా నిర్మొహమాటంగా మాట్లాడేయడం నాకు అలవాటు. సరే త్వరగా తయారవ్వు. సారీ! ఏకవచన ప్రయోగం చేస్తున్నట్లు న్నాను. బైదిబై మీకే ఉద్యోగం వచ్చేసినట్లే"

"అదేమిటి? " వింతగా చూశాను.

"ఏముంది? ఈ పోస్టుకి అప్లై చేసింది మీరు ఒక్కరే. అయితే మరో రహస్యం మన కాలేజీ కమిటీ ప్రెసిడెంటుగారు చాలా మంది అప్లై చేసినట్లూ, వారందరినీ కాదని మిమ్మల్నే సెలెక్ట్ చేసినట్లు, కాస్త ఆర్భాటం చేస్తారు. గాభరాపడి వారు పెట్టిన కండిషన్లు అన్నిటికీ తల ఊపేయకండి"

నవ్వి ఊరుకున్నాను. అపరిచితులతో మాటలు పెంచే మనస్తత్వం కాదు నాది.

"క్షణక్షణానికీ ఆలోచనల్లోకి జారిపోవడం మీకు అలవాటులా వుంది. త్వరగా తయారవ్వండి. ఆలస్యమైతే కారాలూ, మిరియాలూ నూరడుకానీ, పంక్చువాలిటీమీద మనం శోషవచ్చి పడిపోయే వరకూ ఉపన్యాసం ఇచ్చేస్తాడు మన ప్రిన్సిపాలు"

"మన ప్రిన్సిపాలుగారు చాలా స్ట్రిక్టా? " ఎటూ ఉద్యోగం వచ్చేస్తోందనే నమ్మకంతో ధీమాగా అడిగాను.

"ఆ! అమ్మాయిలకు యముడు. మనకి మొగుడు"

"అదేమిటి? " వింతగా చూశాను.

"అదే, మరి అమ్మాయిలకు మొగుడంటే వీపు చిట్లిపోదూ? " భుజాలు ఎగరేసి మరుక్షణంలోనే గట్టిగా నవ్వుతూ లోపలకు నడిచాడు.

చిత్రమైన మనిషిలా వున్నాడు. ఏమైనా కనీసం ముఖపరిచయమైనా లేని వ్యక్తికి అతిథ్యం ఇవ్వడానికి ముందుకు వచ్చిన సహృదయుడు. అతగాడు తారసిల్లడం ఒక రకంగా అదృష్టమే. కాలేజీకి తయారయ్యేసరికి హోటలునుంచి కాఫీ, టిఫిన్ పొట్లాలు తీసుకుని వచ్చేశాడు సిసింద్రీ.

కాఫీ అలవాటు లేదన్న నావైపు విచిత్రంగా చూశాడు జగదీష్.



"అయ్యా! అదే మనం పనిచేసే విద్యాలయం" కొబ్బరి తోటల మధ్యనుండి కనిపిస్తున్న కాలేజీ బిల్డింగ్సును చూపించాడు జగదీష్.

ఇంత మారుమూల పల్లెటూరిలో కాలేజీ వుండడం ఆశ్చర్యమే. అదే అన్నాను జగదీష్‌తో.

"మన ఖర్మకాలి ఆ కృష్ణమోహన దాసుగారికి చదువంటే వల్లమాలిన అభిమానం. ఎలాగైనా తన ఊరి పిల్లలకు ఆ సరస్వతీదేవి కటాక్షం లభించాలని పట్టుబట్టి, ఈ పదెకరాల కొబ్బరితోట, లక్ష రూపాయల డొనేషన్‌తో కాలేజీకి పునాది వేశారు. దానితో కమిటీ ఫారం అయింది. ఊళ్లో వాళ్ళు కూడా ఉడతాభక్తిగా ఏదో సహాయం చేశారనుకో ఊళ్లో పిల్లలకు చదువు వస్తుందో, చస్తుందో కానీ, మనకు మాత్రం ఏదైనా పర్మినెంటు ఉద్యోగం వచ్చేవరకు ఆశ్రయమిస్తుంది"

కాలేజీ మెయిన్‌గేటు దాటగానే మెయిన్

బిల్డింగు ముందు గులాబీ తోట, మధ్య ఫౌంటెన్, అంతకంటే మరికొంచెం ఎత్తులో వీణాపాణి అయిన చదువుల తల్లి పాలరాతి విగ్రహం. ఎంత చక్కని అభిరుచి.

మెయిన్ బిల్డింగ్‌లోకి అడుగు పెట్టగానే ఎదురుగా గోడమీద కనిపించింది నిలువెత్తు తైలవర్ణ చిత్రం. గిరజాల జుట్టూ, తలపాగా, నుదుట నామం, తీక్షణమైన చూపులు, విశాల నేత్రాలు, గుబురు మీసాలు, సింహాసనం లాంటి కుర్చీలో కూర్చుని వున్న ఆ ఆజానుబాహువు పలకరిస్తున్నట్లే అనిపించింది.

"రాచకళ అంటే ఇదేనేమో? ఇంతకూ ఎవరీయన? " అప్రయత్నంగా అడిగాను.

"మన ఈ కష్టాలకు కారకులైన కృష్ణమోహన్ దాసుగారి తండ్రి భగవాన్‌దాసుగారు. కాలేజీకి ఆయన పేరే పెట్టారుకదా! సరే, ఆ విషయానికేంగాని, అదిగో అదే ప్రిన్సిపాల్ గారి గది. వెళ్ళి దర్శనం చేసుకో" అంటూ సమాధానం కోసం కూడా ఎదురు చూడకుండా చరచరా వెళ్ళిపోయాడు.

ప్రిన్సిపాల్ సౌజన్యారావుగారిని కలుసుకుని నన్ను నేను పరిచయం చేసుకున్నాను.

"ఓ, వచ్చారా! సంతోషం కూర్చోండి" సాదరంగా ఆహ్వానిస్తూనే రిసీవర్ అందుకుని ఎవరికో డయల్ చేశారు.

"గుడ్మార్నింగ్ సర్! నేను సౌజన్యారావును మాట్లాడుతున్నాను. 'మనం ఇంటర్వ్యూకి పిలిచిన విద్యాసాగర్ వచ్చారు. ఆ! ఇప్పుడు ఇక్కడే వున్నారు. ఏమిటీ, అతన్ని మీ దగ్గరికే పంపించమంటారా? సరే సార్! అలాగే, ఇప్పుడే పంపిస్తాను. పోలయ్యనిచ్చి పంపిస్తాను... సరేనండీ... నమస్కారం"

రిసీవర్ పెట్టేస్తూ నా వైపు చూశారు. "కమిటీ ప్రెసిడెంటు భుజంగరావుగారు మిమ్మల్ని చూడాలంటున్నారు. ఒక్కసారి కనిపించి రండి" అంటూనే కాలింగ్‌బెల్ నొక్కాడు.

"మరి ఇంటర్వ్యూ" సందిగ్ధంగా అన్నాను.

"బహుశా అక్కడే చేస్తారేమో? " అంటూ అప్పుడే లోపలకు వచ్చిన నడివయసు వ్యక్తి, బహుశా పోలయ్యేననుకుంటా, అతనితో అన్నారు. "ఇదిగో పోలయ్యా! మాస్టారుగారిని అయ్యగారింటికి తీసుకువెళ్ళు" అంటూనే ఫైల్లో తల దూర్చారు.

చేసేదిలేక ఒక నమస్కారం పెట్టి పోలయ్యను అనుసరించాను.

★ ★ ★

రెండంతస్థుల అధునాతన భవనం, విశాలమైన ఎత్తు అరుగుల ఇల్లు. ఆ అరుగుల మీదనే నాలుగు కుర్చీలు వేసివున్నాయి. పోర్టికోలో కారు ఆగివుంది.

"కూర్చోండి బాబూ! అయ్యగారికి చెప్పి వస్తాను" కుర్చీ చూపించి లోపలకు నడిచాడు పోలయ్య. కుర్చీలో కూర్చుంటూ చుట్టూ పరీక్షగా చూశాను. ప్రహరీగోడ దగ్గరనుండి ఇంటివరకూ నాపరాయి పరచి వుంది. ఆ పరిసరాలన్నీ ఎంత పరిశుభ్రంగా వున్నా, ఆ స్థలంలో పూలమొక్కలను పెంచి వుంటే, మనసుకి ఎంత ఆహ్లాదాన్ని కలిగించి వుండేది? అని అనుకోకుండా వుండలేకపోయాను.

మొదటి ఉద్యోగ ప్రయత్నంలోనే విజయం సాధించినందుకు నన్ను నేను అభినందించుకుంటూ కమిటీ ప్రెసిడెంటు గారి దర్శనంకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను. పది నిమిషాలు, పదిహేను... ఆఖరికి అరగంట గడచిపోతున్నా ఎవరూ బయటికి వచ్చే సూచనలు కనిపించలేదు. లోపలకు వెళ్ళిన పోలయ్య జాడలేదు. కాలేజీలో ఇంటర్వ్యూ వుండగా ఇంటికి రమ్మని చెప్పడమేమిటో, తీరా వచ్చిన తరువాత వారి ఇంటిముందు ఈ పడిగాపులు పడి వుండడమేమిటో అంతా అయోమయంగా వుంది.

"కాఫీ తీసుకోండి బాబూ" ఆలోచనల్లోంచి బయటపడ్డాను. ఎదురుగా పోలయ్య కాఫీ కప్పుతో కనిపించాడు. కాఫీ అలవాటు





లేదని చెప్పి అన్నాను.

"చూడు పోలయ్యా! అయ్యగారికిప్పుడు తీరికలేదేమో? తరువాత మళ్ళీ వద్దాం. ఎప్పుడు వీలవుతుందో ఒక్కసారి కనుక్కుని వస్తావా? " పోలయ్య కళ్లలో భయం తొంగి చూసింది.

"అయ్యగారు భోజనం చేస్తున్నారు బాబూ! అయిపోయింది. ఒక్క క్షణం కూర్చోండి" అంటూనే కంగారుగా లోపలకు నడిచాడు.

మళ్ళీ నిరీక్షణ... క్షణాలు లెక్కపెట్టు కుంటూ, గోళ్ళు కొరుక్కుంటూ... ఫోనులో రమ్మని చెప్పి భోజనం దగ్గర కూర్చుంటాడా ఈ పెద్ద మనిషి? అయినా ఇంతసేపు భోజనం చేయడమేమిటి? ఒకవేళ నా ఓర్పును పరీక్ష చేస్తున్నారా? ఇంతకూ ఇంటర్వ్యూ ఎక్కడ? ఎప్పుడు? ఇదేనా ఇంటర్వ్యూ? ఇక చివరకు విసుగుపుట్టి, ఉద్యోగం పోతే పోయిందని వెనుదిరిగే సమయానికి లోపలకు రమ్మంటున్నారనే శుభవార్తను మోసుకువచ్చాడు పోలయ్య.

పోలయ్య వెంట లోపలకు నడిచాను. చిన్న వసారా గది దాటి విశాలమైన హాలు లోకి ప్రవేశించాను. హాలు మధ్యలో ఉయ్యాల బల్లమీద శేషసాయిలా పవళించి వున్న ఆ అరవైయేళ్ల బట్టతల పెద్దమనిషే భుజంగరావుగారు అయివుండాలి. ప్రస్తుతం తాంబూల సేవనంలో వున్నారు.

హాలులో తగిలించి వున్న చిత్రపటాలను చూడగానే మనసంతా జుగుప్సతో నిండిపో యింది.

"రావయ్యా పంతులూ! రా, ఆ! ఎప్పుడు వచ్చావ్? ప్రయాణం సుఖంగా జరిగిందా? "

ఆ పలకరింపుకే బిత్తరపోయాను. పక్కనే వుంది సోఫాసెట్టు. కనీసం కూర్చోమని కూడా అనకుండా నిలబెట్టి మాట్లాడుతున్న ఆ వ్యక్తిని గురించి ఏమనుకోవాలో నాకు అర్థంకాలేదు. అయోమయంగానే ఆయన అడిగిన ప్రశ్నలకన్నిటికీ సమాధానాలు చెప్పాను. ఇదేనా ఇంటర్వ్యూ?

"జాగ్రత్తగా పని చేసుకుంటూ వుండ వయ్యా పంతులూ! మా కమిటీ మెంబ ర్లంతా వాళ్ల వాళ్ల కాండిటేట్స్ ఎవరెవరో వున్నారని అంటున్నారనుకో. అయినా రిక మెండేషన్స్‌తో వచ్చినవాళ్లు తిన్నగా పనిచే స్తారటయ్యా! మొన్నటికి మొన్న మంత్రిగారి తోనే ఉత్తరం రాయించుకుని వచ్చాడొక కుర్రాడు. వస్తూనే ఆ కాగితం నా మొహాన కొట్టి అదిగో, ఆ సోఫాలో కాలుమీద కాలు వేసుకుని దర్జాగా కూర్చున్నాడు ఉద్యోగం ఎవడికోసం ఇస్తావన్నట్లు. నిజం చెప్పద్దూ తీరా ఉద్యోగం ఇచ్చానంటే, అతగాడు నా నెత్తిమీద కూర్చుంటాడు. నువ్వేదో బుద్ధి మంతుడిలా వున్నావు. పెద్దలంటే భయభ క్తులు వున్నాయి. నాకు నచ్చావు. నీకే ఈ ఉద్యోగం ఇవ్వాలని వుందయ్యా" జగదీష్ మాటలు మనసులో మెదలగా నాలో నేనే నవ్వుకున్నాను.

"ఊ! ఇకవెళ్లు. మా పెద్దవాళ్ల మాటలకు ఎదురు చెప్పకుండా నీ పని నువ్వు చూసుకో. మీ ప్రిన్సిపాల్‌గారితో నేను మాట్లాడుతానులే. వెళ్ళి నీ డ్యూటీలో చేరిపో"

శ్రీమాన్ భుజంగరావుగారి అనుమతితో 'బతుకుజీవుడా' అనుకుంటూ ఆ ఇంటినుంచి బయటపడ్డాను. బస్సు దిగగానే తారసపడ్డ ఆ పదేళ్లకుర్రాడు, ఇప్పుడీ పెద్దాయన. ఒక్క క్షణం కోనసీమ అంటేనే భయం పట్టు కుంది. 'ఉద్యోగం వద్దూ, పాడూ వద్దు. సాయంత్రం బస్సుకే తిరుగు ప్రయాణం కడదామా' అనిపించింది. కానీ మొదటి ప్రయత్నంలోనే వచ్చిన ఉద్యోగాన్ని వదులు కోబుద్ధి కాలేదు.

పైగా అమ్మా, నాన్నా వద్దు వద్దంటూ వుంటే వాళ్ళ మాటను కాదని వచ్చాను.

"ఇంత మహానగరంలో ఉద్యోగాలకే కరువు వచ్చిందేమిట్రా, ఎక్కడో మారు మూల పల్లెటూరికి వెడతానంటావేమిటి?

అక్కడ భోజన సదుపాయం వుండదు. నువ్వక్కడ ఒక్క క్షణం వుండలేవు" అమ్మ మొదటినుండీ పోరుతూనే వుంది.

ప్రయాణానికి ముందురోజు అప్పుడే షాపింగుపని చూసుకుని ఇంట్లో అడుగుపె డుతున్న నాకు నాన్న మాటలు చెవినప డ్డాయి. 'ఆ వాడి మొహం. కొత్తగా ఉద్యోగం వచ్చిందనే ఉబలాటంకానీ, ఆ పల్లె టూరిలో వీడెక్కడ వుండగలడు? నాలుగు నెలల్లో పరుగెత్తుకు రాడూ? నువ్వు అదేప నిగా వెళ్లవద్దని అనకు. మనం వద్దన్నకొద్దీ మొండికెత్తుతాడు'

నాన్న మాటలు గుర్తుకు రాగానే పౌరుషం వచ్చింది. తీరా వెనక్కి వెళ్ళా నంటే...? సరే చూద్దాం, ఎప్పుడు వుండలే కపోతే అప్పుడే రిజైన్ చేసి వెళ్ళిపోవచ్చు కాలేజీలో ప్రిన్సిపాల్‌గారిని కలుసుకున్నాను. అపాయింటుమెంట్ ఆర్డర్ ఇచ్చేముందే కాంట్రాక్ట్ ఫారమ్‌మీద సంతకాలు చేయాల న్నారు. రెండేళ్లలోగా ఉద్యోగానికి రాజీ నామా చేస్తే, ఆరు నెలలజీతం కాలేజీ వారికి చెల్లించాలి. ఇదేదో ఛాలెంజ్‌లా వుంది. చూద్దాం అయినా రెండేళ్లకాలం ఎంతలో గడుస్తుంది అనుకుంటూ సంత కాలు పెట్టి, వెంటనే జాయినింగ్ రిపోర్ట్ ఇచ్చి డ్యూటీలో జాయినైపోయాను.

ఈ క్షణంనుంచి నేనొక బాధ్యత కలిగిన కాలేజీ లెక్చరర్‌ని. యువతరాన్ని సక్రమ మైన మార్గంలో పెట్టడానికి నా వంతు కర్త వ్యాన్ని నిర్వహించవలసిన నైతిక బాధ్యత ఈ క్షణంనుంచీ నామీద కూడా వుంది. ఆ ఆలోచనే నాకెంతో ఉత్తేజాన్ని కలిగిస్తోంది.

మల్లయ్య దారి చూపిస్తుండగా వెయి టింగు రూముకి దారితీశాను.

★ ★ ★

"కొత్త లెక్చరర్‌గారికి స్వాగతం, సుస్వా గతం" నాటకీయంగా స్వాగతం పలికాడు జగదీష్.

మధ్యాహ్నం విరామ సమయం కావ డంతో లెక్చరర్స్ అందరూ వెయిటింగు రూములోనే వున్నారు. లెక్చరర్స్ అందరినీ పేరు పేరునా పరిచయం చేశాడు జగదీష్.

"హైదరాబాదులో చదువుకుని ఉద్యోగం కోసం ఇంత దూరం వచ్చారేమిటండీ బాబూ! ఈపాటి ఉద్యోగం ఆ మహాపట్ట ణంలో దొరక్కపోయిందా? " దాసుగారనే ఒక లెక్చరర్ సూటిగా అడిగారు. మిగిలిన వాళ్లు అడక్కపోయినా వాళ్ళ మొహాల్లో అదే ఆశ్చర్యార్థకం.

పల్లెటూళ్లలో ఉద్యోగం చేయాలనుకో డంలో అంత ఆశ్చర్యం కలిగించేదేముందో నాకు అర్థంకాదు. అక్కడ హైదరాబాదు లోనూ అంతే, నా స్నేహితులందరకూ హేళనే. స్వచ్ఛమైన పల్లెపట్టున వుండాలనేది నా చిరకాలవాంఛ అంటే వాళ్ళందరకూ నవ్వులాటగా వుండేది. మళ్ళీ అదే సమా ధానం చెప్పి ఇక్కడా అదే పరిస్థితిని ఎదు ర్కోవడం ఇష్టంలేక మౌనం వహించాను.

మామూలు పలకరింపుల తరువాత ఊళ్లో వుండే లెక్చరర్లు ఇళ్ళకు వెళ్ళిపో యారు. పొరుగూరివారు మాత్రం ఒక మూల టిఫిన్ బాక్సులు సర్దుకుంటున్నారు.

"మనం కాంటీన్‌కి వెడదాం" ముందుకు దారితీసిన జగదీష్‌ను అనుసరించాను.

కాలేజీ ఆవరణలోని మామిడిచెట్ల కింద కూర్చుని బుద్ధిగా చదువుకుంటున్నారు కొంతమంది విద్యార్థులు, మరికొంతమంది తమతో తెచ్చుకున్న టిఫిన్ బాక్సులు తెరు స్తున్నారు. ఇంకా కొంతమంది కాలక్షేపం కోసం లేడీస్ వెయిటింగు రూము చుట్టుప క్కల పహరా కాస్తున్నారు.

మేం కాంటీన్‌కి వెళ్ళేసరికి బల్లలన్నీ క్లీన్ చేస్తున్నాడు ఒక కుర్రాడు. జగదీష్ వారితో కబుర్లు చెబుతుంటే అనిపించింది మాట్లా డడం కూడా ఒక కళేనని, టిఫిన్ తీసుకున్న తరువాత బిల్లు చెల్లించబోయిన నన్ను వారించాడు జగదీష్.

"మా పెద్దవాళ్ల మాటలకు ఎదురు చెప్ప





కుండా నీ పని నువ్వు చేసుకుంటూ వుండయ్యా పంతులూ! ఏదో బుద్ధిమంతుళ్ళా వున్నావ్. నాకు నచ్చావ్" ప్రెసిడెంటుగారి గొంతును అనుకరిస్తూ మాట్లాడుతున్న జగదీష్‌వైపు తెల్లబోయి చూశాను.

"మరీ, అంత అమాయకంగా మొహం పెట్టకయ్యా బాబూ! మెత్తగా వుంటే మొత్త బుద్ధి అవుతుంది"

"ఆయన అన్న మాటలు మీకెలా తెలిశాయి? " ఇంకా ఆశ్చర్యం నుండి తేరుకోలేదు నేను.

"చూడు బాబూ! నీకంటే నాలుగైదేళ్ళు ముందు పుట్టి వుంటాను. నాలుగేళ్లుగా ఈ కాలేజీలో పనిచేస్తున్నాను. ఇంక రెండుమూడేళ్లలో గవర్నమెంటు ఉద్యోగం రాకపోతే, చచ్చినట్టు రిటైరయ్యేదాకా ఈ కాలేజీలో పడి వుండవలసినవాడిని. ఎవరెలాంటివాళ్లో ఆ మాత్రం గ్రహించలేనా? ఇంతకూ సస్పెన్స్ ఎందుకుగాని, ఆ మహానుభావుడు ఎవరు ఇంటర్వ్యూకి వచ్చినా మొదట మాట్లాడే మాటలే అవి"

"ఏమో నాకాయన తీరేమీ నచ్చలేదు" అసంతృప్తిగా అన్నాను. "ఉద్యోగానికి వచ్చాం కానీ, వారింటి పనివాళ్లం కాదుగా? ఇంటికి వచ్చిన వారిని కనీసం కూర్చోమని కూడా చెప్పకుండా నిలబెట్టి మాట్లాడే ఆయన సంస్కారం..."

"స్టాప్... స్టాప్!" మధ్యలోనే అందుకున్నాడు జగదీష్. "ఆయన దయాదాక్షిణ్యాలతో ఉద్యోగంలో చేరి, ఆయన మోచేతి నీళ్లు తాగి పడివుండవలసిన నువ్వు ఆయన ఎదుట కుర్చీలో కూర్చోవడమా? ఎంత సాహసం? ఈరోజు కుర్చీలో కూర్చోనిస్తే, రేపు ఆయన నెత్తినెక్కి స్వారీ చేయవూ? ఎక్కడ వాళ్ళనక్కడ వుంచకపోతే..." చటుక్కున నవ్వేసి అన్నాడు. "ఈ అభిప్రాయం నాది కాదు, శ్రీమాన్ భుజంగరాయలవారిది. అసలు మన ప్రిన్సిపాల్‌గారికే ఆయనెదురుగా కుర్చీలో కూర్చునే సాహసం లేదు తెలుసా! మరో విషయం, ఈ కాలేజీలో భుజంగరావుగారి చెంచాగాళ్లు కొంతమంది వున్నారు. ఇంకెప్పుడూ ఈ కాంపస్లో ఆ మహానుభావుడిపై నీ అమూల్యాభిప్రాయాలను బయటకు రానివ్వకు. ఏదో ఉద్యోగం కోసం వచ్చాం. మంచి ఉద్యోగం వచ్చేవరకూ మనపని మనం చూసుకుని బయటపడితే ఆరోగ్యానికి మంచిది. అవునూ, అదేమిటయ్యా! చాలాసేపటినుంచి నిన్ను 'నువ్వు, నువ్వు' అనేస్తున్నట్లున్నాను"

జగదీష్ మాటలకు నవ్వి అన్నాను. "మరేమీ ఫరవాలేదు. మీరలా అంటేనే నాకు ఫ్రీగా వుంటుంది"

"అయితే ఇంకేం, నువ్వు కూడా ఏకవచన ప్రయోగంలోకి దిగిపో"

★ ★ ★

మధ్యాహ్నమే సెకండియర్ బి.ఎ. వాళ్లకు క్లాసు తీసుకోవలసి వచ్చింది. సెకండ్ బి.ఎ. అంటే అప్పటికే కొంత రాటు తేలివుంటారు. ఏమాత్రం ఛాన్స్ దొరికినా తాటాకులు కట్టి ఒక ఆట ఆడిస్తారు.

ఏభైమంది విద్యార్థులు వున్న క్లాసులోకి మొట్టమొదటిసారిగా అడుగు పెడుతుంటే కాళ్లు వణికాయి. అరిచేతుల్లో చెమట పట్టింది. అటెండెన్స్ తీసుకున్న తరువాత ముందుగా నన్ను నేను పరిచయం చేసుకుని విద్యార్థుల పరిచయం కోరాను.

"పాఠం చెప్పుకోవడానికి వచ్చిన మాస్టారు, తన పనేదో తాను చూసుకోక ఈ పరిచయ కార్యక్రమాలు ఎందుకో? " వెనుక బెంచీలనుండి పొగరుగా వినిపించిందొక కంఠస్వరం.

మనస్సు చివుక్కుమన్నా మెల్లిగా సర్దుకున్నాను. మొదటిరోజు, మొదటి క్లాసు ఏ విధమైన నిరుత్సాహాన్ని మనసులో ప్రవేశించనివ్వకూడదు. స్టూడెంట్స్‌దేముంది? మైనపు ముద్దలాంటివాళ్ళు. వారిని ఆకట్టుకుని నా దారికి తెచ్చుకోవాలి. మెల్లిగా తేరుకుని చిరునవ్వు నవ్వాను.

"అసలు మన తల్లిదండ్రులు మనకు పేర్లు ఎందుకు పెడతారు? 'రామూ! భోజనానికి రారా' అని అమ్మ పిలిచినదానికీ, 'ఒరేయ్! భోజనానికి రారా' అని పిలిచిన దానికీ తేడా లేదూ? పోనీ తేడా ఏమీలేదనే అనుకున్నా. ఆ ఒరేయ్ అన్న పిలుపుకు ఏ బిడ్డ సమాధానం చెప్పాలి? నలుగురు బిడ్డల తల్లికే పిల్లలను పేరుపెట్టి పిలవడం తప్పనిసరి అయినప్పుడు ఏభైమంది పిల్లలున్న క్లాసులో మాస్టారికి పిల్లల పేర్లు తెలుసుకోవలసిన అవసరం వుండదూ? మిమ్మల్ని ఏదైనా ప్రశ్న చేయాలంటే, ఒరేయ్ అని పిలవాలా? లేక ఏరా అని పిలవాలా? అదీ కాకపోతే మీరు డబ్బు కట్టి కాలేజీలో చేరుతున్నారు. మేం డబ్బు తీసుకుని చదువు చెబుతున్నాం. కాబట్టి ఏమండీ అని పిలవాలా? అయినా ఏమండీ అని ఎవరు ఎవరిని పిలుస్తారో మీకు బాగా తెలిసేవుండాలే" చివరి మాటకు క్లాసంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు.

క్లాసులోని వాతావరణం తేలిక అయింది. కానీ చివరి వరుసల్లోని ఒక కుర్రాడి మొహం మాత్రం మాడిపోయింది. ఒకరి తరువాత ఒకరు లేచి తమతమ పరిచయాలు చేసుకుని కూర్చుంటున్నారు. వారి హాబీలు ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాను నేను. కానీ చాలామందికి సినిమాలు చూడడం తప్ప వేరే హాబీ ఏమీలేదు. తెలుగు సాహిత్యాన్ని ఔపోసన పట్టి వుంటారనే అత్యాశ నాకేమీ లేదుకాని, చాలామందికి కనీసం పత్రికలు చదివే అలవాటు కూడా లేకపోవడం కొంత నిరుత్సాహాన్నే కలిగించింది. అయినా టీవీలు వచ్చాక చదివే అలవాటు అందరిలోనూ తగ్గిపోతున్నదనే విషయం ఈమధ్య కాలంలో బాగా తెలిసివస్తోంది. కనీసం కొంతమంది విద్యార్థులకైనా స్పోర్ట్స్‌లో ఇంట్రెస్టు వుండడం సంతోషాన్ని కలిగించింది.

క్లాసులో వున్న పదిమంది ఆడపిల్లల్లోనూ ఒకమ్మాయి మాత్రం నిర్లక్ష్యంగా అందరి వైపూ చూస్తూ కూర్చుని వుండడం మొదటి నుండి గమనిస్తూనే వున్నాను. చివరిగా తనవంతు వచ్చేసరికి కనీసం లేచి నిలబడే ప్రయత్నమైనా చేయకుండా కూర్చునే ముక్తసరిగా చెప్పింది.

"భుజంగరావుగారి మనుమరాల్ని" అహంభావం, అతిశయమూ ఆ అమ్మాయిలో అణువణువునా తొంగిచూస్తున్నాయి.

"అదేమిటి అలాంటి పేరు ఈ రిజిష్టర్‌లో లేదే? కొత్తగా చేరావా? అయినా ఇలాంటి పేరు నేనెప్పుడూ వినలేదు. తమాషాగా వుందే" కావాలనే వ్యంగ్యంగా అన్నాను. క్లాసంతా మరొక్కసారి ఘొల్లుమంది.

ఒక్కసారి నావైపు మింగేటట్లు చూసి తలవంచుకుని మెల్లిగా గొణిగినట్లుగా అంది 'రంజిత'.

సరే, పరిచయం కార్యక్రమం అయింది కాబట్టి ఇక క్లాసు తీసుకోవాలి. కానీ ఇంత వరకు క్లాసు పుస్తకమే చూడని నేను ఇప్పటికిప్పుడు పుస్తకం చూసి పాఠం చెప్పాలని ప్రయత్నం చేయడం తెలివితక్కువతనమే. అలాగని క్లాసుని వదిలేయలేను. ఏంచేయాలో తోచలేదు.

"మాస్టారూ! ఒక్క సందేహం" హరి అన్న పేరుతో పరిచయమైన విద్యార్థి లేచి నిలబడ్డాడు. పైకి అమాయకంగా మొహం పెట్టినా కళ్లు కొంటెతనంతో మెరుస్తున్నాయి. ఏమిటో చెప్పమన్నాను.

"దేశం సాంకేతికంగా ముందుకు పోతున్నప్పుడు అసలు తెలుగుభాష యొక్క ఉపయోగమేమిటి సార్? " ఎక్కడలేని సిన్సియారిటీని అరువు తెచ్చుకున్నాడు.

ఏంచెబుతానా? అని క్లాసంతా కుతూహలంగా గమనిస్తోంది.

"అయితే, మరి ఇంగ్లీషు భాష యొక్క ప్రయోజనమేమిటి? " ఎదురుప్రశ్న వేశాను.

"మరి పై చదువులకు విదేశాలకు వెళ్లా





లన్నా, సైన్సులోని అభివృద్ధిని అవగాహన చేసుకోవాలన్నా, ఇంగ్లీషు భాష రావాలి కదండీ"

"అయితే మీరిప్పుడు తెలుగు మీడియం లోనే చదువుతున్నారు కదా మరి తెలుగు అక్కరలేదంటే ఎలా? "

"తెలుగు మీడియంలో చదువుకునే పాటి తెలుగు మాకు వచ్చుకదా!"

"అయితే గ్రూపు ఇంగ్లీషు మీడియంలో చదివితే సరిపోతుందికదా! ఇంగ్లీషు మీడియంలో చదివేవారికి కూడా ఇంగ్లీషు సబ్జెక్టు వేరే ఎందుకు? "

ఏంసమాధానం చెప్పాలో తోచక బిక్క మొహం పెట్టిన అతగాణ్ణి చూసి స్నేహపూర్వకంగా నవ్వి అన్నాను.

"అసలు నువ్వు అడగాలని అనుకుంటున్నది తెలుగు సాహిత్యం యొక్క ప్రయోజనమేమిటి? అని అవునా? "

"అవును సార్" ఉత్సాహాన్ని పుంజుకున్నాడు అతగాడు. "అందులోనూ ప్రాచీనసాహిత్యం, నన్నయ్య, తిక్కన అంటూ మా ప్రాణాలు తీస్తున్నారుకదా!" అతనలా ప్రశ్నించడంతో క్లాసు ఎలా తీసుకోవాలా అనే సమస్య తీరింది. అతన్ని కూర్చోమని చెప్పి ప్రారంభించాను.

"సాహిత్యం ఒక దేశసంస్కృతిని తెలియజేస్తుంది. దేశచరిత్రను కళాత్మకంగా తరువాత తరంవారికి అందిస్తుంది. జనసామాన్యంలో దేశభక్తిని పెంపొందింపజేస్తుంది" అంటూ ప్రారంభించి, నన్నయ కాలంనుంచి సాహిత్యం ఏయే యుగాల్లో ఏవిధంగా మారుతూ వచ్చిందో, ఏయే యుగాల్లో ఏయే ప్రయోజనాలను సాధించిందో, ఏయే ఉద్యమాలకు ఆలంబనగా నిలిచిందో మధ్య మధ్య పద్యాలనూ, గేయాలనూ ఉదహరిస్తూ చెబుతుంటే విద్యార్థులంతా మంత్ర ముగ్ధుల్లా విన్నారు.

మన జాతీయోద్యమ సాహిత్యం దగ్గరికి వచ్చేసరికి బెల్ వినిపించడంతో ఇక ఉపన్యాసాన్ని చాలించి "రేపటినుండి క్లాసు పాఠాలు ప్రారంభిద్దాం" అనేసరికి పిల్లలంతా ఒక్కసారిగా గోల ప్రారంభించారు. "జాతీయోద్యమ సాహిత్యం గురించి పూర్తిగా చెప్పాలి. ఇప్పుడే చెప్పాలి" అంటూ. ఎంత సర్ది చెప్పినా ప్రయోజనం లేకపోయింది.

"ఫరవాలేదు మాస్టారూ! మీరు పూర్తిచేయండి" ఎప్పుడు వచ్చారో హిస్టరీ లెక్చరర్ మోహనరావుగారి మాటలతో ఒక్కసారి గుమ్మంవేపు చూశాను.

"మీ క్లాసుకి ఇబ్బంది" నా మాటలకు మెల్లిగా నవ్వారు. "అసలు మనవాళ్లు వినాలనే కుతూహలం చూపించడమే విశేషం. ఫరవాలేదు మీరు కానివ్వండి"

ఇక తప్పలేదు. మోహనరావుగారికి సాహిత్యంపట్ల చక్కని అభిరుచి వుంది. జాతీయోద్యమ సాహిత్యం గురించి నేను పద్యాలూ, గేయాలు ఉదహరిస్తుండగా, మధ్య మధ్య వాటి చారిత్రక నేపథ్యాన్ని గురించి మోహనరావుగారు వివరిస్తుంటే ఆ పీరియడ్ క్షణంలో గడిచిపోయింది.

మోహనరావుగారూ, నేనూ బయటకు వస్తుండగా గుమ్మంలోనే ఎదురుపడ్డారు ప్రిన్సిపాల్ గారు 'కంగ్రాట్యులేషన్స్' అంటూ.

"థాంక్స్" చెబుతూ సంతోషంతో తలమునకలవుతూ మోహనరావుగారిని అనుసరించాను. మొదటిరోజు అనుభవం కొండంత ఆనందాన్ని ఇస్తోంది.

"మాస్టారూ!" వెనుకనుండి పిలుపు వినిపించడంతో ఆగి వెనక్కి చూశాను. క్లాసు రూములోంచి పరిగెత్తుకు వస్తున్నాడు ఒక కుర్రాడు.

"శుభం! ఇప్పుడిక వీళ్ళ అభిమానంలోంచి బయటపడి మెల్లిగా వెయిటింగ్ రూముకి రండి" చిరునవ్వు నవ్వుతూ వెయిటింగ్ రూమువైపు దారితీశారు రావుగారు.

"నన్ను క్షమించండి మాస్టారూ! చాలా దురుసుగా ప్రవర్తించాను" చిన్నబుచ్చుకున్న మొహంతో అన్నాడు హరి అన్న పేరుతో



# సచిత్ర విచిత్రం



## బుంగ పట్మా

పూల ప్రపంచానికి రాఫ్లేసియా పుష్పం ఓ మహారాణీ వంటిది. బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు సర్ థామస్ స్టాంఫర్డ్ రాఫ్లెస్ 1818 లో ఈ పుష్పాన్ని సుమత్ర ద్వీపంలో తొలిసారిగా కనుగొని ఓ చరిత్ర సృష్టించారు. తదాది ఆ పుష్పానికి ఆయన పేరే రాఫ్లేసియా అని పెట్టబడింది. బహుసుందరమైన ఈ పుష్పం 15 నుంచి 18 పౌండ్ల బరువు ఉంటుంది. వర్షపాతం హెచ్చుగా గల ఇండోనేషియన్ ద్వీపాల్లో, జావా, సుమత్ర ద్వీపాల్లో, మలేషియా, థాయ్‌లాండ్, ఫిలిప్పీన్స్ లలో ఈ పుష్పాలు చూపరులకు నేత్రానందాన్ని కలిగిస్తాయి. ప్రపంచంలో అతిపెద్ద పుష్పంగా ఇది కొనియాడబడుతోంది. ఈ జాతి పుష్పాలు ప్రపంచ వ్యాప్తంగా 12 వరకూ ఉన్నప్పటికీ రాఫ్లేసియా పుష్పానికే పేరు ప్రఖ్యాతులు లభించాయి. దీనిక 'బుంగపట్మా' అనే మరో పేరు కూడా ఉంది. పట్మా అంటే పద్మం అనీ, బుంగ అంటే పువ్వు అనీ అర్థం.

పరిచయమయిన ఆ కుర్రాడు.

హరి భుజంమీద చెయ్యివేసి అనునయంగా అన్నాను. "క్షమించవలసినంత అపరాధం నువ్వేమీ చేయలేదుగా హరీ! క్లాసుకి వెళ్లు. తరువాత మాట్లాడుకుందాం. క్లాసులో నేను మీకు టీచర్నికానీ, కాలేజీ బయట మనం స్నేహితులమే సుమా!"

"మాస్టారూ!" పరిగెత్తుకు వచ్చాడు వాసు అనే మరో కుర్రాడు. "మాస్టారూ! రేపు కూడా మీరే మా క్లాసు తీసుకోవాలి"

"ఎందుకు అసలు పాఠాలు మాని పురాణ కాలక్షేపం చేద్దామనా? అయినా ప్రిన్సిపాల్ గారూ, హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంటూ ఏ క్లాసు తీసుకోమంటే ఆ క్లాసే తీసుకోవాల్సిగా! ఇంతకూ శాస్త్రిగారు ఈరోజు కాలేజీకి రాలేదట. రేపు వచ్చిన తరువాత ఏం చెబుతారో చూద్దాం"

"పొలం పనుల రోజుల్లో ఆయనెప్పుడూ సెలవులోనే వుంటారు లెండి" హరి మాటల్లోని నిర్లక్ష్యానికి గతుక్కుమన్నాను. "సరే సరే, లెక్చెరర్‌గారు క్లాసులోకి వెడుతున్నారు. మీరు వెళ్లండి తరువాత మాట్లాడుకుందాం" అంటూ స్టాఫ్ రూమువైపు కదిలాను.

ఆ రోజు సాయంత్రమే ఉద్యోగంలో చేరినట్లు నాన్నగారికీ, మొదటి క్లాసు అనుభవం అమ్మకీ లెటర్స్ రాసి పోస్టుచేశాను. మొదటి ఘట్టం పూర్తి అయింది. ఇక గూడు వెతుక్కోవాలి.

"ఈ ఊళ్లో ఇంతకుమించిన రాజభవనం మరొకటి దొరకదయ్యా! ఊళ్లో కాలేజీ పెడుతున్నారని తెలియగానే అద్దె డబ్బులు వస్తాయని డాబామీద ఈ రెండు గదులూ కట్టి పారేశాడు మా ఇంటాయన, అదే ఇంటిగలాయన అనుకో. ఇక్కడ ఇళ్లన్నీ చాలా సైంటిఫిగ్గా కడతారులే. ఇంటికి ఉత్తరంవైపు పాతిక గజాలదూరంలో బాత్‌రూం కడితే, దక్షిణంవైపు ఏభైగజాలదూరంలో లేవటరీ కడతారు. సెప్టిక్‌లెట్రిన్ అయినా సరే. ఆరు నెలలపాటు బతిమాలి సెప్టిక్ లెట్రిన్ గురించి వివరించి చెప్పి, ఈ డాబామీద ఆ మూల బాత్‌రూమూ, లెట్రినూ కట్టించేసరికి నా తాతలు దిగివచ్చారనుకో. అప్పటికీ ఏదో మనమీద కాస్త గౌరవంవుండి ఏడ్చిందనుకో. ఎందుకు వచ్చిన గొడవ కానీ, ఏదో ఇలా అడ్జస్ట్ అయిపోదాం"

"కానీ, మీకు ఇబ్బంది" మెల్లిగా నసిగాను.

"మధ్య నాకు ఇబ్బంది ఏముందయ్యా! మా ఆవిడ డెలివరీకి వెళ్ళింది. వాళ్ళ అమ్మా నాన్నలకు ఏకైక గారాల కూతురులే. అందుకని నెల తప్పిన వెంటనే, ఈవిడగారు తన ఆపసోపాలన్నీ వాళ్ళ అమ్మకి రాయడం, వెంటనే ఆవిడని తీసుకువచ్చి దింపమని మా మామగారు ఒక ఆర్డర్ పాస్‌చేయడం, బుద్ధిగా ఆవిడని తీసుకువెళ్ళి వాళ్ళ ఇంటిలో దిగబెట్టడం జరిగింది. ఆవిడకి నెలలు నిండాలి. బిడ్డకు ఏ ఏడో మాసమో రావాలి. ఎంతలేదన్నా సంవత్సరం తిరిగి రావాలి. అంతవరకూ 'ఒంటరిగా ఎలా కాలక్షేపం చేయాలిరా భగవంతుడా!' అనుకుంటూ తిరిగి వస్తుంటే, నువ్వు తగిలావు. ఆవిడ వచ్చేసరికి నీకో గూడు గాలిద్దాంలే. ఈలోగా నాకు గవర్నమెంట్ ఉద్యోగం వస్తే సమస్యే లేదు. 'సరే' అనవయ్యా బాబూ నీకంత మొహమాటంగా వుంటే, ఖర్చు చెరిసగం భరిద్దాంలే"

ఇక నాకు అభ్యంతరం చెప్పవలసిన అవసరం లేకపోయింది.

"అమ్మయ్య! చాలా థాంక్స్ గురూ గారూ! నువ్వు ఒప్పుకోకపోతే ఏం చెయ్యాలా అని తెగ బెంగపడిపోయాననుకో! వెధవది, మాట్లాడే తోడు లేకపోతే ఒక్క క్షణం తోచదు. పిచ్చెక్కి పోతుంది. పోనీ ఇంటిగలాయనతో కబుర్లు చెబుదామా అంటే, ఆ మానవుడికి ఒళ్లంతా అనుమానమే. వాళ్ళ కూతుళ్లకి లైన్ వేయడానికే తన ఇంటిలోకి వస్తున్నామనుకుంటాడు. ఆ ఇంట్లో ఆయన తప్ప మరో మొగపురుగు లేదు. మన

చూపులకే ఆయనగారి అయిదుగురు కూతుళ్లూ అపవిత్రం అయిపోతారేమోననే భయం ఆ ముసలాడికి" గట్టిగా నవ్వాడు జగదీష్.

జగదీష్‌తో కలసి వుండడంవల్ల నాకు భోజనం సమస్య కూడా తీరిపోయింది. జగదీష్‌ది వంటలో నలభీమ పాకమే.

"గురూగారూ! కాస్త చాకు ఇలా అందుకో!"

"గురూ! కాస్త నీళ్ళు తెచ్చిపెడుదూ"

"బాబ్బాబు కాస్త బియ్యం కడిగి తెచ్చి పెడుదూ" ఇదీ వరుస.

జగదీష్ పుణ్యమా అంటూ కొత్త చోట ఏ ఇబ్బందీ లేకుండా రోజులు గడిచిపోతున్నాయి. వచ్చిన చికాకంతా ఏదో వసపోసినపిట్టలా ఎప్పుడు చూసినా ఏదో ఒకటి అలా మాట్లాడుతూనే వుంటాడు. ఆదివారం వచ్చేసరికి ఇంటిని పేకాట క్లబ్బుగా మార్చేస్తాడు. కేవలం పేకాట కోసమే కాదు. అతను చేసే రకరకాల వంటలకోసం కూడా అతని ఫ్రెండ్స్ అందరూ ఆదివారం వచ్చేసరికి ఆవురావురుమని వచ్చేస్తారు. బహుశా ఇంటిగలాయనకు నచ్చని విషయం అదేనేమో?

పేకాట ఆడడంరాని, కాఫీ, టీలు అలవాటులేని నేను వాళ్ళ దృష్టిలో ఒక అడవి మనిషిని. అయితే, నా దృష్టిలో అది ఒక కాంప్లిమెంట్.

★ ★ ★

మొదటిరోజు అనుభవం కొండంత ధైర్యాన్నిచ్చింది. నిజంగా ఆత్మవిశ్వాసం మనకు ఎంతో ఉత్తేజాన్నిస్తుంది. అప్పుడే కొంత మంది విద్యార్థులు నాకు అభిమానులయ్యారు. దానితో క్లాసు తీసుకోవడం ఏమీ కష్టమనిపించడంలేదు.

చూస్తూండగానే నెలరోజులు ఇట్టే గడచిపోయాయి. మొదటి నెల జీతం అందు కున్న రోజు నుండి జగదీష్ ఒకటే హడావుడి 'పార్టీ-పార్టీ' అంటూ. పదిహేను మైళ్ళ దూరంలో మునిసిపాలిటీ వున్న ఊరు వుంది. ఒక ఆదివారం జగదీష్ మిత్రబృందాన్ని ఆ ఊరికి తీసుకువెళ్ళి సినిమా చూపించి ఐస్‌క్రీం పార్టీ ఇస్తానన్నాను. కానీ జగదీష్ దృష్టిలో పార్టీ అనే పదానికి అర్థంవేరు.

"ఇంకా నయం, అంతర్వేది తీర్థానికి తీసుకువెళ్ళి జీళ్లు కొనిపెడతాననలేదు" అంటూ జగదీష్ విసుక్కున్నా నేను లక్ష్యపెట్టలేదు.

"మరీ ఇంత చాదస్తుడవేమిటయ్యా బాబూ! అందులోనూ సిటీ నుండి వచ్చిన వాడివి. అయినా బొత్తిగా అయిస్‌క్రీమ్ పార్టీ తీసుకోవడానికి మేమేమైనా ఆడపిల్లలమా? కనీసం టీపార్టీ అన్నా ఇవ్వవయ్యా! ఆ ఘాటుకే తృప్తి పడతాం" అని గొడవ చేస్తే ఒక ఆదివారం సాయంత్రం అతని మిత్ర బృందాన్ని అమలాపురం తీసుకువెళ్లి హోటల్లో టీపార్టీ ఇచ్చి సాయంత్రం ఫస్ట్‌షో సినిమా చూపించాను.

"ప్రతిరోజూ కాలేజీమెట్లు ఎక్కుతుండగా భగవాన్‌దాసుగారి చిత్రపటం పలకరిస్తున్నట్లే వుండేది. ఛీఫ్ డోనర్ అయిన కృష్ణ మోహనదాసుగారి పేరు పాలక వర్గంలో లేకపోవడం విచిత్రంగానే వుంది. ఒకవేళ ఊరు విడిచి పిల్లలదగ్గరకు వెళ్ళిపోయారా? అదే అడిగాను ఒకరోజు మాటల మధ్య జగదీష్‌ని.

"ఆ! ఆ ముసలాడి చాదస్తాన్ని ఎవరు భరించగలరయ్యా? బొత్తిగా బీసీ నాటి మనిషి. ఆ పాత చింతకాయ భావాలు భరించలేక మెల్లిగా ఆయిన్ని తప్పించాం నేను ఈ కాలేజీలో చేరిన కొత్తలోనే. ప్రస్తుతం ఈ ఊళ్లోనే వున్నారు. ఉండక ఎక్కడకు వెడతార్లే? ఉన్న ఒక్క కొడుకూ స్టేట్స్‌లో వున్నాడు"

ఒక్కసారి ఆయన్ని కలుసుకోవాలనే కోరిక రోజురోజుకూ బలపడుతోంది. 'పెద్దవారు ఒక్కసారి వెళ్ళి కలుసుకుందాం' అని ఎన్నిసార్లు అడిగినా 'ఏం చూస్తాం లెద్దూ!





ఈ ముసలాళ్లు తమ చాదస్తంతో మనల్ని చంపుకు తింటారు' అని జగదీష్ వినిపించు కునే వాడు కాదు. ఇక, అతగాడు రాడని తెలిసిన తరువాత ఒక ఆదివారం సాయంత్రం ఒంటరిగా నేనే వారి ఇంటికి బయలుదేరాను.

"ఆ ముసలాయన్ని చూడాలని నీకీ పిచ్చి ఏమిటోయ్? అవున్లే, నువ్వు పుట్టుకతోనే వృద్ధుడివి కదూ!" జగదీష్ మాటలకు అతని మిత్రబృందం పగలబడి నవ్వుతుండగా మెట్లు దిగి కృష్ణ మోహనదాసుగారి ఇంటి వైపు నడక సాగించాను.



ఎత్తయిన ప్రహరీగోడ లోపల ఎత్తైన అరుగులతో పూర్వకాలంనాటి మండువా ఇల్లు. గేటు దగ్గర నుండి యింటి వరకు పాతిక గజాలు సిమెంటు రోడ్డు. బాటకిరు వైపులా పిల్లగాలికి తలలూపుతూ స్వాగతం చెబుతున్న పూల మొక్కలు. ప్రహరీగోడకు రంగు రంగుల బోగన్ విల్లా నిండుగా పూలతో వున్నాయి. ఒకవైపు రంగురంగుల గులాబీలు, మరోవైపు రకరకాల మందా రాలు, చామంతీ, నీలగోరింట మొక్కలు నిండుగా పూలతో కలకలలాడుతున్నాయి. గేటుకి దగ్గరగా పారిజాత వృక్షం. ఇంటికి పందిరిలా వేసివుంది మధుమాలతి. అపు రూపంగా పెంచుతున్న పూలవనం.

'మొక్కలకు నీళ్లుపొయ్యి, ఎరువు వెయ్యి. అంతకుమించి ప్రేమను అందించు' ఎప్పుడో ఎక్కడో చదివిన వాక్యం మనసులో మెది లింది. కన్నుల పండువగా వున్న ఆ పూల వనాన్ని చూసుకుంటూ ఇంటివైపు నడి చాను.

ఎత్తు అరుగుల ఇల్లు. మెట్లకు ఇరువై పులా వున్న అరుగులపై వరుసగా కుర్చీలు వేసివున్నాయి. అరుగు చివర ఒక మూలగా మట్టికుండతో నీళ్లు, ప్రక్కనే స్టూలుమీద గాజుగ్లాసు. ఇంటి సింహద్వారం కోటగు మ్మంలా వుంది. రోజ్‌వుడ్‌లో రకరకాల నగిషీలు చెక్కి వున్నాయి. తలుపులకు పైనుండి కింది వరకూ చెక్కిన డిజైన్ల మధ్య చిరుగంటలు వేలాడుతున్నాయి. గుమ్మానికి పైన వెంకటేశ్వరస్వామి, అలివేలుమంగ చిత్రపటం వుంది. ఆ రోజు ఉదయమే వేశా రేమో, చామంతి పూలదండ, ఫ్రెష్‌గా వుంది.

ఇంటి తలుపులు తీసేవున్నా ఎవరూ కని పించడం లేదు. కాలింగు బెల్లు ఎక్కడ వుందో? ఏం చెయ్యాలా? అని ఆలోచి స్తూండగానే లోపలి నుండి ఏదో బరువైన సంచి తీసుకువస్తూ కనిపించాడు ఒక వ్యక్తి. బహుశా ఆ ఇంటి పనివాడేమో? 'ఏం కావాల'న్నట్లుగా నావైపు చూశాడు.

"ఈ ఊరి కాలేజీకి కొత్తగా వచ్చిన లెక్చెర ర్ని. కృష్ణమోహనదాసు గారిని కలుసుకోవా లని వచ్చాను. అయ్యగారు వున్నారా?"

"ఉన్నారు బాబూ! కూర్చోండి. చెప్పి వస్తాను" సంచి గుమ్మంలో పెట్టి లోపలకు నడిచాడు.

కుర్చీలో కూర్చుంటున్న నాకు భుజంగరా వుగారి ఇంటిముందు పడిన పడిగాపులు గుర్తుకువచ్చాయి మళ్లీ. ఈ ఇంటిముందు ఎంతసేపు వేచి వుండాలో ఏమిటో? వచ్చిన

వారిని గంటల తరబడి నిలబెడితే తప్ప వారి గొప్పదనం బయటపడదనుకుంటారు కాబోలు.

"అయ్యగారు పెరటివైపు వున్నారు బాబూ! మిమ్మల్ని అక్కడికే తీసుకుని రమ్మన్నారు. రండి బాబూ!" నౌకరు మాటలతో ఈ లోకంలోకి వచ్చిన నేను, నా తొందరపాటుకి కించ పడుతూ అతన్ని అనుసరించాను. ఇంటిలోంచి కాకుండా, ప్రహరీగోడకు వున్న మరో గుమ్మం ద్వారా పెరటి వైపుకి వెళ్ళాం.

విశాలమైన రెండు పశువులశాలలు. వాటి ముందు వున్న పొగడచెట్టు కింద పడక కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్న కృష్ణమోహనదాసుగారు నన్ను చూడగానే కుర్చీలోంచి లేచి రెండు చేతులూ జోడించారు.

"ఇటు దయచేయండి మాస్టారూ!" దాసుగారి మాటలకు నాలో నేనే సిగ్గుపడ్డాను.

ఆరడుగుల ఆజానుబాహువు కృష్ణమోహనదాసుగారు. డెబ్భైయి సంవత్సరాల వయస్సులో కూడా దృఢంగా వున్నారు. సడన్‌గా చూడగానే రోజూ కాలేజీలో చూస్తున్న చిత్రపటంలోంచి భగవాన్ దాసుగారు గెటప్ మార్చి ఇక్కడ కూర్చున్నారా? అనిపించింది. తండ్రీకొడుకుల కంత దగ్గరి పోలికలు. అయితే, తండ్రి చూపులు తీక్షణంగా వుంటే, దాసుగారి నేత్రాలు వాత్సల్యాన్ని కురిపిస్తున్నాయి.

పరిశుభ్రంగా వున్న ఆ పశువుల శాలలు, గడ్డి పరక కూడా కనిపించని ఆ కొబ్బరి తోట, ఒకవైపు పర్వతంలా వున్న కొబ్బరికాయల రాశి, ఆ కొబ్బరి తోటలోనే ఒకవైపుగా కూరగాయల మడి, ఆ పరిసరాలు మనసుకి ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. కాస్త దూరంలో గోడ దగ్గర ట్రాక్టర్ కనిపిస్తోంది.

"ఏమిటలా ఆలోచనలో పడిపోయారు? ముందు మా ఆతిథ్యం స్వీకరించండి"

దాసుగారి మాటలతో ఈ లోకంలోకి వచ్చి పాలేరు అందించిన కొబ్బరి బొండాన్ని అందుకున్నాను.

"ఏం బాబూ! నాతో ఏమైనా పనివుండి వచ్చారా?"

"మీ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా ఈమధ్యనే జాయినయ్యాను. పెద్దలు, ఒక్కసారి మీ దర్శనం చేసుకుని వెడదామని వచ్చాను" నా మాటలకు మెల్లిగా నవ్వారు దాసుగారు.

"కాలేజీ పాలక వర్గంనుండి బయటపడిన తరువాత, నన్ను కలుసుకోవాలని వచ్చిన మొట్టమొదటి వ్యక్తి మీరే. చాలా సంతోషం మాస్టారూ! ఆ! ఎక్కడ నుండి వచ్చారు? నాన్నగారు ఏం చేస్తూ వుంటారు?"

"నాన్నగారు సెక్రటేరియట్‌లో సెక్షన్ ఆఫీసర్. నా చదువంతా హైదరాబాదులోనే సాగింది"

"పట్నవాసం నుండి పల్లెవాసంలోకి వచ్చారన్నమాట. అలవాటుపడడం కొంచెం కష్టమే"

"లేదు బాబుగారూ! పుట్టిన దగ్గరనుంచి హైదరాబాదులోనే వున్నాను. ఆ నగర వాతావరణం నాకు చాలా విసుగు కలిగించింది. ప్రశాంతమైన పల్లెపట్టున వుందామని ఈ ఉద్యోగానికి అప్లై చేశాను"

మాటల మధ్యలో లోపలనుండి కాఫీ వచ్చింది.

"అదేమిటి? ఇప్పుడే కదా కొబ్బరి నీళ్ళు తాగాను" మర్యాదగానే తిరస్కరించాను.

"ఫరవాలేదు తీసుకోండి మాస్టారూ! అది మా కోనసీమ సంప్రదాయం, ఇది ఈనాటి మర్యాద"

"క్షమించండి. నాకు కాఫీ, టీలు అలవాటులేదు" నా మాటలు దాసుగారికి సంతోషాన్ని కలిగించినట్లు ఆయన కళ్లను చూసే గ్రహించాను.

పశువుల మంద ఇంటికి తిరిగివచ్చినట్లుంది. చెంగు చెంగున గంతులు వేస్తున్న లేగదూడలూ, నిండుగా నిదానంగా నడచి వస్తున్న ఆవులూ, ఒక్కసారిగా ఏదో గోకు





లంలో అడుగు పెట్టినట్లు అయింది.

క్రమశిక్షణతో పెరిగిన ఆ పశువులన్నీ సాలలోకి ప్రవేశిస్తున్నాయి. వాటి మెడలోని గంటల చిరుసవ్వడి ఏదో వాయిద్యంలా వినిపిస్తోంది. మిగిలిన ఆవులకు భిన్నంగా ఒక ఆవు మెడలో గంటలు ఊగించు కుంటూ కృష్ణమోహనదాసుగారి దగ్గరకు నడచివచ్చింది.

"ఏమిటీరోజు ఇలా వున్నావు? ఏమైంది?" గంగడోలు నిమురుతూ ఆద రంగా అడిగారు.

సమాధానంగా పక్కకు తిరిగింది. తెల్లని చర్మంమీద రక్తం చిమ్ముతున్న ఎర్రని చారి కలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఒరేయ్ నారిగా!" ఒక్కసారి మేఘం గర్జించినట్లయింది. అంతవరకూ శాంతమూ ర్తిలా వున్న దాసుగారి కళ్లల్లో ఎర్రజీరలు కనిపిస్తున్నాయి.

"అయ్యా!" పశువుల వెంట పాకలోకి వెళ్లిన పదిహేనేళ్ళ కుర్రాడు పరిగెత్తుకువ చ్చాడు.

"ఏమిటిది?" ఆ మాటలలోని తీక్షణత్వా నికి నేనే ఉలిక్కిపడ్డాను. ఇక నారిగాడి విషయం చెప్పేదేముంది? గజగజలాడిపో యాడు.

"మందలోంచి బైటకువచ్చేస్తుంటేనూ...!" బెదురుచూపులు చూస్తూ మెల్లిగా గొణి గాడు.

"మంచి మాటలతో మందను నీవైపుకి తిప్పుకోవాలిగాని, ఇలా నెత్తురు చారికలు కట్టేటట్లు బాదుకుంటారా? వెళ్లు. ఇటు వంటి పొరపాటు మళ్ళీ జరగకూడదు. ఈ పశువుల మీద పడిన ఒక్కొక్క దెబ్బా నీ ఒంటిమీద తట్లులేస్తుంది జాగ్రత్త!" తీవ్రంగా హెచ్చరించారు.

"చిత్తం బాబయ్యా!" అప్పటికి బతుకు జీవుడా అనుకుంటూ పాకలోకి జారుకు న్నాడు నారిగాడు.

"వాణ్ణి కోప్పడ్డానుగా! ఇక లోపలకు వెళ్లు. ఇక నీ జోలికి రాడులే. అయినా కాస్త వాడు చెప్పినట్లు వినకూడదూ?" ఆవు మీద చెయ్యివేసి నిమురుతూ మెల్లిగా మందలిం చారు.

మారాం చేస్తున్నట్లే తల ఆడించింది అక్కడ నుండి కదలకుండా.

"ఏమిటా పెంకెతనం? చుట్టాలు కూడా వున్నారా? ఏమిటి దీనికింత పెంకితనం అని అనుకోరూ? వెళ్లు లోపలకి" ఒక్క కసురు కసిరారు.

దాసుగారి మాటలు ఏదో అర్థమైనట్లే ఒక్కసారి నావైపు చూసి ఆ తరువాత తల వంచుకుని మెడలోని గంటలు మోగుతుం డగా మెల్లిగా పాకవైపు సాగిపోయింది.

జరుగుతున్నదంతా సంభ్రమంగా చూస్తూ కూర్చుండిపోయాను.

పశువులతో కూడా సాటి మనుష్యులతో మాట్లాడుతున్నట్లే మాట్లాడే దాసుగారికీ, మనిషిని సాటి మనిషిగా చూడడానికి కూడా అహం అడ్డువచ్చే భుజంగరావుగారికీ మధ్యనున్న అంతరం కొట్టవచ్చినట్లే కనిపిం చింది.

"ఈ కాలం కుర్రాళ్ళకి బొత్తిగా ఓర్పు వుండడంలేదు మాస్టారూ!", దాసుగారు ఎప్పటి సౌమ్యమూర్తి అయిపోయారు. మెల్లిగా నవ్వి ఊరుకున్నాను.

మాటలమధ్య కాలం తెలియకుండానే గడ చిపోతోంది. చుట్టూ చీకట్లు ముసురుకునేం తవరకూ గమనించనేలేదు.

"మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా వుంది సార్! ఇక సెలవు ఇప్పించండి. ఇప్పటికే చాలా ఆలస్యమైంది" లేవబోతున్న నన్ను వారించారు.

"భోజన సమయంలో భోజనం చేయ కుండా వెళ్ళడమేమిటి?" వద్దు వద్దంటూ మొహమాట పడుతూ వుండగానే లోపల నుండి కబురు వచ్చింది భోజనాలు వడ్డిస్తు న్నామని.

"ఇంకేం, హోం డిపార్ట్‌మెంట్ ఆర్డర్

కూడా అయింది. మరి కాదనడానికి వీల్లేదు. పదండి" ముందుకు దారి తీస్తున్న ఆయన్ని అనుసరించక తప్పలేదు.

విశాలమైన మండువా యిల్లు. మధ్యలో కుండీ, చుట్టూ స్థంభాలతో నాలుగువైపులా వరండాలు. వీధి వైపు వరండాలోకి తప్ప మిగిలిన వరండాలోకి రెండేసి గుమ్మాలు కనిపిస్తున్నాయి. సింహద్వారం పైన మహాత్మాగాంధీ చిత్రపటం, కుడివైపు వరండాలో రామకృష్ణపరమహంస, శారదాదేవి, వివేకానందుడు; ఎడమవైపు వరండాలో గౌతమ బుద్ధుడూ, విశ్వకవి రవీంద్రుడు అన్నీ ప్రత్యేకంగా వేయించిన తైల వర్ణ చిత్రాలే. సింహద్వారానికి ఎదురుగా వున్న వరండాలో ఒక గుమ్మం మీద భగవాన్ దాసు దంపతుల తైలవర్ణ చిత్రం, రెండవగుమ్మం మీద పూర్వ కాలంనాటి ఫొటో... నేతాజీసుభాష్ చంద్ర బోస్ పక్కన ఎవరో యువకుడు.

"ఎవరాయన? " అప్రయత్నంగా అడిగాను. చిన్నగా నవ్వి చెప్పారు.

"నేనే. నేను బి.ఎ చదువుతుండగా నేతాజీ మా కాకినాడ కాలేజీకి వచ్చారు. అదృష్టవశాత్తూ ఆ సంవత్సరం మా కాలేజీ విద్యార్థి నాయకుణ్ణి నేనే. అందుకని ఆయనతో కాస్త సన్నిహితంగా మెలిగే అవకాశం... కాదు అదృష్టం కలసి వచ్చింది. ఆ అరుదైన అదృష్టాన్ని ఫొటో రూపంలో భద్రంచేసుకున్నాను"

ఒక్కసారిగా మరో లోకంలోకి అడుగు పెట్టినట్లయింది. నిజంగా ఆ తరం వారు ఎంతటి అదృష్టవంతులు? ఎందరో మహనీయుల ప్రభావం ఆ తరం వారిపై వుండేది. వారిని ఆదర్శంగా తీసుకుని తాము కూడా అలాగే వుండాలని కోరుకునేవారేమో? కానీ, ఈనాడు ఎవరిని ఆదర్శంగా తీసుకోవాలి? అవినీతిపరులనా? నేరచరిత్రులనా? ఏ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం? అన్నట్టు ఏ నాయకుడిని చూసినా మనం అనుసరించదగ్గ ఆదర్శం ఎవరి దగ్గర వుంది? పార్లమెంటులోనూ, అసెంబ్లీలోనూ జరిగే సమావేశాలను దూరదర్శన్‌లో ప్రత్యక్షంగా చూస్తుంటే, వీళ్లా మనం ఎన్నుకున్న నాయకులు? అని మన తల సిగ్గుతో వాలిపోవడంలేదూ? అలా చూసిన ఒక అయిదారేళ్ల కాన్వెంటు కుర్రాడు 'ఛీ! మేమలా అల్లరిచేయం, డిసిప్లిన్డ్‌గా వుండాలని వాళ్ళ టీచర్ చెప్పలేదేమో? మేమలా అల్లరిచేస్తే మా టీచర్స్ పనిష్‌మెంటు ఇస్తారు' అని అన్నాడంటే మనం తల ఎక్కడపెట్టుకోవాలో తెలియక ఇబ్బంది పడవలసి వస్తుంది.

కుండీ దగ్గర తళతళలాడే ఇత్తడి గుండిగ, పక్కనే ఇత్తడి చెంబు. సోపు, తువ్వాలు పుచ్చుకుని నిలబడి వున్నాడు పనికుర్రాడు. కాళ్లూ, చేతులూ కడుక్కుని అతను అందించిన తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ డైనింగు హాలులోకి అడుగుపెట్టాం.

అది విశాలమైన డైనింగ్ హాలు. మధ్యలో పన్నెండు కుర్చీలతో విశాలమైన, పురాతనమైన రోజ్‌వుడ్‌తో చేసిన డైనింగు టేబుల్. వడ్రంగి తన పనితనాన్ని చూపించడంకోసం ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుని చేసినట్లుగా కనిపిస్తోంది. గోడకు వున్న అద్దాల బీరువా లోంచి ఖరీదైన గాజు సామాను, డిన్నర్ సెట్లూ, రకరకాల డిషెస్ కనిపిస్తున్నాయి. దాని పక్కనే డబుల్ డోర్ ఆల్విన్ ఫ్రిడ్జ్ పెద్ద సైజుది వుంది. మరో గోడకు సింకు. మొత్తానికి పాత కొత్తల మేలి కలయికలా వుంది యిల్లు. డైనింగు టేబుల్ దగ్గర ఒక పదిహేనేళ్ల ఆడపిల్ల భోజనాల ఏర్పాటు చూస్తోంది. టేబుల్‌మీద వెండి కంచాలు, గ్లాసులూ వున్నాయి.

"సీతా! అమ్మగారినిలా రమ్మను" ఒక కుర్చీ నాకు చూపించి మరో కుర్చీలో తాను కూర్చుంటూ అన్నారు దాసుగారు.

సీత వెనుకనే వచ్చారు దాసుగారి భార్య. పార్వతీదేవిలా నిండుగా వున్న ఆమెను చూస్తూనే చటుక్కున కుర్చీలోంచి లేచి





రెండు చేతులూ జోడించాను.

"చూడు! ఈ అబ్బాయి విద్యాసాగర్. ఈ మధ్యనే మన కాలేజీకి తెలుగు లెక్చరర్‌గా వచ్చారట. మనల్ని చూసి వెడదామని వచ్చారు" చిరునవ్వుతో చూశారామె.

"కూర్చోండి బాబూ!" ఆ అమ్మాయి సీత వడ్డిస్తుండగా దగ్గర వుండి ఆమె కొసరికొసరి వడ్డిస్తుంటే, చాలాకాలం తరువాత అమ్మచేతి భోజనం చేసినట్లుగా అనిపించింది.

"మీకు వీలయినప్పుడల్లా వస్తూ వుండండి బాబూ!" భార్యా భర్తలిద్దరూ సాదరంగా వీడ్కోలు చెప్పారు.

మెయిన్‌గేటు వరకూ వచ్చి సాగనంపారు దాసుగారు. దాసుగారి స్నేహసౌరభం పారిజాతాల పుష్ప సౌరభంలా ఎంత దూరమో వెంటాడింది.

ముఖ పరిచయం కూడా లేని వారికి ఆతిథ్యం ఇవ్వడం ఇక్కడివారికి అలవాటేమో? జగదీష్ కూడా అంతే, పరిచయం కూడా లేకుండానే నాకు ఆశ్రయమిచ్చాడు. ఇదే నగరాలలోనైతే?

అయినా, ఇది డొక్కా సీతమ్మ నడయాడిన ప్రదేశం. ఆతిథ్యం ఇవ్వడంలో ఇక్కడి వారికి ఆమె ఆదర్శం కాకుండా ఎలా వుంటుంది? డొక్కా సీతమ్మ ఆలోచనలతో ముందుకు నడిచాను. ఒక్కసారి వీలుచూసుకుని ఆమె స్వగ్రామం లంకల గన్నవరం వెళ్లిరావాలి. కానీ, వెడదామంటే జగదీష్ ఏమంటాడో? నిజంగా తను తోడు వస్తే హాయిగా వెళ్లిరావచ్చు ఎవరితోనైనా అతను మాట్లాడే తీరు అటువంటిది. నాకు కొత్తవాళ్లతో మాట్లాడాలంటేనే నోరు పెగలదు. ఆలోచనలతోనే ఇల్లు చేరాను.

"అబ్బ ఏమిటయ్యా బాబూ! అలా అక్కడే పాతుకుపోయావు? నేను చెప్పలేదూ! ఆ ముసలాడు జిడ్డులా పట్టుకుని వదిలిపెట్టడని? ఏం, తల దిమ్మెక్కిపోయిందా?" గుమ్మంలో అడుగు పెడుతూనే ఎదురైన జగదీష్ పలకరింపుకి మనస్సు చివుక్కుమంది.

ఊహా స్వర్గంనుంచి ఒక్కసారిగా పాతాళంలోకి పడిపోతున్న అనుభూతి.

★ ★ ★

రోజులు గడిచేకొద్దీ ఊరుకీ, కాలేజీకి అలవాటు పడుతున్నాను. కాలేజీ వాతావరణం చూస్తుంటే, మనసంతా కలచివేసినట్లుగా వుంది. కొంతమంది విద్యార్థులను చూస్తుంటే, వీళ్ళసలు టెన్త్ ఎలా పాస్ అయ్యారా? అనిపిస్తోంది. నిజంగా పాఠాలు వినడానికీ, చదవడానికీ కాలేజీకి వచ్చేవారు నూటికి ఏ ముప్పైమందో వుంటారు. మిగిలిన వారంతా ఏదో అందరూ చదువుకుంటున్నారు, మనం కూడా చదువుకోవాలి, అనే ధోరణే తప్ప నిజంగా చదువుకోవాలనే ధ్యాస వున్న వాళ్లు కారు. అందులోనూ ఊళ్లో కాలేజి కాబట్టి ఫీజులు కట్టి చేరిపోతారు. తమ భవిష్యత్తు గురించిన ఆలోచనా, ఆందోళనా వారికి లేదు.

పోనీ వాళ్లైతే లోకం తెలియని వయసులో వున్నారు. కానీ... లెక్చరర్స్? చాలామంది కాకినాడ రాజమండ్రిలలో ఫామిలీస్ పెట్టి ఇక్కడ నలుగురైదుగురు కలసి ఒక పోర్షన్ తీసుకుని మెస్‌లో భోజనంచేస్తూ కాలక్షేపం చేస్తూ వుంటారు. శనివారం అంతా ఊరికి వెళ్లే హడావుడి, సోమవారం ప్రయాణం చేసివచ్చిన అలసట. ఈలోగా ఏ అవాంతరం వచ్చినా క్లాసులు కాన్సిల్. కనీసం ఊళ్లో వుంటున్న లెక్చరర్సు, స్వంత ఊళ్లో ఉద్యోగం చేసుకుంటున్న లెక్చరర్లకయినా పనిమీద శ్రద్ధ వుంటుందా? అంటే కొబ్బరి కాయల దింపులతోనూ, ఊడ్పులూ, కోతలు మొదలైన వ్యవసాయపు పనులతోనూ ఎప్పుడు చూసినా బిజీగా వుంటారు. 'తనకు మాలిన ధర్మం కూడదు కదా' తమకు తీరిక దొరికినప్పుడే క్లాసులు తీసుకుంటారు. కాదంటే, కొంతమంది లెక్చరర్స్ ప్రైవేటు క్లాసులు తీసుకుని తమ బాధ్యత తీర్చుకుని చాలా శ్రమపడిపోతూ వుంటారు.

లెక్చరర్లంటే స్టూడెంట్సుకి నిర్లక్ష్యం. 'వాళ్లె లాపోతే మనకేం? మన జీతం రాళ్లు మనకి వస్తున్నాయి కదా!' అనే నిర్లిప్తత లెక్చెరర్లది. జీతాలు కట్టి, పుస్తకాలు కొన డంతో తమ బాధ్యత తీరిపోయిందనుకునే తల్లిదండ్రులు. వీళ్ళ మధ్య విద్యార్థుల భవి ష్యత్తు ఏమిటి? ఏవేవో ఆలోచనలతో చికాకుపడే మనసుకి ఆహ్లాదాన్ని కలిగించేది గోదావరీ తీరమే.

అఖండ గౌతమి ధవళేశ్వరం దగ్గరకు వచ్చేసరికి ఏడు పాయలుగా చీలిపోయిం దట. ప్రస్తుతం అందులో మూడు పాయలు మాత్రమే కనిపిస్తున్నాయట. గోదావరి పాయల మధ్యనున్న సీమే ఈ కోనసీమ. గోదావరి ఒడ్డున కూర్చుని వడివడిగా ప్రవ హించే తల్లిగోదావరిని చూస్తుంటే, 'చేతులు చాచి కోనసీమను తన ఆలింగనంలోకి తీసు కున్న తల్లి గోదావరి సాగరసంగమాన్ని అభి లషిస్తూ వడివడిగా ముందుకు సాగిపోతు న్నట్లు' అనిపిస్తోంది.

సూర్యాస్తమయం సమయంలో గోదా వరి ఒడ్డున నిలిచి ఆకాశంలో మారే

రంగులను గమనించడం ఒక అద్భుత మైన అనుభవం. ప్రతిరోజూ సూర్యాస్త మయం సమయానికి గోదావరి దగ్గరకు వెళ్ళడం అలవాటుచేసుకున్నాను.

★ ★ ★

మార్చి నెల వచ్చింది. కొడుకు పుట్టాడనే శుభవార్తను టెలిగ్రాం ద్వారా అందుకున్న జగదీష్ అప్పటికప్పుడు సెలవుపెట్టి వెళ్ళిపో యాడు. ఎప్పుడూ గలగలమని మాట్లాడే అతగాడు లేకపోవడంతో ఇల్లంతా నిశ్శబ్దం అలుముకుంది.

ప్రతీ ఆదివారం హోటలు నుంచి ఇడ్లీ, కారప్పొడి, చట్నీ తీసుకువస్తూ వుంటాడు సిసింద్రీ. ఇప్పుడు కూడా అలాగే తీసుకువ చ్చాడు.

"అరె! జగదీష్‌బాబుగారు నిన్ననే ఊరు వెళ్ళాడయ్యా!" చదువుతున్న పేపరు మడుస్తూ అన్నాను.

"నిన్న ఉదయం బస్సు ఎక్కుతుండగా చూశాను బాబుగారూ! అందుకోసమే మీ ఒక్కరికే తెచ్చాను" స్టూలు ముందుకు జరిపి తీసుకు వచ్చిన పాకెట్‌ను దానిమీద పెట్టాడు. లోపలకు వెళ్ళి గ్లాసుతో మంచి నీళ్ళు, ప్లేటూ తీసుకుని వచ్చి స్టూలుమీద పెట్టి తను కింద కూర్చున్నాడు.

"నువ్వు కూడా తీసుకోరా!" రెండు ఇడ్లీలు పాకెట్‌లోనే వుంచి వాడికి అందించాను.

"మేం తినకుండానే మీదాకా వస్తాయేమిటి బాబూ!" నిష్కల్మషంగా నవ్వుతూ అందుకు న్నాడు.

"ఒరేయ్! నువ్వు కూడా హాయిగా స్కూలుకి పోయి చదువుకోకూడదూ?" ఇన్నాళ్లుగా అతని తెలివితేటలను గమని స్తున్న నేను ఆ సలహాను ఇవ్వకుండా వుండలేకపోయాను.

"అదేమిటి బాబూ! చదువుకోవాలని నాకు మాత్రం ఆశ లేదంటారా? అయిదో క్లాసు పాసయ్యాను బాబూ! హైస్కూల్లో చేరతా





నని పేచీ పెట్టాను కూడా. కానీ, మా అయ్య 'లట్ వీల్లేదు. చదువుకోవడానికి మనమేమైనా కలిగిన మారాజులమా?' అన్నాడు"

"అదేమిటి? హైస్కూల్లో ఫీజులేమీ వుండ వుగా? పైగా మీకు ప్రభుత్వం హాస్టల్ సౌకర్యం కలిపించి ఖర్చులన్నీ భరిస్తుంది. ఇక మీ నాన్నకు కష్టమేముంది?"

"అయ్యో! నిజంగానే మీకు బొత్తిగా లోకం తెలియదు అయ్యగారూ!"

ఒక్కసారి గతుక్కుమన్నాను. వేలెడు లేడు వీడు కూడా నన్ను వేలెత్తి చూపి స్తున్నాడే అని పౌరుషం వచ్చింది. అయినా ఇన్ని రోజులుగా ఇతగాణ్ణి గమని స్తున్న నేను ఇతని భవిష్యత్తును గాలికి వదిలేయలేకపోయాను. నిజంగా చదివిస్తే ఇతగాడు ఎంతైనా అభివృద్ధిలోకి వస్తాడు. అతని భవిష్యత్తును తీర్చిదిద్దిన వ్యక్తిగా నేను నిలబడాలి.

"నేను చదువుకుంటే డబ్బు ఖర్చు అవు తుందని కాదు. చదువంటూ నేను స్కూలుకి వెళ్ళి కూర్చుంటే, నా సంపాదన మా నాన్నకు దక్కదుగా!" ఆ పదేళ్ళ గుంటడు వివరిస్తుంటే తెల్లబోయి చూశాను. అయినా కేవలం సంపాదనకు ఆశపడి చదువు మాన్పించడం ఎంత అన్యాయం?

"ఒకసారి మీ నాన్నను కనిపించమని చెప్పు. నేను నచ్చజెబుతానులే. నీకు మంచి చదువు వస్తుంది. చదువుకుంటే హాయిగా ఉద్యోగం చేసుకుంటూ దొరబాబులా బతక వచ్చు. అప్పుడు మీనాన్నకు వేలకువేలు సంపాదించి ఇవ్వొచ్చు. ఈ విషయం చెబితే మీ నాన్న సంతోషంగా ఒప్పుకుంటాడులే"

"అయ్యగారూ! నిజంగానే మా అయ్యకు చెప్పి నన్ను స్కూల్లో చేర్పిస్తారా? నాకూ చదువుకోవాలని చాలా ఇదిగా వుండే దయ్యా! బతిమిలాడినా మా అయ్య విన్నాడు కాదు. మా అయ్య నన్ను చదువు మాన్పించకుండా వుంటే, నేనీపాటికి ఏడో క్లాసు పరీక్షకు వెళ్ళి వుండేవాడిని" వాడి

కళ్లల్లో దిగులు తొంగి చూసింది.

"మీ నాన్నకు నేను చెబుతానులే. మళ్ళీ స్కూలు తెరిచే నాటికి నువ్వు ఫస్టుఫారంలో చేరుదువుగాని. ఈలోగా ఇదివరకు చదివిన పాఠాలు మరచిపోకుండా కాస్త వల్లెవేస్తుండు"

"అలాగే అయ్యగారూ ఈ రోజే పాత పుస్తకాలు చదవడం ప్రారంభిస్తాను" హుషారుగా పరుగు అందుకున్నాడు.

★ ★ ★

పదిరోజులు గడచిపోయాయి.

ఊరు నుండి తిరిగి వచ్చిన జగదీష్‌కి అనుక్షణమూ కొడుకు ధ్యాసే. కొడుకు ఆట పాటల్ని వర్ణించి వర్ణించి చెప్పడం ప్రారంభించాడు. రోజుల పిల్లవాడికి పాలు తాగడం, నిద్రపోవడం తప్ప ఏం తెలుస్తుంది? అయినా తండ్రి ప్రేమ అలా అనిపిస్తుంది కాబోలు.

ఆ రోజు సాయంత్రం కాలేజీనుండి వచ్చిన తరువాత జగదీష్ కొడుకు లీలలను అన్యమనస్కంగా వింటూ వుండగా ఒక నడి వయసు వ్యక్తి వచ్చి నమస్కారం పెట్టి నిలబడితే ముందు అతనెవరో నాకు అర్థం కాలేదు.

"ఏం నాగన్నా! బాగున్నావా?" జగదీష్ అతన్ని పలకరిస్తూనే నాకు పరిచయం చేశాడు 'మన సిసింద్రీ తండ్రి' అంటూ. అప్పుడు గుర్తుకు వచ్చింది నాకు. సిసింద్రీ చదువు గురించి అతనితో మాట్లాడుతానని చెప్పిన విషయం. అయినా కబురు చేసిన పది రోజులదాకా రావడానికి అతనికి తీరిక దొరకలేదన్నమాట.

"కూర్చో నాగన్నా! నీతో మాట్లాడాలనే కబురు పంపించాను"

"పరవాలేదు అయ్యగారూ! సంగతేమిటో చెప్పండి" చేతులు కట్టుకుని నిలబడే వున్నాడు అతగాడు.

చెప్పాను. సిసింద్రీకి చదువుమీద గల ఆసక్తి, చదువుకుంటే అతగాడు ఎక్కగలిగిన విజయసోపానాలు, చదువువల్ల కలిగే ప్రయోజనాలు, మొత్తంమీద అరచేతిలో వైకుంఠాన్ని చూపించాను. సిసింద్రీ భవిష్య జీవితాన్ని రంగుల కలగా వర్ణించాను.

చెప్పినదంతా చాలా శ్రద్ధగా విన్నాడు. విన్న తరువాత వినయం ఉట్టిపడేటట్లు అన్నాడు. "మీరు చెప్పినదంతా బాగానే వుంది బాబుగారూ! కానీ, ఏదో కాయకష్టం చేసుకుని బతికే వాళ్లం. ఈ చదువుల గొడవ మాకెందుకు బాబుగారూ! ఏదో వేణ్ణీళ్లకు చన్నీళ్లనీ ఉన్న నలుగురం నాలుగు రాళ్లు సంపాదిస్తే కాని మాకు ఇల్లు గడిచే దారి ఏది?"

"కేవలం డబ్బు సంపాదన కోసం నీ కొడుకు భవిష్యత్తును చేతులారా నాశనం చేస్తావన్నమాట" కఠినంగా అన్నాను.

"మీరంతగా చెబుతున్నారు కాబట్టి...!" తల గోక్కుంటూ నాగన్న అంటూంటే, ఎలాగైతేనేం అతగాణ్ణి ఒప్పించగలిగినందుకు నన్ను నేను అభినందించుకున్నాను.

"మీరంతగా చెబుతున్నారు కాబట్టి, వాడు నెలనెలా ఇంటికి ఇచ్చే ఆ ఏభై రూపాయలూ మీరే ఇచ్చి వాడి బాధ్యత తీసుకోండి బాబూ! వాడిచేత ఉద్యోగాలే చేయిస్తారో, ఊళ్లే ఏలిస్తారో, ఇక మీ ఇష్టం" నాగన్న మాటలకు నేను తెల్లబోయి చూస్తూ వుండగానే చేతులెత్తి నమస్కారం చేస్తూ సెలవు తీసుకున్నాడు నాగన్న.

"అయ్యా దేశోద్ధారకా!" అంత వరకూ వినోదం చూస్తున్న జగదీష్ పగలబడి నవ్వాడు. "సమాజాన్ని ఉద్ధరించడం నువ్వు అనుకున్నంత తేలిక కాదయ్యా! చేయూత నివ్వడానికి నువ్వు సిద్ధంగా వున్నావు సరే, నీ సహాయాన్ని అందుకోవడానికి అవతలి వారు సిద్ధంగా వుండద్దూ!"

నాకు చిరాకు పుట్టి లేచిపోయాను. బయటకు నడచిన నన్ను జగదీష్ నవ్వు ఎంత దూరమో వెంటాడింది. మరునాడు ఉదయమే చిన్నబుచ్చుకున్న మొహంతో వచ్చిన

సిసింద్రీని చూసేసరికి వాడికి ఎలాగైనా చదువు చెప్పి తీరాలనే పట్టుదల కలిగింది.

పోనీ, మెట్రిక్కి కట్టిస్తే...? నా ఆలోచనకు నన్ను నేనే అభినందించు కున్నాను. సిసింద్రీకి ధైర్యం చెప్పి హైదరాబాదు నుండి వచ్చేటప్పుడు కావలసిన పుస్తకాలు తీసుకువస్తాననీ, రెండేళ్లలో మెట్రిక్ పరీక్షకు కూర్చునేటట్లు చేస్తానని అతనికి ధైర్యం చెప్పి కాలేజీకి సెలవులు ఇవ్వడంతో హైదరాబాదు బయలుదేరాను.

★ ★ ★

"ఎలా వుంది పల్లెటూరి బతుకు?" నన్ను చూడగానే నాన్నగారు పలకరించిన తీరు అది.

"అక్కడి నీరు పడిందా? భోజనానికేమీ ఇబ్బంది పడడం లేదు కదా! బొత్తిగా చిక్కిపోయి నల్లబడి పోయావు" కన్నతల్లి ప్రేమ ఇది.

నాలుగురోజులలోనే నా మాటల తీరు గమనించిన నాన్నగారు, ఆ రోజు భోజనాల దగ్గర సీరియస్‌గానే అన్నారు.

"బాబూ! సాగర్! ఏదో ఉద్యోగం మోజులో అంత దూరం వెడతానంటే సరే అన్నాం కానీ, ఇలా ఆ పల్లెటూరిలో పడి నీ భవిష్యత్తుని ఎందుకయ్యా నాశనం చేసుకుంటావు? ఏ ఇంజనీరువో, డాక్టరువో అయి మాకు పేరు తీసుకువస్తావని ఆశిస్తే, మా మాటలను పెడచెవిని పెట్టి తెలుగు ఎం.ఏ. చేశావు. పోనీ ఏదో డాక్టరేట్ అయితే అదో దారి"

"ఉద్యోగం చేస్తూ పి.హెచ్.డి. చేయవచ్చు నాన్నా! నేను కూడా ఆ విషయమే ఆలోచిస్తున్నాను"

"అంటే, ఆ పల్లెటూరిలోనే పడి వుంటానంటావు. ఉన్న ఒక్కడవూ ఎందుకయ్యా మాకు దూరం కావాలని ప్రయత్నిస్తావు?" నాన్నగారి మాటలకు నొచ్చుకున్నాను.

"అలా అనకండి నాన్నా! చిన్నతనం నుంచీ సిటీలోనే పెరగడంవల్ల ఈ కృత్రిమ వాతావరణానికి దూరంగా స్వచ్ఛమైన పల్లె పట్టున కొంత కాలం గడపాలని అనుకున్నాను. అయినా మీకు దూరంగా ఎంత కాలం వుండగలను?"

"దొరికిందా, స్వచ్ఛమైన వాతావరణం?" వ్యంగ్యంగా అడిగారు నాన్న.

"బాబూ! నీకు చిన్నతనం తెలియదు. ఆ పల్లెటూరిలో ఉద్యోగం చేస్తున్నావంటే, ఈ కాలం ఆడపిల్లలెవరూ నిన్ను పెళ్లి చేసుకోవడానికి ఒప్పుకోరు. మంచి సంబంధాలు రావయ్యా!" అమ్మ చాదస్తానికి ఒళ్లు మండింది.

"అయితే పెళ్లి అయ్యేవరకు అక్కడే ఉద్యోగం చేస్తాను" పంతంగా అన్నాను.

"సరి! చండికలాంటి వాడవు నువ్వన్న విషయం మరచిపోయాను. అయితే రేపటి నుండే సంబంధాలు చూడడం ప్రారంభించమంటావా? కనీసం కోడలు వస్తేనన్నా!" అమ్మ మాటలకు మధ్యలోనే అడ్డుతగిలాను.

"నా వయసు ఆడపిల్లలకే ఇంకా పెళ్ళిళ్లు కావడంలేదు ఈరోజుల్లో. నాకు ఇప్పుడే పెళ్ళేమిటమ్మా? కనీసం పాతికేళ్ళ వయసైనా రానీ!" నవ్వుతూ రెండేళ్ల కాలం పొడిగించాను. "అంత వరకూ అక్కడే ఉద్యోగం చేస్తాను".

"నీ మతమే నీదిగాని ఎదుటి వారి మాటలు ఎప్పుడు విన్నావు గనుక" చిరాగ్గా భోజనం ముందు నుంచి లేచిపోయారు నాన్నగారు.

హైదరాబాదునుండి వస్తూ సిసింద్రీకి మెట్రిక్ పుస్తకాలు, కృష్ణమోహన దాసుగారికి భగవద్గీత, వారి భార్య రుక్మిణమ్మగారికి పోతన భాగవతమూ తీసుకు వచ్చాను. వచ్చిన మొదటి ఆదివారమే వారి ఇంటికి తీసుకువెళ్ళి ఇచ్చాను.

"ఎందుకు బాబూ నీకీ చాదస్తం?" అంటూ అందుకున్నారు ఆ దంపతులిద్దరూ.

"ఏదీ భాగవతంలో నాలుగు పద్యాలు చదివి వినిపించండి బాబూ!" రుక్మిణమ్మ





గారి మాటలను కాదనలేక గజేంద్రమోక్షం లోని పద్యాలు చదివాను. ఆ భార్యభర్తలిద్దరూ తన్మయత్వంతో విన్నారు.

"మా చిన్నతనంలో మా తెలుగు మాస్టారు ఇంత గొప్పగా రాగయుక్తంగా పద్యాలు చదివేవారు. మళ్ళీ ఇంతకాలానికి అలా చదివేవాళ్ళను నిన్నే చూశాను. చాలా సంతోషం" అన్నారు దాసుగారు.

"బాబూ! మీకు అభ్యంతరంలేకపోతే వీలయినప్పుడు వచ్చి పద్యాలు చదివి వినిపిస్తే!" ఒక్క క్షణం తటపటాయించి అన్నారు రుక్మిణమ్మగారు.

"చాల్లే! అతనికి ఖాళీ వుండద్దూ?" దాసు గారి మాటలకు మధ్యలోనే అందుకున్నాను.

"ఎంత మాట బాబుగారూ! మీరు కావాలంటే ప్రతి ఆదివారమూ వస్తాను. ఈ రోజుల్లో చదువుతామంటే వినేవాళ్లు కూడా దొరకరు" అంటూ సెలవు తీసుకున్నాను. నిజానికి కృష్ణమోహనదాసుగారితో మాట్లాడుతుంటే మనకు తెలియని ఎన్నో విషయాలను తెలుసుకోవచ్చు.



సిసింద్రీకి పుస్తకాలనైతే తెచ్చాను కానీ, చదువు చెప్పేది, ఎప్పుడు? తెల్లవారి ఆరు గంటల దగ్గర నుండి రాత్రి ఎనిమిది గంటలవరకూ హోటల్లోనే వుండాలి. మధ్యాహ్నం రెండు గంటలు ఖాళీ వుంటుంది కానీ, ఆ సమయంలో నేను కాలేజీలో వుంటాను.

"పోనీ, రాత్రి అయితే..." చటుక్కున అన్నాడు సిసింద్రీ.

నిజమే ఆ సమయం వీలుగానే ఉంటుంది. కానీ, పగలంతా చాకిరీ చేసివచ్చిన పసివాడు అంత స్ట్రెయిన్ తట్టుకోగలడా? అనుకున్నాను కానీ చదువుకోవాలనే ఆరాటంలో ఉన్న అతను నేను వారించినా వినలేదు. రోజూ రాత్రిపూట వచ్చి రెండు గంటలపాటు పాఠాలు చెప్పించుకుని మరీ ఇంటికి వెళ్లేవాడు.

ఒకరోజు ఉదయమే బిక్కమొహం పెట్టుకుని వచ్చాడు. ఏమిటని పలకరిస్తే ఒక్కసారి బావురుమన్నాడు. అంత ధాటీగా ఉండే సిసింద్రీ అలా బేలగా ఏడుస్తూంటే ముందు కంగారు పడ్డాను. తరచి తరచి అడిగిన తరువాత చెప్పాడు.

రాత్రి ఇల్లు చేరిన నాగన్న వీడికి ఏదో పని చెప్పేసరికి చదువుకోవాలని వెళ్లలేదట. దాంతో ఒళ్లుతెలియని కోపంతో చదువుతున్న పుస్తకాన్ని తగలబెట్టాడట. ఛ! ఏంమనిషి? కొడుకు చదువుకుని ప్రయోజకుడు కాకూడదని కోరుకుంటున్నాడా ఆ తండ్రి?

దానితో నాకు మరింత పట్టుదల కలిగింది. మళ్లీ పుస్తకాలు తెప్పిస్తానని ధైర్యం చెప్పి పంపించాను. ఆరోజునుండీ రోజూ రాత్రి వచ్చి పాఠాలు చెప్పించుకుని కాసేపు చదువుకుని ఇంటికి వెళ్లేవాడు. పుస్తకాలు ఇక్కడే వదిలేశాడు. ఇంటికి వెడితే తండ్రి ఏదోవిధంగా తన చదువు సాగనివ్వడని అతని భయం.

సిసింద్రీకి చదువు మీద ఉన్న ఆసక్తి చూస్తే ముచ్చటేసేది.

★ ★ ★

నాలుగు రోజులుగా విపరీతంగా వర్షం

కురుస్తూ ఉండడంతో కాలు బయట పెట్ట డానికి వీలు లేకుండాపోయింది. క్లాసులు కూడా కాన్సిల్ చేశారు. ఆ సాయంత్రమే కొంత తెరిపి ఇచ్చింది. డాబా మీదకి వచ్చి నిలబడ్డాను. కనుచూపు మేర ఎక్కడ చూసినా ఆకుపచ్చని కొబ్బరితోటలు. వర్షధారలతో నిలువునా స్నానం చేసినట్లు దుమ్మంతా కొట్టుకుపోయి తళతళలాడుతున్నాయి.

"ఏమిటోయ్! అంత దీక్షగా చూస్తున్నావ్? కవిత్వం తన్నుకువస్తోందా ఏమిటి లోపలినుంచి?" అప్పుడే నిద్రలేచిన జగదీష్ గదిలోంచి బయటకి వస్తూ అడిగాడు.

"కోనసీమ అందాలు చూస్తున్నాను" తన్మయత్వంతో అన్నాను. "చూడు గాలికి మెల్లగా తలలూపుతున్న ఈ నారికేళ ఫలవృక్షాలు చూస్తుంటే పింఛం విప్పుకుని నాట్యమాడే మయూరి గుర్తుకురావడంలేదూ?"

నా మాటకు ఫక్కున నవ్వాడు జగదీష్. "నీకు పింఛం విప్పుకుని నాట్యమయూరిలా కనిపిస్తున్న ఈ కొబ్బరిచెట్లు ఈ ఊరు వచ్చిన కొత్తలో నాకు ఎలా కనిపించేవో చెప్పనా?" నా సమాధానం కోసం ఆగకుండానే అన్నాడు, "ఒక రాత్రివేళ నిద్రపట్టక ఇలా డాబా మీదకు వస్తే తల విరబోసుకున్న జడల దెయ్యాల్లా కనిపించి భయపెట్టేవి"

ఛ! అపురూపమైన భావాన్ని నిలువునా చిత్రవధ చేశాడు. చిన్నబుచ్చుకున్న నా మొహంలోకి చూసి గట్టిగా నవ్వాడు జగదీష్. "నా మాటలకు అఫెండ్ అవకయ్యా తెలుగు మాస్టారూ! నీకున్న భావుకత్వం నాకెక్కడిదీ?" అంటూనే ఇంటివారి పెరటివైపు తొంగి చూసి అన్నాడు. "అయినా నువ్వు వచ్చిన దగ్గరనుంచీ నాకు కూడా పద్యాలు వినాలనే కోరిక పెరిగిపోతోందయ్యా. ఏదీ పుష్పవిలాపం నుంచి నాలుగు పద్యాలు వినిపించు"

ఇంటివారి పెరటిలో విరబూసిన ముద్ద మందారాన్ని చూసేసరికి మా వాడికి పుష్పవిలాపం గుర్తుకొచ్చిందన్నమాట. అతగాడిలో ఆ మాత్రం మార్పు వచ్చినందుకే సంతోషిస్తూ పుష్పవిలాపంలోని పద్యాలను ఎత్తుకున్నాను.

"......చివాలున కొమ్మవంచి గోరానెడునంతలోన, విరులన్నియు జాలిగ నోళ్లు విప్పి మా ప్రాణము తీతువా అటంచు బావురుమన్నవి, నా మానసమందెదో తళుకుమన్నది పుష్పవిలాప కావ్యమై...!"

కిందనున్న మందార చెట్టువెనకనుంచి ఇంటిగలవారి పెళ్లికున్న ఆడపిల్ల ఇవతలికి రావడంతో నా పాట గొంతులోనే ఆగిపోయింది. తలెత్తి నా వైపు చురచురా చూస్తూ చరచరా లోపలికి వెళ్లిపోయింది.

పగలబడి నవ్వాడు జగదీష్. 'అకట ఎంత దయలేనివారు మీ ఆడువారు!' అంటూ.

అర్థమైంది. జగదీష్ కావాలని చేసిన కొంటెపని ఇది. ఆ అమ్మాయి పూలు కోసుకుంటూ అటువైపుకి వెళ్లడం గమనించి వుండాలి. నన్ను అడ్డుపెట్టుకుని ఆ అమ్మాయిని టీజ్ చేశాడన్నమాట. బాధ్యతగల లెక్చరర్ అయివుండీ, ఒక బిడ్డకు తండ్రి అయిన జగదీష్ బొత్తిగా ఇలా కాలేజీ స్టూడెంట్‌లా ప్రవర్తించడం చాలా చికాకు కలిగించింది.

★ ★ ★

ఆరోజు కాలేజీలో అడుగుపెట్టేసరికి పిడుగులాంటి వార్త తెలిసింది. సెకండ్ ఇయర్ స్టూడెంట్ రమేష్ తన భార్యతో సహా ఆత్మహత్య చేసుకున్నాడు. అంత చిన్న కుర్రాడికి అప్పుడే పెళ్లి కావడమేమిటో భార్యతో సహా ఎండ్రిన్ తాగవలసిన అవసరమేమొచ్చిందో ఏమీ అర్థం కావడంలేదు.

అందరినీ సమావేశపరిచి రమేష్ ఆత్మశాంతికి రెండు నిమిషాలు మౌనం పాటించి శలవు ప్రకటించారు ప్రిన్సిపాల్ గారు.

ఆ రోజు శుక్రవారం. సెకండ్ సాటర్‌డే






# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తినీ, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**జనవరి చతుర నవల స్వాభిమానం**

.............................................................................

సమీక్షకుని పేరు: ..........................................................

చిరునామా: ....................................................................

.............................................................................

.............................................................................

.............................................................................

.............................................................................

శ్రీచంద్ర

తోపాటు సోమవారం పబ్లిక్ హాలీడే. నాలుగు రోజులు శలవు కలిసిరావడంతో చాలామంది లెక్చరర్లు అప్పటికప్పుడు ప్రయాణమై వెళ్లిపోయారు.

"ఏమైనా మనకు శలవు కలిసివచ్చేటట్టు చూసుకుని మరీ ఆత్మహత్య చేసుకున్నాడు. అందుకోసమైనా అతని ఆత్మశాంతికోసం మనం ప్రార్థనలు చేయాల్సిందే" కొంతమంది లెక్చరర్ల మాటలకు మనసు చివుక్కుమంది.

స్టూడెంట్స్ ద్వారా అతని కథను తెలుసుకున్నాను.

రమేష్‌ది అక్కడికి పది కిలోమీటర్ల దూరంలో ఉన్న మరో గ్రామం. అతని హైస్కూల్ చదువు ఆ ఊరిలోనే సాగింది. అప్పుడే తన క్లాస్‌మేట్ సుమతో ప్రేమలో పడ్డాడు. వారి పెళ్లికి కులాలు, అంతస్థులు అడ్డు వచ్చాయి. సుమ తండ్రి ఆ స్కూల్లో టీచర్. మందీమార్బలం ఉన్న అతను రమేష్ అంతు చూస్తానని బెదిరించాడు. పరిస్థితిని గమనించిన సుమ ధైర్యంగా ఇంటికి పారిపోయి రమేష్‌తో అన్నవరం వెళ్లి పెళ్లి చేసుకుని తిరిగి వచ్చింది. పెళ్లి సమస్యలకు అంతం కాదు, ఆరంభం అన్న విషయం తెలియని వయసు.

అవమానం భరించలేని సుమ తండ్రి అప్పటికప్పుడు సెలవు పెట్టుకుని సకుటుంబంగా ఊరు విడిచి వెళ్లిపోయాడు. తరువాత అక్కడినుంచి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు.

ఇక రమేష్ తల్లిదండ్రులకు వారిని భరించక తప్పలేదు. కానీ రోజుకూలీతో పాటు పూట గడవడమే కష్టమైన సంసారం. నలుగురు పిల్లలలోనూ రమేష్‌కి చదువు బాగా రావడంతో అతనిని స్కూలులో చేర్పించి మిగిలిన వారు కూలి పనులకు వెళ్లేవారు. భవిష్యత్తులో అందలం ఎక్కే అతని పైనే ఆ ఇంటిల్లపాదీ ఆశలు పెంచుకున్నారు. ఏదో చదువుకుని కుటుంబాన్ని ఉద్ధరిస్తాడనుకుంటే అయినింటి ఆడపిల్లను చేసుకుని ఆ పిల్ల బరువును కూడా వారిమీదే పెట్టాడు.

ప్రేమ సంకెళ్లతో సుమ బతుకు మట్టి గోడల మధ్య బందీ అయింది.

అత్తగారి సాధింపుల మధ్య, మామగారి విదిలింపుల మధ్య వారి ప్రేమే శాపమైంది.

పులిమీద పుట్రలా సుమకు నెల తప్పింది.

'మీకే తిండి పెట్టలేక ఛస్తున్నాం. మా ప్రాణానికి మరో బిడ్డా?' అని విసుక్కున్నారు ఇంటిల్లపాదీ. ఇరుగూ పొరుగూ హేళన చేశారు. బతుకు భారమై, భవిష్యత్తు అంధకారం కాగా దిక్కుతోచని స్థితిలో తమ జీవితాన్ని అంతం చేసుకున్నారు.

క్షణికమైన వ్యామోహానికి నూరేళ్ల జీవితాన్ని బలి చేసుకున్నారు ఆ చిన్నారి జంట.

మనసంతా వికలం కాగా ఏం చేయాలో తోచని స్థితిలో ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్లాను.

"చూశారా సాగర్! ప్రాణాలు తీసుకోవడం ఎంత తేలికైపోయిందో? బంగారంలాంటి జీవితాన్ని చేజేతులా నాశనం చేసుకున్నాడు. ఈ సంవత్సరం స్టేట్ ర్యాంకుతో మన కాలేజీకి పేరు తీసుకువస్తాడని ఎంతగానో ఆశించాను" విచారంగా అన్నారు ప్రిన్సిపాల్ గారు.

వచ్చిన అవకాశాన్ని వదులుకోవడం ఇష్టం లేక, ఎన్నాళ్లుగానో నా మనసులో ఉన్న ఆలోచనలను ఆయన ముందు పెట్టాను. మిగిలిన స్టూడెంట్స్ విషయంలోనైనా ఏమైనా చేయాలని, చదువును నిర్లక్ష్యం చేస్తున్నవారిని సరియైన మార్గంలోకి తీసుకురావాలనీ, సోషల్ ఏక్టివిటీస్ లో వారిని భాగస్వాములను చేయాలని, అందుకోసం పేరెంట్స్ మీట్ ఏర్పాటు చెయ్యాలనీ ఎన్నాళ్లుగానో నా మనసులో ఉన్న ఆలోచనలను ఆయన ముందు పెట్టాను.

నా మాటలలోని ఆవేశాన్ని గమనించి

నిస్సహాయంగా నవ్వారు ప్రిన్సిపాల్ గారు. "వచ్చిన కొత్తలో ఏవేవో చేయాలనే ఆవేశం ఉండడం సహజమే సాగర్. ఒకవైపు ఎగ్జామ్స్ దగ్గరకు వస్తున్నాయి. స్టూడెంట్స్ క్లాసులకే సరిగా రావడంలేదు. ఇక సోషల్ సర్వీస్ ఏక్టివిటీస్‌కి ఎంతమంది ముందుకు వస్తారు? వచ్చే సంవత్సరం చూద్దాంలే."

ఇల్లు చేరుకున్నా మనసంతా కలతగానే ఉంది. జగదీష్ కూడా ఊరు వెళ్లిపోవడంతో కనీసం మనసులోని మాటని చెప్పుకోవడానికి కూడా ఎవరూ లేనివాణ్ని అయ్యాను. సాయంత్రం వరకూ ఎలాగో ఓపిక పట్టి ఇక ఒంటరితనం భరించలేక దాసుగారి ఇంటికి బయలుదేరాను.

"ఏమిటి సాగర్! ఏమిటలా ఉన్నావ్? ఏమైంది?" నన్ను చూడగానే ఆతృతగా అడిగారు దాసుగారు. జరిగినదంతా ఆయనకు వివరించాను.

నిట్టూర్చారు దాసుగారు. "అవును, ఆ విషయం నేనూ విన్నాను. అయినా ఈ తరం వారికి ప్రాణాలు తీయడం, తీసుకోవడం చాలా తేలిక అయిపోయింది. దానికి తోడు ముక్కు పచ్చలారని వయసులో ఈ ప్రేమ వ్యవహారాలొకటి. మన ఊరిలో ఇటువంటి సంఘటన జరగడం ఇది మొదటిసారి కాదు"

"అదేమిటీ? ఏమైంది?" ఆతృతగా అడిగాను.

"మొన్న వేసవి సెలవలకి నువ్వు హైదరాబాద్ వెళ్లినపుడు మరో దారుణం జరిగింది"

"ఏమిటది?"

"ఏముందీ? టీనేజ్‌డ్ లవ్. అయితే ఇక్కడ ప్రేమికులిద్దరే కాదు. వీళ్లకారణంగా అభం, శుభం తెలియని మరో అమాయకుడు కూడా ప్రాణాలు తీసుకున్నాడు"

"ఎలా?"

"ఏముందీ? నైన్త్ క్లాస్ చదువుతున్న అమ్మాయి, టెన్త్ క్లాస్ చదువుతున్న అబ్బాయి ప్రేమలో పడ్డారు. ఇద్దరిదీ ఒక కులం కాదు. ఇరుగుపొరుగు ఇళ్లవాళ్లు. చిన్నతనం నుండీ కలిసిమెలిసి తిరిగిన వారు. ఆ చనువునే ప్రేమ అనుకున్నారా అమాయకులు. వారి చనువు గమనించిన అమ్మాయి తరపు పెద్దవాళ్లు అమ్మాయిని కట్టడి చేసి వెంటనే అమ్మాయికి పెళ్లి నిశ్చయం చేశారు. నిశ్చయ తాంబూలాలు తీసుకునే సమయానికి ఆ అబ్బాయికి విషయం తెలిసి తన స్నేహితులతో వాళ్ల ఇంటికి వెళ్లి తమ ప్రేమాయణాన్ని బయట పెట్టాడు. దానితో ఆ పెళ్లి ఆగిపోయింది. తమ కుటుంబపు పరువు గంగలో కలిసిందనే ఉక్రోషంతో అమ్మాయి తరపు పెద్దలు అతని ఇంటిమీద దాడి చేశారు. అంతవరకూ చాలా సామరస్యంగా ఉన్న ఇరుగుపొరుగులే. చూస్తూండగానే గొడవ ఆ రెండు కులాలమధ్య సంఘర్షణగా మారింది. అంత గొడవ అవుతుందని అనుకోని ఆ కుర్రాడు బెదిరిపోయాడు. ఒక్కగానొక్క కొడుకు ఏం అఘాయిత్యం చేసుకుంటాడోననే భయంతో అతడి స్నేహితుడిని కాపలా పెట్టారు. వాడూ చిన్నవాడేగా! ఒకరోజు ఆ పెద్దలంతా కత్తులూ కఠార్లూ పట్టుకుని బయలుదేరేసరికి ఆ స్నేహితుడు బెదిరిపోయి ఎండ్రిన్ తాగేశాడు. తనవల్ల తన స్నేహితుడు చనిపోవడం భరించలేని ఆ ప్రేమికుడూ ఆత్మహత్య చేసుకున్నాడు. తన వల్ల ఇద్దరు చనిపోవడం సహించలేనని ఆ పిల్ల ఉత్తరం రాసిపెట్టి నూతిలో దూకేసింది. క్షణికమైన వ్యామోహంలో పడి వాళ్ళ జీవితాలను అంతం చేసుకోవడమే కాదు, వాళ్ళ కారణంగా మరో అమాయకుడు బలి అయిపోయాడు"

"మనం చూస్తూ వుండడం తప్ప ఏమీ చేయలేమా? యువతరాన్ని సక్రమ మార్గంలో పెట్టే అవకాశమే లేదా?" ఆక్రోశించాను.

"మనం నిజంగా తలచుకోవాలే కానీ, ఏ పనీ కష్టంకాదు సాగర్!" ఇంకా ఏదో చెప్ప





బోతుండగానే ఎవరో బంధువులు వచ్చారని పాలేరు వచ్చి చెప్పడంతో నేను సెలవు తీసుకుని బయలుదేరాను.

మనసులోని బరువును తగ్గించుకోవాలని దాసుగారి ఇంటికి వెళ్లిన నేను మరింత భారమైన మనసుతో తిరిగివచ్చాను. ఆ రాత్రి అంతా మనసును కలచివేసే ఆలోచనలతో నిద్రపట్టలేదు.

చూస్తుండగానే రోజులు గడిచిపోతున్నాయి. పరీక్షల తరువాత వేసవి సెలవులు ఇవ్వడంతో హైదరాబాదు చేరుకున్నాను.

★ ★ ★

కాలేజీ తెరిచారు. ఈసారి హైదరాబాదు నుంచి వస్తూ సిసింద్రీ కోసం జనరల్ నాలెడ్జ్ పుస్తకాలు కూడా తీసుకువచ్చాను. సిసింద్రీ చదువు చాలా ప్రోత్సాహకరంగా సాగిపోతోంది. అందిస్తే అందుకు పోగలడు.

ఆ ఆదివారం సాయంత్రం కృష్ణమోహన దాసుగారి ఇంటినుండి వచ్చేసరికి ఎప్పటిలాగే ఆలస్యమైంది. ప్రతి ఆదివారం సాయంత్రం వారి ఇంటికి వెళ్ళడం, భాగవతంలో పద్యాలు చదివి వినిపించడం, ఆ తరువాత రుక్మిణమ్మగారి చేతి భోజనం చేసి రాత్రి ఎనిమిది గంటల వేళ రూముకి తిరిగి రావడం ఇటీవల చాలా మామూలు అయింది. నిజానికి కృష్ణమోహన దాసుగారితో మాట్లాడుతుంటే ఎన్నో విషయాలు నేర్చుకోవచ్చు. విద్యార్థులకు ఆయన ఏమైనా చేయగలిగితే ఎంత బాగుండేది? అలా అనుకున్నప్పుడల్లా జగదీష్ మాటలు మనసులో మెదిలేవి. "ఆ! ఆ ముసలాడి చాదస్తాన్ని ఎవరు భరించగలరయ్యా? బొత్తిగా బిసీ నాటి మనిషి. ఆ పాత చింతకాయ భావాలు భరించలేక మెల్లిగా ఆయన్ని తప్పించాం నేను ఈ కాలేజీలో చేరిన కొత్తలోనే" ఒక లెక్చరర్‌కే ఆయన విలువ తెలియలేదు. ఇక, చదువును ఒక కాలక్షేపంగా, భారంగా తీసుకుంటున్న విద్యార్థులకెలా తెలుస్తుంది?

ఆలోచనలతోనే ఇల్లుచేరిన నాకు మేడ మెట్ల దగ్గరే ఎదురుపడ్డాడు మధు.

"రండి, రండి మాస్టారూ! అందరం మీ కోసమే ఎదురు చూస్తున్నాం" మధు మాటలకు అప్పుడే గుర్తుకువచ్చింది. అతనికి బెంగుళూరులో ఇంజనీరింగ్ కాలేజీలో సీటు వచ్చిందనీ, ఈ రోజు మా డాబా మీదే లెక్చరర్లకీ, అతని ఫ్రెండ్స్‌కీ పార్టీ ఇస్తున్నానని వారం రోజుల క్రితమే చెప్పిన విషయం. మా డాబా మీద పార్టీ యిమ్మని సలహా ఇచ్చినవాడు జగదీషే.

"అయాం సారీ! లేట్ అయినట్లున్నాను" మేడ మెట్లు ఎక్కుతూ అన్నాను. "ఇంజనీర్‌వి కాబోతున్నందుకు ముందుగా నా అభినందనలను అందుకో. ఇంతకూ ఎప్పుడు నీ ప్రయాణం? "

"వచ్చే ఆదివారమే మాస్టారూ! అందుకే గ్రాండ్‌గా పార్టీ ఇవ్వాలని" మధు నవ్వులో, మాటలో భవిష్యత్తుపై కోటి కలలు కనిపిస్తున్నాయి.

పైకి వచ్చిన నేను డాబామీద చేసిన ఏర్పాటు చూసి నిర్ఘాంతపోయాను.

గదిలో వుండే టేబులు డాబామీదకు వచ్చింది. దానిమీద రకరకాల తినుబండారాలు, కేక్సూ, బిస్కట్లూ, స్వీట్లూ, హాట్. ఇవేవీ అభ్యంతరకరమైనవీ, అసహజమైనవీ కాదు. కానీ ఆ పక్కన టీపాయ్ మీదనున్న సీసాలూ, గాజు గ్లాసులూ, బిస్లేరీ సోడా సీసాలు, పెద్ద ఐస్ ఫ్లాస్కూ.

"ఏమిటిదంతా? " అయోమయంగా అడిగాను.

"పార్టీ మాస్టారూ! మధుకి ఇంజనీరింగు కాలేజీలో సీటు వచ్చిందని మనకి పార్టీ యిస్తున్నాడు" ఉత్సాహంగా అన్నాడు మురళి. ఒక్కసారి నిశితంగా చూశాను ఆ పిల్లలవైపు. అందరూ పదిహేడు పద్దెనిమిది సంవత్సరాల వయసు వారే. ఇప్పుడు ఇలాంటి పార్టీలకు అలవాటుపడుతున్న వీరు... అందులోనూ, ఒక లెక్చరర్ నివా



సంలో, లెక్చరర్సుతో కలసి... అందరి మొహాల్లోనూ పెల్లుబికే ఉత్సాహమే కానీ, ఎవరి మొహంలోనూ గిల్టీనెస్ కనిపించడం లేదు. అవును మరి, తాము చేస్తున్న పని తప్పు అని తెలుసుకున్నప్పుడే కదా, గిల్టీనెస్ అనేది రావడం. వీరి భవిష్యత్తు ఏమిటి? ఇప్పటినుంచే మాదక ద్రవ్యాలకు అలవాటు పడుతున్న వీరు తమ తల్లిదండ్రులకే కాదు, సమాజానికే తీరని భారమవుతారు. ఇదంతా చూసి సహించవలసిందేనా?

"ఇంక ప్రారంభించవయ్యా! ఇంత వరకూ విద్యాసాగర్ సార్ రావాలి అంటూ గడుపుకు వచ్చావు. ఇప్పుడైనా ప్రారంభం చెయ్యి" ఫిజిక్స్ లెక్చరర్ రామారావు మాటలు చెవిన పడేసరికి మనసు రగిలిపోయింది. ఇక సహనం వహించలేకపోయాను.

"ఇంకా ఇంజనీరింగు కాలేజీలో అడుగైనా పెట్టలేదు. అప్పుడే నీ పతనానికి నువ్వే గోతులు తవ్వుకుంటున్నావన్నమాట" మధు వైపు తిరిగి తీవ్రంగా అన్నాను.

మధు తల వంచుకున్నాడు.

"అదేమిటి? ఏదో కుర్రాళ్లు సరదాగా పార్టీ చేసుకుంటున్నారు, అందుకు వారిని అభినందించవలసింది పోయి? " కెమిస్ట్రీ లెక్చరర్ గారి మాటలకు అడ్డువచ్చాను.

"దేనికి అభినందించమంటున్నారు మాస్టారూ! లోకం పోకడ తెలియని వయసులోనే తాగి తందనాలాడబోతున్నందుకా? ఒక బాధ్యత కలిగిన టీచరుగా స్టూడెంట్సుని ఈ ప్రయత్నం నుంచి వారించవలసిన మీరు ఛీ! ఛీ"

"మరీ ఇంత చాదస్తమేమిటయ్యా బాబూ ఈ రోజుల్లో ఇది చాలా మామూలే. బహుశా ఎప్పుడూ సిటీ మొహం చూడలేదేమో? అక్కడ హైస్కూలు పిల్లలు కూడా పార్టీలు చేసుకుంటూ, ఎంత ఎంజాయ్ చేస్తూవుంటారో తెలుసా? " కొత్తగా వచ్చిన బోటనీ లెక్చరర్ జస్వంత్ అన్నాడు.

"అబ్బే! మీకా సందేహం ఏమీ అక్కరలేదు జస్వంత్! మనవాడు నగర రాజధాని నుంచి వచ్చిన వాడే. దేశ రాజధానిలోనే పుట్టిపెరిగినా, తెలుగు మాస్టారు కదూ! పూర్వకాలపు పిలక మాస్టారు స్థాయికి మించి ఎదగలేకపోయాడు మానసికంగా" హేళనగా అంటున్న జగదీష్ మాటలకు అందరూ గొల్లుమని నవ్వారు.

ఇక వీళ్ళను లక్ష్యపెట్టవలసిన అవసరం లేదు.

"మధూ!" మధు కళ్లలోకి సూటిగా చూశాను. "మధూ! బంగారంలాంటి భవిష్యత్తు నీ ముందు వుంది. మోక్షగుండం విశ్వేశ్వరయ్యలాంటి మహనీయుణ్ణి ఆదర్శంగా తీసుకుని ఒక బాధ్యత గల ఇంజనీరుగా దేశశ్రేయస్సు కోసం పాటుపడుతూ, నీ తల్లిదండ్రులను సంతోషపెడతావో లేక త్రాగుబోతువై బాధ్యతారహితంగా తిరుగుతూ నీ భవిష్యత్తును చేజేతులా నాశనం చేసుకుంటావో నిర్ణయించుకోవలసినది నువ్వే. నిన్ను ఈ పార్టీ యిమ్మని ప్రోత్సహించినది ఎవరో నాకు తెలియదు కానీ, కేవలం నీ డబ్బుతో తమ ఆనందాన్ని అందుకోవాలని చూస్తున్నారన్న విషయాన్ని మాత్రం మరచిపోకు"

"ఇక ప్రారంభించాడు ఉపన్యాసం" వెనుక నుండి ఎవరో విసుగ్గా అంటున్నారు.

"అతని విషయం తెలుసుండీ ఈ పార్టీని ఇక్కడ ఎందుకు పెట్టారయ్యా బాబూ అందరి మూడ్సూ పాడుచేశాడు"

"అనవసరంగా వచ్చాం"

"పెద్ద తనేదో అపర శ్రీరామచంద్రుణ్ణనుకుంటున్నాడు"

"ఛ! బొత్తిగా కల్చర్‌లేదు"

వెనుకనుండి రకరకాల మాటలు వినిపిస్తున్నాయి.

"సాగర్!" తీవ్రంగా వినిపించింది జగదీష్ మాట. "ఇప్పటికే చేసిన రభస చాలు. నీ లిమిట్స్ ఏమిటో తెలుసుకో. నీ దగ్గరనుండి

పనికిమాలిన నీతివాక్యాలు వినడంకోసం ఇక్కడ మేం సమావేశం కాలేదు" జగదీష్ హెచ్చరికతో ఈ లోకంలోకి వచ్చాను.

"ఓ అయాం సారీ" గిరుక్కున వెనక్కి తిరిగాను.

ఎదురుగా తల్లి గోదావరి కనిపించేసరికి ఈ లోకంలోకి వచ్చాను. రగిలిపోతున్న మనస్సుతో అనాలోచితంగా ఆ ఇంటినుండి బయటపడిన నేను, నాకు తెలియకుండానే గోదావరి ఒడ్డుకు చేరుకున్నానన్నమాట.

గట్టున కూర్చున్నాను. పౌర్ణమి కాబోలు, ఆకాశంలోని నిండు చందమామ తన చల్లని కిరణాలతో మనసును సేద తీరుస్తున్నాడు. వెన్నెల కిరణాలు నదిలో ప్రతిబింబిస్తూ గాలి కదలికలకు మిలమిలా మెరుస్తున్నాయి. చల్లటి పిల్లగాలి మెల్లిగా వీస్తోంది.

అద్భుతమైన ప్రకృతి సౌందర్యం మన పక్కనే వున్నా చూడలేని గుడ్డివాళ్ళమవుతున్నాం. డబ్బుతో ఆనందాన్ని కొనుక్కోగలమని అనుకుంటూ మానసిక, శారీరక ఆరోగ్యాలను పణంగా పెడుతున్నాం.

ఏవేవో ఆలోచనలతో మనస్సు పరిపరివిధాల పోతోంది. 'ఎప్పుడూ సిటీ మొహం చూడలేదేమో? అక్కడ హైస్కూలు పిల్లలు కూడా సరదాగా పార్టీలు చేసుకుంటూ లైఫ్‌ని ఎంజాయ్ చేస్తున్నారు' జస్వంత్ మాటలు మనసులో మెదిలాయి.

హు! ఆ విషయం ఇక్కడ వున్నవారికంటే నాకు బాగానే తెలుసు. నిజానికి అటువంటి వాతావరణానికి దూరంగా వుండాలనేకదా అమ్మానాన్నల మాటలు కాదని ఈ మారుమూల పల్లెటూరికి వచ్చింది? అసలీ ఊరు వచ్చేముందు ఏమనుకున్నాను? కృత్రిమమైన నగర వాతావరణానికి దూరంగా, ప్రకృతి మాత ఒడిలో స్వచ్ఛమైన జీవితం గడుపుతున్నారనుకున్నాను.

నేను ఏ వాతావరణానికి దూరంగా వుండాలని ఇంత దూరం వచ్చానో, అదే వాతావరణం ఇక్కడా ఎదురుకావడం చెప్పలేనంత నిస్పృహను కలిగిస్తోంది. ఒక్కసారి ఆ డాబామీద పిల్లలు గుర్తుకు వచ్చారు. లోకంలోని మలినం అంటకుండా పెరగవలసిన వయసు, ఈ వయసుకే ఈ పార్టీలు, అందులోనూ ఒక లెక్చరర్ గదిలో, లెక్చరర్స్‌తో కలిసి...!

మిగిలినవారికి వినడానికి చాదస్తంగానే వుండవచ్చు కానీ, ఇది ఈనాటితో ఆగదు. హైస్కూలు స్థాయిలోనే పార్టీలకు అలవాటుపడి, కాలేజీస్థాయిలో మాదకద్రవ్యాలకు బానిసలై, తరువాత విశృంఖలత్వానికి అలవాటుపడి ఆ కాలేజీ జీవితంలోనే తమ శరీరాలను శిథిలం చేసుకున్నవారిని మా కాలేజీలోనే ఎంతమందిని చూడలేదు. ఏమైపోతోంది ఈ యువతరం?

"మాస్టారూ!"

ఒక్కసారి ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాను. చిన్నబుచ్చుకున్న మొహంతో మధు నిలబడి వున్నాడు.

"నన్ను క్షమించండి మాస్టారూ! ఇక ఎప్పుడూ ఇటువంటి పార్టీలు ఇవ్వను. అసలా ఛాయలకే వెళ్ళను" దృఢంగా వినిపించింది మధు కంఠస్వరం.

"మధూ!" సంభ్రమంగా చూశాను. "చాలా మంచి నిర్ణయం తీసుకున్నావు మధూ! ఏ ప్రభావానికీ లొంగని ఆత్మస్థైర్యం నీకు వుండాలని మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాను. ఇంతకూ నువ్వు వచ్చి ఎంతసేపు అయింది?"

"మీ వెనుకనే వచ్చాను మాస్టారూ! కానీ మిమ్మల్ని పలకరించే ధైర్యం లేక నిలబడిపోయాను"

"అయాం సారీ! నేను గమనించలేదు" నొచ్చుకుంటూ అన్నాను.

"టైం ఎంత అయిందో?"

రేడియం డయల్ వాచీ చూసుకుని చెప్పాడు మధు. "పదకొండు గంటలు కావస్తోంది మాస్టారూ!"





ఉలిక్కిపడ్డాను. మూడు గంటలసేపు అలాగే కూర్చుండిపోయానన్నమాట. పాపం, ఇంతసేపూ మధు అలా నిలబడే వున్నాడన్నమాట. అయినా ఇనుము వేడిగా వున్నప్పుడే సుత్తిదెబ్బలు పడాలి.

"కూర్చో మధూ!" ఆ ప్రశాంత వాతావరణంలో నా మాటలను చాలా ఓపికగా విన్నాడు మధు.

"ఇప్పటికే చాలా ఆలస్యమైంది. ఇక ఇంటికి వెళ్ళు మధూ! మీ అమ్మానాన్నా నువ్వు ఇంకా ఇంటికి రాలేదని కంగారుపడుతూ వుంటారు"

"అదేమిటి మాస్టారూ! మరి మీరిక్కడే కూర్చుంటారా? లేవండి వెడదాం" మధు మాటలకు లేవబోయి మళ్ళీ కూర్చుండిపోయాను. ఇంత రాత్రివేళ రూమ్‌కి వెళ్ళడం, పార్టీ పాడు చేసినందుకు జగదీష్ నిష్ఠూరమాడడం, మాటకు మాట పెరగడం నాకు ఇష్టంలేదు. అయితే ఇంత రాత్రివేళ వెళ్ళడానికి ఇంకోచోటు ఏది?

"మా ఇంటికి రండి మాస్టారూ! మీరు ఒంటరిగా ఎంతసేపు కూర్చుంటారు? మీరు ఒక్కరూ ఇక్కడ వుండిపోతే నేను ఇంటికి వెళ్ళి నిద్రపోగలనా? ఇద్దరం మా ఇంటికి వెడదాం. లేదా తెల్లవారేవరకూ మీకు తోడుగా నేనూ ఇక్కడే కూర్చుంటాను" చివరికి మధు పట్టుదలతో అతని కూడా వెళ్ళక తప్పలేదు.

తలుపు తట్టిన వెంటనే తలుపు తీసిన ఆ నడివయసు స్త్రీ బహుశా మధు అమ్మగారు అనుకుంటాను. ఒక్కసారి నావైపు నిరసనగా చూసి చటుక్కున వెనక్కి తిరిగి లోపలి గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె చూపు విషం పూసిన బాణంలా నా గుండెల్లో గుచ్చుకుంది. ఒక్కసారి గతుక్కుమన్నాను.

"ఇలా రండి మాస్టారూ!" కలత చెందిన మనసుతో మధుని అనుసరించాను.

"ఇప్పటికి ఇల్లు గుర్తుకు వచ్చిందన్నమాట. ఇక్కడే ఇలా వున్నవాడు రేపు ఆ పట్నవాసంలో ఇంకెలా మారతాడో? " దిగులుగా వినిపించింది పక్కగదిలోంచి పురుష స్వరం. బహుశా మధు తండ్రి అయివుంటాడు.

"లోకం తెలియని పసివాడు. వాడికేం తెలుస్తుంది? అయినా పిల్లల ఖర్చులతో తమ సరదాలు తీర్చుకోవడానికి ఆ మాస్టర్లకి సిగ్గెందుకు లేదో? తాగింది చాల్లేదు కాబోలు, ఇంటికే చేరాడు" కసిగా అంటున్నది మధు తల్లి. కన్నతల్లి ఆవేదన అది.

"అనవసరంగా డబ్బు కట్టి మరీ పంపిస్తున్నాం. చదువుకు పంపి వాడిని వ్యసనాలకు అలవాటు చేసేకంటే, ఇక్కడే వ్యవసాయంలో పెడితే మంచిదేమో? "

"వద్దు, వద్దు" కంగారుగా వారిస్తోంది ఆమె. "నెమ్మదిగా నచ్చచెబుదాం. అంతేకానీ అనవసరంగా వాడి భవిష్యత్తుని నాశనం చేయకండి"

ఆ భార్యాభర్తల మాటలు వింటూ మంచంమీద దుప్పటి పరుస్తున్న మధు మొహంలోకి చూశాను. ఎర్రబడ్డ మొహంతో చూపులు తప్పించుకుంటూ పక్క సర్ది, "మీరు పడుకోండి మాస్టారూ" అంటూ లోపలికి నడిచాడు. మడతమంచం తీసుకుని వచ్చి వాల్చుకుని నిండుగా ముసుగు పెట్టేశాడు.

అతగాణ్ణి డిస్టర్బ్ చేయడం ఇష్టంలేక నేను కూడా నిద్రపోడానికే ప్రయత్నం చేశాను. కానీ ఎంత సేపటికీ నిద్ర రాదు. పక్క గదిలోనుంచి వినిపించిన సంభాషణే మనసులో మెదులుతోంది. ఈ ఆవేదన ఎంత మంది తల్లిదండ్రులదో?

★ ★ ★

భళ్ళున తెల్లవారింది.

బద్ధకంగా కళ్ళు విప్పి చేతినున్న వాచీ వంక చూసి ఉలిక్కిపడ్డాను. తొమ్మిది గంటలు కావస్తోంది. ఏనాడూ ఆరుగంటలు దాటిన తరువాత లేచి ఎరుగని నేను అంత

మొద్దునిద్ర ఎలా పోయానో తెలియదు. అసలే నాపై దురభిప్రాయంతో ఉన్న మధు తల్లిదండ్రులు ఇంత ఆలస్యంగా నిద్రలేచిన నాపై మరింత అసహనం పెంచుకోకుండా వుంటారా? వారి మొహం ఎలా చూడాలో అర్థంకాక, పది నిముషాలు గదిలోనే వుండి పోయాను.

"లేచారా మాస్టారూ! రండి, కాఫీ, ఫలహారాలు చల్లారిపోతున్నాయి" గదిలోకి వచ్చి సాదరంగా పిలుస్తున్న ఆ నడివయసు వ్యక్తి మధు తండ్రి అనుకుంటాను. రాత్రి వినిపించిన వారి మాటలకు, ఇప్పటి మాటలకు ఎంత వ్యత్యాసం. ఇంటికి వచ్చిన అతిథిని చిన్నబుచ్చకూడదనే అభిప్రాయంతో ఇలా పై పై మర్యాదలతో పలకరిస్తున్నారా? నా మనసుకు అదే నిజమనిపించింది. నా ఆలోచనను నాలోనే అణచిపెట్టి పాలేరు ముందు నడవగా పెరటివైపు వెళ్ళాను. అక్కడ అరుగుమీద చెంబుతో నీళ్ళు, కొత్త బ్రష్, పేస్టూ, సోపు, తీగమీద తెల్లని ఇస్త్రీ తువ్వాలు. లోపలికి వచ్చేసరికి డైనింగు టేబుల్ దగ్గర మధూ, అతని తండ్రి నా కోసమే ఎదురుచూస్తూ కూర్చున్నారు.

మౌనంగానే కాఫీ ఫలహారాలను కానిచ్చాం. మధు వంచిన తల ఎత్తడం లేదు. అసలే రాత్రి భోజనం లేదేమో మధు తల్లిగారు కొసరి కొసరి వడ్డిస్తుంటే, ఆవురావురుమని తిన్నాం నేనూ, మధూ. సెలవు తీసుకుంటున్న నా రెండు చేతులూ పుచ్చుకున్నారు మధు తండ్రి హరినారాయణ గారు.

"మమ్మల్ని క్షమించండి మాస్టారూ! మిమ్మల్ని చాలా అపార్థం చేసుకున్నాం" అంటున్న ఆయనవైపు తెల్లబోయి చూశాను.

"మా వాడు నిన్న జరిగినదంతా చెప్పాడు మాస్టారూ!" మధు అంతకుముందే అక్కడనుంచి మెల్లిగా జారుకున్నాడు.

"అవును బాబూ! మీ మాస్టర్ల ప్రోత్సాహంతోనే పిల్లలిలా తయారవుతున్నారనీ, వారిని వారించడం ఎలాగో తెలియక, ఏం చెయ్యాలో తోచక కుమిలిపోతున్నాం. బట్టలు కొనుక్కోమని తండ్రి డబ్బు ఇస్తే, ఆ డబ్బు పెట్టి ఆ పాడు సీసాలేవో తెచ్చాడనీ, మీ ఇంట్లో అందరూ చేరారని నిన్న సాయంకాలం చీకటి పడుతుండగా వచ్చి చెప్పాడు మా పాలేరు. ఇక్కడే ఇలా వుంటున్న వీడు రేపు అక్కడికి వెళ్ళాకా ఎలా తయారౌతాడా అని దిగులు పడుతున్నారు ఆయన. ఆ కోపంతోనే ఇంటికి వచ్చిన మిమ్మల్ని కనీసం మంచినీళ్ళు కావాలా? అని కూడా అడగలేకపోయాను పాపిష్టిదాన్ని. నన్ను క్షమించండి బాబూ!" కన్నీళ్ళతో రెండుచేతులూ జోడించారు మధు తల్లి.

"అంత మాట అనకండమ్మా" వారిస్తూనే హరినారాయణగారివైపు తిరిగాను. "పెద్దలు, మీరు క్షమిస్తే ఒక్కమాట. జరిగినదానిలో ఎదుటివారిలో తప్పులు వెదకడం మాని, ముందు మన లోపాల్ని మనం సవరించుకోవడం మంచిదని నా అభిప్రాయం. పిల్లలకి మంచి చెడ్డలు చెప్పవలసిన బాధ్యత తల్లిదండ్రులకు లేదంటారా? " నిర్మొహమాటంగా అన్నాను.

"మా మాటలు వినిపించుకుంటారా మాస్టారూ ఈ రోజుల్లో పిల్లలు? " నిస్పృహగా అన్నారు హరినారాయణగారు.

"మీ మాటలే వినిపించుకోని మీ పిల్లలు, ఇక మా మాటలు ఎలా వినిపించుకుంటారు? " ఏదో అనబోయిన హరినారాయణ గారిని చేతి సైగతోనే వారించాను.

"స్టూడెంట్సుతో పార్టీలు ఇప్పించుకునే స్థాయికి మా లెక్చరర్స్ దిగజారిపోయినందుకు నేను సిగ్గుపడుతున్నాను. కానీ తల్లిదండ్రులు వారి బాధ్యతలను ఎంత వరకూ నిర్వర్తిస్తున్నారు? కాలేజీ ఫీజులు కట్టి, పుస్తకాలు కొని ఇచ్చినంత మాత్రాన, మీ బాధ్యత తీరిపోతుందా? ఏనాడైనా వారెలా చదువుతున్నారో మీరు పట్టించుకుంటున్నారా? వారిని గమనిస్తున్నారా? "





"మమ్మల్ని ఏం చేయమంటారో చెప్పండి మాస్టారూ! ఏదోవిధంగా మా పిల్లలు బాగు పడేటట్లు చూడండి"

"ఒకరిని బాగుచేయడం ఏ ఒక్కరివల్లా అయ్యే పనికాదు బాబుగారూ! అయినా నేనెంతటివాడిని? మనం అందరం కలిసిక ట్టుగా ఆలోచించి చేద్దాం. మధు గురించి మీరేమీ బెంగపడకండి. బుద్ధిమంతుడు. చెప్పింది విని అర్థం చేసుకునే విజ్ఞత అత నికి వుంది" అంటూ వారివద్ద సెలవు తీసు కుని కాలేజీకి బయలుదేరాను.

దారి పొడవునా ఒకటే ఆలోచన ఏం చేయాలని? ఇదివరలో పేరెంట్స్ టీచర్స్ మీట్ పెట్టి అందరినీ కలుపుకు రావాలనే ఆలోచన ఎన్నిసార్లు వచ్చినా, ఇంతవరకూ కార్యరూపం దాల్చలేదు. తొందరలోనే ప్రిన్సి పాల్‌గారితో ఈ విషయం గురించి మాట్లా డాలని నిశ్చయించుకున్నాను.

కాలేజీ మెయిన్‌గేటు దగ్గరే ఎదురుప డ్డాడు జగదీష్. నన్ను చూస్తూనే తల తిప్పు కుని విసురుగా వెళ్ళిపోయాడు. కళ్ళు ఎర్ర బడి, మొహం జేవురించి వుంది. లోపలకు వెళ్లేసరికి చాలామంది లెక్చరర్లు, కొంత మంది స్టూడెంట్సూ అదే పరిస్థితిలో వున్నారు. అంటే, నిన్న మధు వచ్చేసిన తరువాత కూడా పార్టీ నిర్విఘ్నంగా జరిగిం దన్నమాట.

జగదీష్‌ని కలిసి మాట్లాడాలని ఎంతగా ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. నన్ను చూస్తూనే తల తిప్పుకుని వెళ్ళిపోతు న్నాడు. మిగిలిన లెక్చరర్స్ కూడా సూటి పోటి మాటలు ప్రారంభించారు. ఈ పరిస్థి తిలో టీచర్స్, పేరెంట్స్ గెట్ టుగెదర్ గురించి మాట్లాడడం ఎలా?

నాకు వ్యక్తిగతమైన ఇబ్బంది ఇప్పుడే ఎదురైంది. ఇన్నాళ్ళూ జగదీష్ మంచిత నంతో అతనితో వుండడం వల్ల ఏ ఇబ్బందీ లేకుండా గడిచిపోయింది. కానీ అతని అహం దెబ్బతిన్న తరువాత ఇంకా అతనితో కలిసి ఉండడంలో అర్థంలేదు. అయితే, వేరే గది చూసుకునేవరకూ ఎక్కడ వుండాలి? ఆమధ్య కొత్తగా వచ్చిన రామారావు ఒక వారం పదిరోజులు తనకు ఇల్లు దొరికేవ రకూ కాలేజీలోనే వుండిపోయాడు. ఆ విషయం గుర్తుకు వచ్చింది. ఒక సమస్య తీరిపోయినట్లే.

ప్రిన్సిపాల్‌గారిని కలిసి నాలుగురోజుల పాటు వేరే గది దొరికేవరకూ కాలేజీలోనే వుండడానికి పర్మిషన్ తీసుకున్నాను. ఒక్క సారి నావైపు నిశితంగా చూసి కారణమేమీ అడగకుండానే పర్మిషన్ ఇచ్చారు. నేనూ కారణాలు వల్లె వేయదలచుకోలేదు.

నాలుగురోజుల తరువాత క్లాసునుండి బయటకు వచ్చేసరికి దాసుగారి దగ్గరనుండి ఒకసారి ఇంటికి వచ్చి వెళ్ళమని కబురు అందింది.



"రా! బాబూ. ఇంటికి రమ్మని కబురు చేసి నీ పనికేమీ ఆటంకం కలిగించలేదు కదా" ఎప్పటిలాగే సాయంత్రం పొగడచెట్టు కింద కూర్చున్న దాసుగారు నన్ను చూడ గానే సాదరంగా ఆహ్వానించారు.

"ఏమిటీమధ్య కాలేజీలోనే మకాం పెట్టా

వట? " అడిగిన దాసుగారికి జరిగినదంతా వివరంగా చెప్పాను.

"వ్యసనపరుడైన నీ స్నేహితుడ్ని విడిచి వచ్చినందుకు సంతోషమే. కానీ..."

"జగదీష్ స్వతహాగా మనిషి మంచివాడు బాబుగారూ!" దాసుగారి మాటలను మధ్య లోనే అడ్డుకున్నాడు.

"ఏ మనిషీ స్వతహా చెడ్డవాడుకాదు సాగర్! కానీ, స్టూడెంట్స్ చేత ఇటువంటి పార్టీలు ఇప్పించుకునే స్థితికి టీచర్స్ దిగజా రారంటే నైతికంగా అంతకుమించిన పతనం ఏముందీ? " జవాబు చెప్పలేక తల వాల్చు కున్నాను.

"సరే, ఆ విషయం అలా వదిలెయ్. కాలే జీలో మకాం పెట్టడమేమిటి? నీ స్నేహితు డితో వుండలేకపోతే తిన్నగా ఇక్కడకు వచ్చే యలేకపోయావా? "

"ఫరవాలేదండీ. అక్కడ సౌకర్యంగానే వుంది"

"నీకు సౌకర్యంగానే వుంది సరేనయ్యా! కానీ మీ ప్రిన్సిపాల్ గారి సంగతి ఏమిటి? "

"అదేమిటి? నేను ప్రిన్సిపాల్ గారి పర్మి షన్ తీసుకునేగా అక్కడ వున్నాను. పైగా ఈమధ్య కొత్తగా వచ్చిన లెక్చరర్ ఇల్లు దొరి కేవరకూ కాలేజీలోనే వున్నారు"

"నువ్వు తీసుకోవలసింది ప్రిన్సిపాల్ గారి పర్మిషన్ కాదు, కాలేజీ ప్రెసిడెంట్ భుజంగ రావుది"

"అదేమిటి, ఇందులో కమిటీ ప్రెసిడెంట్ గారి పర్మిషన్ దేనికి? " తెల్లబోయిన నన్ను చూసి మెల్లిగా నవ్వి అన్నారు.

"భుజంగరావు గురించి చెడుగా చెప్పాలనే సరదా నాకేమీలేదుకానీ, లేదనడానికి కోడలె వరనే మనస్తత్వం భుజంగరావుది. ప్రిన్సిపా ల్ గారిని కాకుండా నువ్వు ఆయన్నే డైరె క్టుగా అడిగి వుంటే, సంతోషంగా నాలుగురో జులు కాదు, నీకు ఇష్టమైనన్ని రోజులు అక్కడ వుండడానికి పర్మిషన్ ఇచ్చి వుండే వాడు. అయినా, అసలు నువ్వు ఈమధ్య అతన్ని కలుసుకున్నావా? " నిశితంగా నన్నే చూస్తూ అడిగారు.

మొదటిరోజు అనుభవం మనసులో మెదిలి మనసంతా చేదు తిన్నట్టుగా అయింది. ఈమధ్య ఏమిటి? అసలు జాయిన్ అయినరోజున తప్ప ఇంతవరకూ ఆయన్ని చూడనేలేదు. ఆ విషయమే చెబితే మందలింపుగా చూశారు.

"సరే వెళ్ళు! వెళ్ళి నీ సామాను తీసుకుని వచ్చెయ్. నీవల్ల మీ ప్రిన్సిపాల్ కి మాట రాకుండా చూసుకో"

"కానీ, మీకు ఇబ్బంది"

"మధ్య నాకు ఇబ్బంది ఏమిటయ్యా. నీ సామాను తీసుకుని వచ్చెయ్" అంటూ పాలే రుని నాతో పంపించారు.

నేను కాలేజీకి వెళ్ళేసరికి కారణమేమిటో తెలియదుకానీ, ప్రిన్సిపాల్ గారు ఇంకా ఆయన రూమ్ లోనే వున్నారు. నేను రావడం గమనించి వాచ్ మేన్ తో కబురుచే శారు.

నన్ను సాదరంగా లోపలకు ఆహ్వానించి చావుకబురు చల్లగా చెప్పారు. "అయాం సారీ సాగర్! స్టాఫ్ కాలేజీలో వుండడానికి ప్రెసిడెంట్ గారు ఒప్పుకోవడంలేదు. 'ఇది కాలేజీయా? లేక లాడ్జింగ్ హౌసా? ' అని ఇప్పుడే ఫోన్ చేసి అడిగారు"

నాలుగు రోజులు కాలేజీలో వుండడానికి అనుమతి ఇచ్చినందుకు ఆయనకు థాంక్స్ చెప్పి అప్పటికప్పుడు సామాను తీసుకుని దాసుగారి ఇంటికి చేరాను.

నేను హాయిగా నా సంగతి చూసుకు న్నాను. కానీ సిసింద్రీ సంగతి? రాత్రి పది గంటలవరకూ అతగాణ్ణి ఇక్కడకు తీసుకుని వచ్చి పాఠాలు చెబుతానంటే బాగుం టుందా? అలాగని, అతగాణ్ణి చదువుకోమని ప్రోత్సహించి, అతను ఒక దారిలో పడు తున్న సమయంలో నా సుఖం చూసుకుని అతన్ని మధ్యలోనే వదిలెయ్యడం అన్యాయం కాదా? చివరికా సమస్యను





దాసుగారికే వదిలేశాను. సిసింద్రీ కథను విన్న దాసుగారు చాలా సంతోషపడ్డారు.

"చాలా మంచి పని చేశావు సాగర్. ఇంతకూ ఎవరా సిసింద్రీ? నీ మాటలు వింటూవుంటే నిజంగా సిసింద్రీలాంటి వాడే ననిపిస్తోంది. చదువుమీద అంత శ్రద్ధ వున్న కుర్రాడికి మనకు చేతనైన సహాయం చేయాలి. అంత పసివాడు పనిచేసుకుంటూ అర్ధరాత్రి వరకూ చదవడమేమిటి? సరే, వాడి సంగతి నేను చూసుకుంటానులే"

హరినారాయణగారితో పేరెంట్స్, టీచర్స్ మీటింగ్ గురించి ప్రిన్సిపాల్ గారితో మాట్లాడతానని మాట ఇచ్చి అప్పుడే పదిరోజులు గడిచిపోయాయి. చివరికి ఆరోజు ఆయన ఖాళీగా వున్న సమయం చూసి ఆయన రూముకి వెళ్ళి నెమ్మదిగా నా అభిప్రాయం తెలియచేశాను.

"కొత్తగా వచ్చిన ఉత్సాహంలో నువ్వేమిటో అనుకుంటున్నావుకానీ, ఎంతమంది పేరెంట్సుకి వాళ్ళ పిల్లల చదువుపట్ల శ్రద్ధ వుందంటావు? వాళ్ళ విషయం అలా వదిలేయ్. కనీసం ఎంతమంది లెక్చరర్స్ కలిసి వస్తారంటావ్? "

"అలాగని మనం ఏ ప్రయత్నమూ చేయకుండా కూర్చుందామా సార్. మన స్టూడెంట్స్ ఎందుకూ పనికిరానివారిగా తయారౌతుంటే అది మనకు సిగ్గుచేటు కాదా? అయినా మనం ఏ ప్రయత్నమూ చేయకుండా ఇతరులు కలిసి రారని ఎలా అనుకుంటాం"

"సరే, నీ ఉత్సాహాన్ని కాదనడం ఎందుకు? మిగిలిన స్టాఫ్‌తో మాట్లాడి డేట్ ఫిక్స్ చెయ్యి. చూద్దాం"

"థ్యాంక్యూ సార్" తేలికపడ్డ మనసుతో బయటకు వచ్చాను.

నాలుగురోజుల పాటు లెక్చరర్స్ అందరినీ కలిసి పేరెంట్స్ డే గురించి మాట్లాడడం జరిగింది.

నా పట్ల ఎంతమందికి వ్యతిరేకత వుందో బాగానే తెలిసివచ్చింది. ముఖ్యంగా ఆరోజు పార్టీలో వున్న లెక్చరర్స్ చాలా నిర్లక్ష్యంగా మాట్లాడారు. మిగిలినవారిలో నిర్లిప్తత. చూద్దాం అన్నవారు ముగ్గురో, నలుగురో? ఇక మీటింగ్ ఎలా ఏర్పాటు చేయడం? నిరుత్సాహం కలిగింది.

అయితే, ఈ కార్యక్రమం ఇంతటితో ఆగిపోవలసిందేనా? ఊహూ... వీల్లేదు. నాలో మరింత పట్టుదల పెరిగింది. కనీసం పేరెంట్సు కలిసి వచ్చినా మీటింగు ఏర్పాటు చేయవచ్చు. లెక్చరర్స్ క్రమంగా వాళ్ళే మారతారు. పేరెంట్సుని కలవాలని నిశ్చయించుకున్నాను.

పాలకవర్గం ప్రెసిడెంటు, పైగా రంజనికి గార్డియన్ కూడా కాబట్టి ముందుగా ఆయన్ని కలవాలని నిర్ణయించుకున్నాను. కాలేజీనుండి తిన్నగా వారి ఇంటికే వెళ్ళాను.

★ ★ ★

వీధి అరుగుమీద వాలుకుర్చీలో కూర్చుని పేపరు తిరగేస్తున్నారు భుజంగరావుగారు.

"రండి మాస్టారూ! రండి" లోపలనుండి పరిగెత్తుకువచ్చింది రంజని.

"కూర్చోండి మాస్టారూ!" కుర్చీ ముందుకు జరుపుతూ అంది రంజని.

"ఏమిటి తాతయ్యా! మాస్టారిని కూర్చోమని చెప్పవేం? " తాతగారిని చూస్తూ రుసరుసలాడింది.

"ఊ... కూర్చోవయ్యా!" పేపరు మడుస్తూ అన్నారు భుజంగరావుగారు.

శ్రీమాన్ భుజంగరావుగారి సరసన కూర్చునే అదృష్టం కలిగింది. ఏమైనా భుజంగరావుగారి ఇంట అంతటి ఆదరణ ఆశ్చర్యంగానే వుంది.

"ఇక లోపలకు వెళ్ళు. వీధి గుమ్మం ఎక్కి ఏమిటీ వేషాలు? " రంజనివైపు చూస్తూ ఒక్క కసురు కసిరారు.

"మీరు కూర్చోండి మాస్టారూ!" తాతగారి వైపు నిర్లక్ష్యంగా చూసి తల ఎగిరేసి లోపలకు నడిచింది.

# ఏరినముత్యాలు

❖ తెలివితేటలకన్నా, బుద్ధికుశలత కన్నా ప్రేమ విలువైనది. దైవభక్తిని అదే ప్రబోధిస్తుంది.

– జాక్వీన్ మార్టిన్

❖ బానిసగా ఉన్నా సరే మంచివాడు స్వతంత్రుడే, చెడ్డవానిగా ఉన్న వ్యక్తి రాజైనా బానిసే.

– జెస్సీ. సియాంగ్

❖ మనం బలహీనులమనుకుంటూ విచారిస్తూ కూచుంటే ప్రయోజనం శూన్యం. బలపడడమెలాగన్నదే మన నిరంతర ధ్యానం కావాలి.

– వివేకానందుడు

❖ సత్ప్రవర్తన ద్వారా ఆర్జించిన వ్యక్తి సొమ్ము అతడి పిల్లల వరకూ ఏమాత్రం తరగకుండా చేరుతుంది. అంతే కాదు, కష్టాలనుంచి అది వారిని కాపాడుతుంది.

– తిరుక్కురళ్

❖ ప్రార్థన భగవంతుని చూసేందుకు పనికి వచ్చే కన్నులాంటిది.

– ఏల్ ఫెడ్ టి. గ్రిన్‌ఫెర్

❖ ఈ ప్రపంచంలో ఆచంద్రతారార్కం నిలిచేది మూడే మూడు. అవి విశ్వాసం, ఆశ, ప్రేమ! కానీ వాటిలో మహోన్నతమైనది ప్రేమ. ప్రేమ వల్లనే మానవుని జ్ఞానం పరిపూర్ణమై శోభిస్తుంది.

– జీసస్

❖ నిరంతరం ప్రశ్నించే స్వభావం, ఏకాగ్రతతో వినడం, అలసిపోకుండా తెలుసుకోడానికి ప్రయత్నించడం ఈ మూడు గుణాలద్వారా వివేకం ఉదయిస్తుంది.

– పంచతంత్రం

❖ మంచి ఆలోచనలకు మనిషి పవిత్రతే ఆధారం.

– గీతాంజలి

❖ దృఢమైన ఆశలే మనల్ని మనుషులుగా తయారుచేస్తాయి

– టెన్నీసన్

❖ టన్నులకొద్దీ ఉపన్యాసాలివ్వడం కన్నా ఒక ఔన్స్ ఆచరణ మేలు.

– స్వామీవివేకానంద

❖ స్వర్గం, నరకం అనేవి బలహీనులు, నిస్సహాయులు సృష్టించుకున్నవి.

– జాన్ సావంత్

❖ లలితకళలలో మానవుడి మనోవాక్కాయ కర్మలన్నీ మిళితమై ఉన్నాయి.

– జాన్ రస్కిన్

సేకరణ: జిల్లేళ్ళ బాలాజీ

"ఆడపిల్లలు మరీ బరితెగించిపోతున్నారు" విసుక్కుంటూ నావైపు చూశారు.

"ఊ! ఏమిటయ్యా పంతులూ విశేషాలు? మళ్ళీ ఏదో హడావుడి ప్రారంభించావుట? ఏమో అనుకున్నాను కానీ ఫరవాలేదు. జనాలను ఎలా ఆకట్టుకోవాలో నీకు బాగానే తెలుసు. నాయకుడివయ్యే లక్షణాలు బాగానే వున్నాయి."

ఆయన మాటల్లో వ్యంగ్యం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. అయితే కాలేజీ విశేషాలు ఈయనకి ఎప్పటికప్పుడు తెలుస్తూనే వున్నాయన్న మాట. మరీ మంచిది.

నెమ్మదిగా ప్రారంభించాను. పేరెంట్స్ డే ఆవశ్యకతను గురించీ, తరువాత ఆయన చేతులమీదుగా సమావేశం ప్రారంభం కావాలనీ.

నా మాటలకు ఒక్కక్షణం ఆలోచనలో పడ్డారు భుజంగరావుగారు. ఆయనలో ఆలోచన కలగడమే శుభశూచకమనిపించింది.

"సరే! నేను పదిహేనో తారీఖున హైదరాబాదు వెడుతున్నాను. మళ్ళీ తిరిగి ఎప్పుడు వస్తానో చెప్పలేను. మరి ఆ ముందు రోజు ఏర్పాటు చేయగలరా? వారంరోజుల కంటే సమయంలేదు"

ఆ సమయం చాలు. భుజంగరావుగారి మాటలకు సంతోషంగా అంగీకరించాను.

"మాస్టారూ!" లోపలనుండి ట్రేలో కప్పుతో వచ్చింది రంజని.

భుజంగరావుగారి మొహంలో అసహనం స్పష్టంగా తెలుస్తోంది. కానీ, రంజనికి లక్ష్యపెట్టే అలవాటు వున్నట్లుగాలేదు. అనవసరమైన కాలయాపన ఎందుకని కాఫీ అలవాటు లేదని మర్యాదగా తిరస్కరించి ఆ ఇద్దరి వద్దా సెలవు తీసుకుని హరినారాయణగారి ఇంటికి బయలుదేరాను. సమయం ఎక్కువ లేదుకాబట్టి ఈరోజు కొంతమందినైనా కలుసుకోవచ్చునని నా ఆలోచన. తీరా వెళ్ళేసరికి హరినారాయణగారు ఇంకా పొలంనుంచి రాలేదు. ఎప్పుడు వస్తారో తెలియదని చెప్పారు. సరే, మీటింగు విషయం ఆయన వచ్చిన తరువాత చెప్పమని చెప్పి ఉదయమే వస్తానని, కొంత మంది పేరెంట్సుని కలుసుకోవడానికి ఆయన సహాయం కావాలనీ, ఇంటరు చదువుతున్న ఆయన రెండో కొడుకు ముకుందానికి చెప్పి ఇంటిదారి పట్టాను.

వీధి అరుగుమీద కుర్చీలో కూర్చుని వున్న దాసుగారు అరుగుపక్క చేతులు కట్టుకుని నిలబడి వున్న నాగన్నతో సీరియస్‌గా మాట్లాడుతూ కనిపించారు. ఏముందీ, సిసింద్రీ విషయమే అయి వుంటుంది అనుకుంటూ దాసుగారి పక్క కుర్చీలో కూర్చున్నాను.

"నీ కొడుకుని నా దగ్గర పనిలో పెట్టుకుందామనుకుంటున్నానయ్యా! ఏమంటావ్?"

దాసుగారి మాటలకు ఒక్క క్షణం తడబడ్డాడు నాగన్న.

"మీ మాటను కాదంటానా బాబయ్యా! పెద్దోడు కృష్ణమూర్తిగారి దగ్గర చేస్తున్నాడు కదండయ్యా! వారింట్లో హద్దు తీరిపోయిన తరువాత అలాగే మీ ఇంట్లో పెడతాను బాబూ!"

"ఆ కుర్రాడు కాదయ్యా! మీ చిన్నోడు"

"అదేంటి బాబూ! వాడు బొత్తిగా కుర్రకుంక. వ్యవసాయపు పనులకు పనికిరాడు బాబూ"

"అంతవరకూ ఇంటిపనులు చేయించుకుంటానులే. నెలకి వంద రూపాయలు ఇస్తాను. నీకు ఇష్టమైతే పనిలోపెట్టు లేదంటే మరెవరినైనా చూసుకుంటాను"

నాగన్న కళ్ళు మిలమిలా మెరిసాయి. అవునుమరి, నెలకు ఏభై రూపాయలు సంపాదించే కొడుకు ఒక్కసారిగా వంద రూపాయలు తెచ్చుకుంటాడంటే సంతోషమే మరి.

"అబ్బెబ్బే! ఎంత మాట బాబూ. మీ మాట కాదనగలనా?"

"సరే. రేపు ఉదయమే వాడిని బట్టలు తీసుకుని ఇక్కడకు వచ్చేయమను. నువ్వు



ప్రతీ నెలా మొదటి తారీఖున వచ్చి వంద రూపాయలూ తీసుకుని వెళ్ళు"

"అదేమిటి బాబూ. పగలంతా ఇక్కడ పనిచేసి రాత్రికి ఇంటికి వస్తాడుగా"

"లేదు, వాడు ఇక్కడే వుండిపోవాలి. అలాగని మీవాడిచేత రాత్రింబవళ్ళు పని చేయించుకోనులేవయ్యా"

"మీ ఇష్టం బాబయ్యా" బుర్ర గోక్కుంటూ అన్నాడు నాగన్న. "పని అయిపోయిన తరువాత ఇంటికి పంపించేయకూడదా బాబుగారూ. అహా... మరేంలేదు. వాళ్ళమ్మ వాడిని వదిలి వుండలేదు బాబూ"

దాసుగారు సీరియస్‌గా అన్నారు.

"చూడు నాగన్నా! ఈమాత్రం కుర్రవాడు నాకు దొరకడని నిన్ను అడగడం లేదు. మీవాడి మంచికోసమే చెబుతున్నాను. నీ కుర్రాడిని నాకు అప్పగించు. తిండీ, బట్టా ఇచ్చి నెలనెలా నీకు డబ్బు ఇస్తాను. నీకైనా, నీ భార్యకైనా చూడాలని అనిపించినప్పుడు వచ్చి చూసి పొండి. పండగలప్పుడూ, అప్పుడూ వాడూ మీ ఇంటికి వస్తాడు. అయినా నీకు ఇష్టంలేకపోతే చెప్పు. నేను మరో కుర్రాడిని చూసుకుంటాను" ఇక మాట్లాడవలసింది ఏదీలేనట్టుగా కుర్చీలోంచి లేచారు దాసుగారు.

"అలా కోపగించకండి బాబయ్యా! మీ కాళ్ళదగ్గర పడి వుండేవాళ్ళం, ఏదో చిన్నోడనే భ్రాంతితో అన్నానంతే. మీ ఇష్టం వచ్చినట్లే కానివ్వండి బాబూ" వంగి వంగి దండాలు పెడుతూ సెలవు తీసుకున్నాడు నాగన్న.

నేను కేవలం ప్రేక్షకుడిలా చూస్తూ వుండిపోయాను.

★ ★ ★

మరునాడే సిసింద్రీని తీసుకువచ్చి దాసుగారికి అప్పగించి వెళ్ళాడు నాగన్న.

"ఏం పని చేయమంటారు బాబూ" చేతులు కట్టుకుని అడుగుతున్న సిసింద్రీని చూసి మెల్లిగా నవ్వారు దాసుగారు.

"నీ పుస్తకాలు తెచ్చుకో"

ఒక్క క్షణం అయోమయంగా చూశాడు. నా వద్దనున్న అతని పుస్తకాలు తీసుకుని వచ్చి అతనికి ఇచ్చాను.

"ఇప్పటిదాకా నువ్వు చదివిన పాఠాలు మరోసారి చదివి సాయంత్రానికి అప్పచెప్పు. అప్పుడు మీ మాస్టారు కొత్తపాఠం చెబుతారు. అదే నీ పని"

సిసింద్రీ మొహంలో మెదిలిన భావాలను వర్ణించడానికి మాటలు చాలవు. అయోమయం, సంభ్రమం! ఏమనుకున్నాడో ఏమిటో ఒక్కసారి దాసుగారి కాళ్ళమీద పడి బావురుమన్నాడు. నిజానికి నేను కూడా అంతటి ఆదరణను ఊహించలేదు. ఎలాగూ ఇక్కడే పనిచేస్తూ వుంటాడు కాబట్టి తీరిక వున్నప్పుడల్లా పాఠాలు చెప్పవచ్చుననుకున్నాను. కానీ కేవలం అతనిని చదివించడంకోసమే పనిలో పెట్టుకుంటారని ఊహించలేకపోయాను.

ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నారు దాసుగారు. వటవృక్షంలాంటి ఆయన నీడన చేరిన సిసింద్రీయే కాదు, నేనూ అదృష్టవంతుడనే.

ఇక సిసింద్రీ చదువు నల్లేరుమీద నడకలా సాగిపోతుంది.

★ ★ ★

ఆరోజే కాలేజీలో పేరెంట్స్‌డే.

చెప్పిన సమయానికి రెండుగంటలు ఆలస్యంగా వచ్చారు భుజంగరావు. రావడమే సరాసరి సమావేశం ఏర్పాటుచేసిన గదిలోకి వచ్చి వేదికపై వున్న కుర్చీలో కూర్చుని సమావేశం ప్రారంభించమని ప్రిన్సిపాలుగారిని ఆదేశించారు.

ప్రిన్సిపాల్‌గారు సమావేశం ఏర్పాటుచేయడంలోని ఉద్దేశ్యాన్ని దాని వలన కలిగే ప్రయోజనాలనూ వివరించి భుజంగరావుగారు ముందుగా తమ సందేశాన్నీ, సూచనలనూ ఇస్తారని ప్రకటించగానే మైక్ చేతోపుచ్చుకుని మహోపన్యాసమే చేశారు భుజం





గరావుగారు.

కాలేజీ ప్రెసిడెంటుగా కాలేజీకి తాను చేసిన సేవ, కాలేజీకి చుట్టుపక్కల ఏయే గ్రామాలనుంచి ఎంతమంది విద్యార్థులు చదువుకోవడానికి వస్తున్నారో గ్రామాలవారీగా లెక్కలు చెప్పారు. తనకున్న రాజకీయ పలుకుబడిని ఉపయోగించి కాలేజీకి పీజీ సెంటరు తెప్పిస్తానని హామీ ఇచ్చారు. కాలేజీకి ఎంతోకొంత డొనేషన్ పడేసి చేతులు దులుపుకుని ఇంట్లో కూర్చుంటే ప్రయోజనమేమీ వుండదనీ, అహర్నిశలూ దాని గురించి శ్రమపడాలనీ, అప్పుడే కాలేజీకి రాష్ట్రవ్యాప్తంగా పేరుప్రఖ్యాతులు లభిస్తాయనీ అన్నారు.

చివరిగా ఊపిరిసలుపని పనిలో వున్నా ఈ విద్యాలయంపట్ల తనకు వున్న అభిమానంతో ఈ సమావేశానికి తను రావడం జరిగిందనీ, సభ్యులు అనుమతిస్తే ఇతర కార్యక్రమాలు చూసుకోవలసిన బరువుబాధ్యతలు తనకు వున్నాయి కాబట్టి వెళ్లివస్తానని చెప్పి వంది మాగధులు వెంట రాగా సమావేశం నుండి వెళ్లిపోయారు.

భుజంగరావుగారు వెళ్లిపోవడంతో సగం మందిపైగా లేచి ఏవేవో కారణాలు వల్లెవేస్తూ మెల్లిగా బయటకు జారుకున్నారు. మిగిలినవారు ఎవరికివారే నాయకులుగా మాట్లాడడం ప్రారంభించారు. ఒకరి తరువాత మరొకరు మాట్లాడాలని ప్రిన్సిపాల్ గారు ఎన్నిసార్లు విజ్ఞప్తిచేసినా ప్రయోజనం లేకపోయింది.

"మా పిల్లల చదువుసంధ్యలు మేమే చూసుకోవలసి వస్తే ఇక మీరందరూ ఎందుకండీ?" అని ఒక తండ్రి మర్యాదగా ప్రశ్నిస్తే,

"చదువుల గురించి మాకేం తెలుస్తుందండీ? మా పిల్లలకు చదువు రావాలని ఫీజులు కట్టి కాలేజీలకు పంపించగలం కానీ, వాళ్ళ చదువుల గురించి శ్రద్ధ తీసుకోవడం మా వల్లనేమవుతుందండీ?" అంటూ ఒక తండ్రి ఆవేదన పడ్డాడు.

ఒక వ్యక్తి మాత్రం స్టూడెంట్స్‌ని కంట్రోలు చేయలేని లెక్చరర్స్‌నీ, వాళ్ళను కంట్రోల్ చేయలేని ప్రిన్సిపాల్‌ని దుమ్మెత్తిపోశాడు. దానితో కొంతమంది లెక్చరర్స్ తిరగబడ్డారు. దాంతో లెక్చరర్స్ ఒక వర్గమూ, పేరెంట్సు ఒక వర్గమూ అయ్యారు. వారి వాదోపవాదాలతో ఆ హాలు దద్దరిల్లిపోయింది. రెండువర్గాల మధ్యా సర్దిచెప్పలేక ప్రిన్సిపాల్‌గారు తల పట్టుకుని కూర్చుండిపోయారు.

చూస్తుండగానే లెక్చరర్స్ అందరూ తమ నిరసనను తెలియచేస్తూ వాకౌట్ చేశారు.

ఇదేనా నేను ఆశించిన పేరెంట్స్, టీచర్స్ సమావేశం? ఈ సమావేశంలో అందరమూ కలిసి విద్యార్థుల సమస్యలను చర్చించుకుని ఏదైనా సోషల్ సర్వీస్ యాక్టివిటీస్ ప్రారంభిస్తే బాగుంటుందన్న ఆలోచనతో ప్రారంభించిన సమావేశం మరిన్ని అపార్థాలకు చోటు కల్పిస్తూ ఆగిపోయింది. చివరికి ప్రిన్సిపాల్‌గారికి మరింత ఇబ్బంది కలిగించిన వాడినయ్యాను.

★ ★ ★

"అదేమిటి సాగర్! ఏమిటలా వున్నావు? ఆరోగ్యం బాగోలేదా?" గుమ్మంలో అడుగు పెడుతూండగానే ఎదురువచ్చి ఆత్రుతగా ప్రశ్నించారు దాసుగారు.

కాలేజీలో జరిగిన మీటింగ్ విశేషాలను తెలియచేశాను.

"లెక్చరర్స్‌కి ఏమీ చెప్పలేం కానీ స్టూడెంట్స్‌ని సోషల్ సర్వీస్ యాక్టివిటీస్‌లో భాగస్వాములను చేయడం పెద్ద కష్టమేమీకాదు. వారి ఎనర్జీని సరిగా ఛానలైజ్ చేయగలిగితే సమాజానికి ఎంతైనా ఉపయోగపడగలరు" అన్నారు దాసుగారు.

"ఈ ఊళ్ళో ఏం యాక్టివిటీస్ ఉంటాయి. కనీసం మంచి పుస్తకాలు చదివిద్దామన్నా సరైన లైబ్రరీ లేదే?" నిరుత్సాహంగా అన్నాను.



"పిల్లలకు చదివే ఆసక్తి వుండాలికానీ, పుస్తకాలకు లోటేమిటి? ఈ ఊరి లైబ్రరీ చదివేవారు లేక తాళం పెట్టవలసి వచ్చింది"

"ఈ ఊర్లో లైబ్రరీ వుందా? " ఆశ్చర్యంగా అడిగాను.

"శివాలయం పక్కనే వుంది. బహుశా నువ్వు ఆ పక్కకి వెళ్ళి వుండవు. అది స్థాపించి సరిగ్గా నూరేళ్ళు పూర్తి అవుతోంది"

"అయితే, ఆ గ్రంథాలయానికి శతజయంతి ఉత్సవాలు జరిపిస్తే..." ఆతృతగా అన్నాను. ఆ కారణంగా అయినా లైబ్రరీని మళ్ళీ తెరిపించవచ్చు.

"సరే... రేపు ఆదివారమేగా. ఉదయం ఒకసారి అక్కడికి వెడదాం. నలుగురు కుర్రాళ్లను చూడు" అన్నారు దాసుగారు.

మరునాడు ఉదయం పదిగంటలకు పదిమంది కుర్రాళ్ళను వెంటబెట్టుకుని లైబ్రరీ దగ్గరకు వెళ్ళాం.

'వీరేశలింగ కవి సమాజం' బోర్డు దూరానికే కనిపిస్తోంది.

తలుపులు తెరవగానే ఎదురుగా కనిపించింది కందుకూరి వీరేశలింగంగారి నిలువెత్తు చిత్రపటం.

దానికింద ఆకుపచ్చని అక్షరాలు చాలా కాలం క్రితం రాసిన కారణంగా కొంచెం వెలిసిపోయి వున్నాయి.

'తన దేహము తన గేహము
తన కాలము తన ధనంబు తనవిద్య జగజ్జనులకు వినియోగించిన ధనుడు'

అలాగే ఎదురుగా వున్న గోడమీద ఆకుపచ్చని అక్షరాలలో చిలకమర్తి వారి కొటేషన్.

'వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమైయున్నదో
జ్ఞానము అట్లు స్వాధీనము కావలయును.
ఉదకమెల్లవారికి ఎట్లు సేవ్యమైయున్నదో
జ్ఞానమును అట్లు సేవ్యమై యుండవలెను.
సూర్యచంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి ఎట్లు సౌఖ్య ప్రదముగ నున్నదో
జ్ఞానమును అట్లు సౌఖ్యప్రదముగా నుండవలెను'

(చిలకమర్తి)

ఒక చిన్న కార్యక్రమం ఏర్పాటు చేయలేక పోయాను. నిరుత్సాహపడ్డాను. కానీ ఆ రోజుల్లో ఆ మహనీయుడు ఎదుర్కొన్న అవాంతరాలముందు ఇదెంత? కాలానికి ఎదురొడ్డి పోరాడిన ఒంటరి యోధుడు. కాలేజీలో కార్యక్రమం విఫలమైందని నిరుత్సాహపడిన నాకు కందుకూరివారి జ్ఞాపకాలు స్ఫూర్తినిచ్చాయి. కాలేజీ ప్రమేయం లేకుండా ఊళ్ళోని యువకులను సమీకరించి ఈ గ్రంథాలయం బూజులు దులిపి వారి చేత ఈ పుస్తకాలను చదివించాలి.

దాసుగారి కబురు అందుకుని నలుగురు పనివాళ్ళు వచ్చారు. పిల్లలు పుస్తకాల బీరువాలను ఖాళీచేస్తే పనివారు బీరువాల దుమ్ము దులిపి శుభ్రం చేశారు. పిల్లలు పుస్తకాల దుమ్ము దులిపితే నేనూ, దాసుగారూ వాటిని ఒక ఆర్డరులో పెట్టాం.

ఇంతలో హరినారాయణగారు కూడా వచ్చి మాతో కలిశారు. ఆయన కొంతమంది స్టూడెంట్స్ సహాయంతో వాటికి కేటలాగు తయారుచేశారు. పిల్లలు పుస్తకాలను ఒక వరుసక్రమంలో బీరువాలలో సర్దడం ప్రారంభించారు. నిజంగా ఎన్ని అపురూప గ్రంథాలు? ఇంతటి విలువైన గ్రంథాలయం ఇక్కడ ఒక మారుమూల గ్రామంలో వుందని బహుశా బయటవారికి తెలియదేమో? ఈ పుస్తకాల విలువ ఇక్కడి వారికి తెలియదు. ఎంత దురదృష్టం? నిజానికి తెలిస్తే ఈ పాటికి సగం పుస్తకాలు కనుమరుగై వుండేవేమో?

పుస్తకాలు సర్దుతుంటే తాళపత్ర గ్రంథం ఒకటి కనిపించింది. తాళపత్ర గ్రంథాన్ని అందరూ కుతూహలంగా చూశారు. చేతివ్రాతతో మరికొన్ని గ్రంథాలు కనిపించాయి. ఇంకా చాలా పుస్తకాలు సర్దవలసి వుంది.




అయినా అప్పటికే చీకటి పడడంతో మిగిలిన పనిని మరునాటికి వాయిదా వేసి ఇళ్లకు బయలుదేరాం.

తెల్లారి ఉదయమే వచ్చి గదులు దులిపి కడిగి శుభ్రం చేశారు పనివాళ్ళు. సాయంత్రం కాలేజీ నుండి డైరెక్టుగా పది మంది కుర్రాళ్లను తీసుకుని లైబ్రరీకి వెళ్లాను. అప్పటికే దాసుగారూ, హరినారాయణగారు మరి పదిమంది యువకులతో కలసి పని చేస్తూ కనిపించారు. దాసుగారు బల్బులు, ఫానులూ పెట్టించడంతో రాత్రి పది గంటల వరకూ కూర్చుని మొత్తం పని పూర్తిచేశాం.

సరే, ఇక శత జయంతి ఉత్సవాలు ఎప్పుడు చేయాలి? ముఖ్య అతిథిగా ఎవరిని పిలవాలి?

నందుల బలరామయ్యగారిని పిలిస్తే బాగుంటుంది. సలహా ఇచ్చారు దాసుగారు. నిజమే స్వాతంత్ర్య సమరయోధుడు, గ్రంథాలయోద్యమంలో పని చేసిన వ్యక్తి, నిజమైన గాంధేయవాది.

తేదీ నిర్ణయించుకునే లోపలే ఊరి పెద్దలను కలుసుకుని కార్యక్రమం గురించి తెలియజేస్తే బాగుంటుంది. సలహా ఇచ్చారు దాసుగారు.

నిజమే, పదిమంది సహాయసహకారాలుంటే తప్ప ఇటువంటి కార్యక్రమాలు జయప్రదం కావు.

కానీ నిన్నకాక మొన్న పేరెంట్స్ డే ఏర్పాటు చేసి అభాసుపాలయ్యాను. అది మరుగున పడకుండానే మళ్ళీ ఈ కార్యక్రమం తలకెత్తుకుంటే...! ఎదురుగా చిత్ర పటంలోంచి వీరేశలింగం పంతులుగారు నన్ను చూసి నవ్వినట్లుగా అనిపించింది. ఇంత చిన్నచిన్న విషయాలకే నిరుత్సాహపడితే ఎలా అని మందలిస్తున్నట్లుగా అనిపించింది.

★ ★ ★

"ఊ! ఏమిటయ్యా పంతులూ! మళ్ళీ ఏదో హడావిడి ప్రారంభించావట? ఏమో అనుకున్నాను కానీ, పరవాలేదు, జనాలను ఎలా ఆకట్టుకోవాలో నీకు బాగానే తెలుసు. ఈ విషయంలో మా రాజకీయ నాయకులు నీ ముందు ఎందుకూ పనికిరారనుకో" హరినారాయణగారితో కలసి ఇంటి గుమ్మంలో కనిపించిన నన్ను చూడగానే వ్యంగ్యంగా అన్నారు భుజంగరావుగారు.

గ్రంథాలయ శత జయంతి ఉత్సవాలను గురించి నెమ్మదిగా వివరించాను.

"ఊ! కృష్ణమోహనదాసు మంచి ఎత్తే వేశాడన్నమాట" ఆయన మాటలకు తెల్లబోయాం నేనూ, హరినారాయణగారూ.

"నీకు తెలియదులే, ఆ మనిషికి కీర్తి కండూతి ఎక్కువ. కాలేజీ పాలక వర్గం నుంచి తప్పించేసరికి ఒడ్డునపడ్డ చేపలా గిలగిల్లాడిపోతున్నాడు. కనీసం ఈ గ్రంథాలయ శతజయంతి ఉత్సవాల పేరు చెప్పుకుని పైకి రావాలని చూస్తున్నాడన్నమాట"

"క్షమించండి, ఇందులో ఆయన ప్రమేయమేమీలేదు. యువకులకు ఏదైనా వ్యాపకముంటే బాగుంటుందన్న ఆలోచనతో ఈ శత జయంతి ఉత్సవాల విషయాన్ని నేనే ప్రస్తావించాను" అనకుండా వుండలేకపోయాను.

"అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గరా! అని ఆ మనిషి సంగతి నాకు తెలియకపోతే కదయ్యా! అతగాడు చూసుకోలేకపోతున్నాడని ఆ లైబ్రరీ బాధ్యతను కూడా నేనే తీసుకున్నాను. దానితో నాకేదో పేరుప్రఖ్యాతులు పెరిగిపోతున్నాయన్న భయంతో దానికి తాళంపెట్టి కూర్చున్నాడు. ఒట్టి మూర్ఖుడు. ఆ లైబ్రరీని కట్టించింది ఎంత తన పెదతండ్రి అయితే మాత్రం, దానిమీద తన పెత్తనమే సాగాలంటే ఎలా? " విషం కక్కాడు భుజంగరావు.

లైబ్రరీ దాసుగారి వంశీయులదా? ఆయన మాటమాత్రంగానైనా అనలేదే? ఆశ్చర్యంగా అనిపించింది.

"సరే, శతజయంతి ఉత్సవాలు ఎప్పుడు చేద్దామనుకుంటున్నారు? ఆ కార్యక్రమానికి ముఖ్యమంత్రిగారిని పిలుద్దామా? లేక గవర్నర్‌గారిని పిలవమంటావా? పనిలోపని వారితోపాటు మరో ఇద్దరు మంత్రులను కూడా పిలిస్తే సరి"

"క్షమించాలి. కార్యక్రమానికి నందుల బలరామయ్యగారు వస్తున్నారు. ఆ విషయం వారికి తెలియజేయడం కూడా అయింది" అంటున్న హరినారాయణగారి వైపు తెల్లబోయి చూశాను.

"మీ చాదస్తపు వాళ్లతో ఇదేనయ్యా చిక్కు. మీకు తోచదు, కనీసం తెలిసినవాళ్లను అడగాలనైనా అనుకోరు. మినిష్టర్లను పిలిస్తే తరువాత గ్రాంట్స్ అవీ సంపాదించుకోవచ్చు"

"లైబ్రరీ వున్నదున్నట్టు ఉపయోగించుకుంటే చాలండీ! కావాలనుకుంటే మళ్ళీ సంవత్సరం వారిని పిలుద్దాం" హరినారాయణగారి మాటలకు మొహం మాడ్చుకున్నారు భుజంగరావుగారు.

"సరే, మీరు నిర్ణయించుకున్నాక నేను చెప్పేదేముందీ!"

భుజంగరావుగారివద్ద సెలవు తీసుకుని బయటపడ్డాం ఇద్దరమూ.

"నేను భుజంగరావుగారితో అబద్ధం ఆడడం మీకు ఆశ్చర్యంగా వుంది కదూ, మాస్టారూ! అలా అనకపోతే మొత్తం ప్రోగ్రాం మార్చేస్తారు. గ్రంథాలయోద్యమానికి సారథ్యం వహించిన బలరామయ్యగారినీ, ఈ గ్రంథాలయం కోసం పాటు పడుతున్న దాసుగారినీ ఒకపక్కకు నెట్టేస్తారు. నొప్పింపక, తానొవ్వక అని, నాకు ఇంతకుమించి మార్గం దొరకలేదు. అన్నట్టు ఈ రోజే దాసుగారిచేత బలరామయ్యగారికి ఒక ఉత్తరం రాయించండి. తేదీ తరువాత తెలియజేస్తామని రాయించండి" బయటకు వచ్చిన వెంటనే తన మనసులోని మాటను బయటపెట్టారు హరినారాయణగారు.

★ ★ ★

"ఏమిటీ! లైబ్రరీ మీదేనా?" ఆశ్చర్యంగా అడుగుతున్న నన్ను మందలింపుగా చూశారు దాసుగారు.

"గ్రంథాలయం, దేవాలయం, విద్యాలయం ఇవి ఎవరికీ సొంతం కాదయ్యా! ప్రజల సొమ్ము. కట్టించినవారు ఎవరైనా దానికి ట్రస్టీలు మాత్రమే. ఇక ఈ లైబ్రరీ విషయానికివస్తే, కట్టించినది మాత్రం మా పెదతండ్రిగారే. తన పేరు నిలబెట్టే పిల్లలు ఎలాగూలేరు. ఈ గ్రంథాలయమే తన పేరు నిలబెట్టే బిడ్డ అనేవారు. ఆయనే ఒక పెంకుటిల్లు కట్టించి పుస్తకాలు తెప్పించి ఏర్పాటు చేశారు. ఆడవారు బయటకు రాలేని ఆ రోజుల్లో మనిషిని పెట్టి ఇంటింటికీ పుస్తకాలను పంపించేవారు. ప్రతిరోజూ యువకులను అక్కడ కూర్చోబెట్టి పేపరు చదివి వినిపిస్తూ వుండేవారు. ఆ రోజుల్లో జాతీయోద్యమ కార్యక్రమాలకు ఆ లైబ్రరీయే కేంద్ర బిందువుగా వుండేది. రాత్రి పాఠశాలను కూడా నిర్వహించేవారు. ఆయన వున్నన్నాళ్లూ ఆయనే చూసుకున్నారు. ఆయన తదనంతరం ఆయన ఆస్తి లైబ్రరీకీ, ఊళ్లో దేవాలయానికీ మరికొన్ని ధర్మకార్యాలకూ రాసేశారు. ఆయన పోయిన తరువాత లైబ్రరీ బిల్డింగు కూలిపోతోందని ఆ బిల్డింగు పడగొట్టి ఇది కట్టించాం. కొంత సొమ్ము ఫిక్సెడ్ డిపాజిట్‌లో వేసి దానిమీద వచ్చే వడ్డీతో ఒక లైబ్రేరియన్‌ని ఏర్పాటుచేశారు. రెండేళ్లక్రితం వరకూ ఒక లైబ్రేరియన్ వుండేవారు. అతని తరువాత మరెవరూ ముందుకు రాకపోవడంతో భుజంగరావు తన మనిషిని పెట్టి దాన్ని పేకాట క్లబ్బుగా మార్చేశాడు"

ఉలిక్కిపడ్డాను. ఒక పవిత్రమైన ఆలయాన్ని పేకాట క్లబ్బుగా మార్చడమా? బహుశా దాన్ని సహించలేకే దాసుగారు దానికి తాళం పెట్టి కూర్చున్నారన్నమాట. దానికి ఎటువంటి రంగులు పూశాడు




భుజంగరావు.

★ ★ ★

భుజంగరావుగారికి హఠాత్తుగా గ్రంథాలయ శతవార్షికోత్సవాలపై ఆసక్తి కలిగినట్లుంది. ఒకరోజు కాలేజీకి కబురు చేశారు లైబ్రరీ విషయంలో మాట్లాడే పని వుంది ఒకసారి ఇంటికి వచ్చి వెళ్ళమని. సరే, తప్పేదేముంది? కాలేజీ నుండి తిన్నగా వారి ఇంటికే వెళ్లాను.

"నిన్న బలరామయ్యగారిని హైదరాబాదులో కలుసుకున్నానయ్యా! ఇంతవరకూ తేదీ నిర్ణయించలేదటగా! అదేం పనయ్యా! పెద్దల్ని పిలిచేటప్పుడు అంత నిర్లక్ష్యంగా వుంటే ఎలా? ఏదో సర్దిచెప్పాననుకో. అవునూ! శత జయంతి ఉత్సవాలు రిపబ్లిక్ డే రోజున ఏర్పాటుచేస్తే ఎలా వుంటుంది? బలరామయ్యగారు కూడా ఆ రోజున ఖాళీగానే వున్నానని చెప్పారు. మనదేశంలో జాతీయోద్యమమూ, గ్రంథాలయోద్యమమూ ఒకదానితో ఒకటి అల్లుకుపోయి వున్నాయి. ఆ రోజునే కార్యక్రమం ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఆ రోజు ఉదయం కాలేజీలో పతాకావిష్కరణ, సాయంత్రం గ్రంథాలయం శతజయంతి ఉత్సవం పబ్లిక్ మీటింగు. ఎలా వుంటుంది?" భుజంగరావుగారి ఆలోచన చాలా బాగుంది. అంత పెద్దవారిని తీసుకువస్తున్నప్పుడు ఒకటికి రెండు మీటింగులు ఏర్పాటు చేయడం మంచిదే.

"సరే, రేపు నేను ప్రిన్సిపాల్ గారితో మాట్లాడుతానులే. ఉదయం కాలేజీలో పతాకావిష్కరణ, మధ్యాహ్నం లంచ్ మా ఇంట్లో, సాయంత్రం లైబ్రరీ వద్ద బహిరంగ సభ" ప్రోగ్రాం ఫైనలైజ్ చేశారు భుజంగరావుగారు.

అయితే ఈ విషయం ఆయన దాసుగారితో మాట్లాడి వుంటే ఎంత బాగుండేది.

అయితే సంగతి తెలుసుకున్న దాసుగారు మాత్రం చాలా సంతోషించారు. "భుజంగరావు ఇచ్చిన సలహా చాలా బాగుంది. కార్యక్రమం జరగడం ప్రధానం కానీ, ఎవరు ఏర్పాటు చేశారు అనేది ప్రధానం కాదు. అతను చెప్పినట్లే ఏర్పాటుచేద్దాం"



**జ**నవరి ఇరవై అయిదో తారీఖు సాయంత్రం బలరామయ్యగారిని తీసుకుని రావడానికి భుజంగరావుగారి కారులో కాకినాడ వెళ్లాం నేనూ, మా విద్యార్థి భరత్. కాకినాడ చేరేసరికి చీకటిపడింది. ముందుగా బలరామయ్యగారికి కనిపించి తెల్లవారుఝామున మళ్లీ వస్తామని చెప్పడానికి సర్పవరంలోని వారి నివాసానికి వెళ్లాం.

మమ్మల్ని సాదరంగా ఆహ్వానిస్తున్న ఆ ఎనభై అయిదేళ్ళ వృద్ధమూర్తిని చూస్తూనే రెండు చేతులూ జోడించి నమస్కరించాను.

"భుజంగరావు ఫోను చేసి చెప్పాడయ్యా మీరు బయలుదేరారని. ప్రయాణం సుఖంగా జరిగిందా? కృష్ణమోహనదాసు ఎలా వున్నాడు" అంటూ కుశలప్రశ్నలు వేశారు.

"ఉదయం అయిదు గంటలకు వస్తాం

మిమ్మల్ని తీసుకుని వెళ్ళడానికి" అని సెలవు తీసుకుంటున్న మమ్మల్ని "ఊళ్లో మీ బంధువులెవరైనా వున్నారా?" అని అడిగారు.

"ఏదైనా హోటలులో రూము తీసుకుని...!" నా మాటను మధ్యలోనే ఆపేశారు. "మా ఇల్లు హోటలంత సౌకర్యంగా వుండదనుకో, అయినా ఎందుకయ్యా అనవసరపు ఖర్చు. ఏదైనా సంస్థ తరపున వచ్చినప్పుడు ఆ సంస్థకు వీలైనంత ఖర్చు తగ్గించాలి. శుభ్రంగా హాలులో రెండు మడత మంచాలు వేయిస్తాను. హాయిగా పడుకోండి. తెల్లవారుఝామున నాలుగు గంటలకు మీకు మేలుకొలుపులు పాడతాను. అయిదు గంటలకు కాఫీ తాగి బయలుదేరుదాం" అంటూ మా సమాధానం కోసం నిరీక్షించకుండా "అమ్మాయ్! వనజా!" అని పిలిచారు. లోపల నుంచి ఏభై సంవత్సరాల నడివయసు స్త్రీ బయటకు వచ్చారు.

"పిల్లలు వచ్చారు. భోజనం పెట్టగలవా? వండాలా?"

"గోపాల్ ఇంకా ఇంటికి రాలేదు"

"శుభం. ఉన్నదేదో ముగ్గురికీ సర్దేసెయ్" ఆకలి లేదన్నా ఊరుకోలేదు. బలరామయ్యగారు పక్కన కూర్చుని కబుర్లు చెబుతుండగా, ఆవిడ వడ్డిస్తుండగా భోజనాలు చేశాం.

"ఏమిటో? బొత్తిగా ఒక్క కూరతో భోజనం పెడుతున్నాం" నొచ్చుకున్నారు ఆవిడ.

"ఇప్పటివాళ్ళు తిండికి ఎందుకింత ప్రాధాన్యతనిస్తారో నాకు అర్థంకాదు" బలరామయ్యగారి మాటలకు చిన్నబుచ్చుకుని లోపలకు నడిచారు ఆమె.

భోజనాలు అయిన తరువాత బలరామయ్యగారి మాటలతో సమయమే తెలియలేదు. వారి మాటలలో ఎన్నెన్ని విషయాలు దొర్లిపోయాయని?

★ ★ ★

"ముందుగా కృష్ణమోహనదాసు ఇంటికి వెడదాం" కారు ఊళ్లోకి ప్రవేసిస్తుండగా అన్నారు బలరామయ్యగారు.

"అయ్యగారు మిమ్మల్ని వారి ఇంటికే తీసుకుని రమ్మన్నారండి. బయలుదేరే ముందు కూడా మరీ మరీ చెప్పారండి" వెనక్కి తిరిగి మరీ అన్నాడు డ్రైవర్.

"మీ అయ్యగారు మరీ బిజీ మనిషి. ఆయన్ని ఇబ్బందిపెట్టడం ఎందుకు కానీ కృష్ణమోహనదాసు ఇంటికి పోనియ్. మీ అయ్యగారికి నేను చెబుతానులే" స్థిరంగా అన్నారు బలరామయ్యగారు.

"కృష్ణమోహనదాసు పినతండ్రీ, నేనూ చాలా సన్నిహిత మిత్రులం. జాతీయోద్యమ కాలంలో మేమిద్దరం ఒకే కారాగారంలో వున్నాం. ఇక వారి పెదతండ్రిగారు గ్రంథాలయోద్యమంలో మాకు నాయకులు. ఆయన నాయకత్వంలో ఉభయగోదావరి జిల్లాలలో ఎన్నో గ్రంథాలయాలను స్థాపించాం. కందుకూరివారి ప్రభావంతో ఆ ఉద్యమానికంటే ముందుగానే ఈ గ్రంథాలయం ప్రారంభించబడింది. అప్పుడు కృష్ణమోహన్ చాలా చిన్నవాడు. మా వెనకాల తిరుగుతూ వుండేవాడు" పాత జ్ఞాపకాలను మాతో పంచుకుంటూ వుండగానే కారు దాసుగారి ఇంటిముందు ఆగింది.

కారు ఆగిన శబ్దానికి బయటకు వచ్చిన దాసుగారు గేటుదగ్గర కారు దిగుతున్న బలరామయ్యగారిని చూడగానే సంభ్రమాశ్చర్యాలతో హడావుడిగా ఎదురు వచ్చారు.

మధ్యదారిలోనే ఇద్దరూ కలుసుకున్నారు.

"బాబుగారూ!" రెండు చేతులూ జోడించిన దాసుగారి కళ్లల్లో సన్నని నీటి తెర.

"కృష్ణా!" దాసుగారి రెండు చేతులనూ పట్టుకుని దగ్గరకు తీసుకున్నారు బలరామయ్యగారు. వారి అపురూపమైన కలయికను భగ్నం చేయడం ఇష్టంలేక నిశ్శబ్దంగా వెనక్కి తప్పుకున్నాం నేనూ, భరత్.




కారు మమ్మల్ని గేటువద్దనే దింపి వెళ్ళిపోయింది. నేను ప్రిన్సిపాల్‌గారి వద్దకు వెళ్లాను.

నేను ప్రిన్సిపాల్‌గారితో కలసి తిరిగి వచ్చేసరికి అప్పటికే అక్కడకు వచ్చి వున్న భుజంగరావుగారు నన్ను చూస్తూనే మండి పడ్డారు. కొంచెం శాంతించిన తరువాత బల రామయ్యగారితో నిష్ఠూరంగా అన్నారు.

"ఈ తరం కుర్రాళ్లకి ఏ పనీ సవ్యంగా చేయడం చేతకాదు. అన్నింటికీ ముందు నేనున్నానంటారు. ఏదో పొడిచేస్తామంటారు. కనీసం చెప్పిన పని చెప్పినట్టు చేయడం కూడా చేతకాదు. మిమ్మల్ని డైరెక్టుగా మనింటికే తీసుకుని రమ్మని చెబితే ఇక్కడకు తీసుకుని వచ్చి దింపాడు"

"అబ్బాయిని ఏమీ అనకయ్యా! అతను చెప్పాడు కానీ, కృష్ణమోహన్‌ని చూద్దామని నేనే పట్టుబట్టి ఇక్కడకు వచ్చాను"

భుజంగరావుగారి మొహం నల్లబడింది.

"మీరక్కడ వుండడానికి అన్ని ఏర్పాట్లూ చేశాను. రండి వెడదాం మీకోసం అక్కడ ఏసీ రూము రెడీ చేసి వుంచాను" చెబుతున్న భుజంగరావుగారిని చూసి మెల్లిగా నవ్వారు బలరామయ్యగారు.

"ఎక్కడ వున్నాం, ఏం తిన్నాం అన్నవి ప్రధాన సమస్యలు కావయ్యా! ముందు అసలు కార్యక్రమం చూడండి. టైమవుతోంది. ముందు కాలేజీకి వెడదాం పదండి" చేతి వాచీ చూసుకుంటూ ముందుకు దారి తీసిన బలరామయ్యగారిని అనుసరించాం అందరమూ.

★ ★ ★

'నవభారత నిర్మాణంలో మృతినొందిన వీరులారా!

మీ త్యాగం మాకిచ్చిన ఈ పతాక నీడ నిలచి

మీ యెడదల పుష్పించిన కలలన్నీ మోసులెత్తి

పుష్పించగ శపథమిదే చేస్తున్నాం'

(పులపుల శివయ్య)

పతాకవందనం తరువాత రెపరెపలాడుతున్న త్రివర్ణ పతాకాన్ని తదేకంగా చూస్తూ, పులుపుల శివయ్యగారి పద్యంతో ప్రారంభమైన వారి ఉపన్యాసం వింటుంటే నిజంగా ఒళ్లు గగుర్పొడిచింది. జాతీయోద్యమ కాలం కళ్లకు కట్టినట్లు అయింది. కాలేజీ నుంచి తిన్నగా భుజంగరావుగారి ఇంటికి వెళ్ళాం. ఆ ఇంటికి విందుకు వెళ్లే అవకాశం మాలాంటి సామాన్యులకు ఎక్కడిది? ఒక్క ప్రిన్సిపాల్ గారికి తప్ప మా కాలేజీ స్టాఫ్‌కి ఎవరికీ ఆహ్వానాలు రాలేదు.

"ఏడీ! ఆ అబ్బాయి సాగర్ ఎక్కడ?" కారు ఎక్కుతూ అడిగారు బలరామయ్యగారు. వెనకాలే వుండి పోయిన నేను ముందుకు రాక తప్పలేదు.

"అదేమిటోయ్! 'పదండి ముందుకు, పదండి త్రోసుకు, పదండి పోదాం పైపైకి' అంటూ నీ తోటి వాళ్లను ముందుకు తీసుకుపోయే ప్రయత్నం చేయాలి కానీ, ఇలా వెనకనే వుండిపోతే ఎలా? వెనకబడితే వెనకేనోయ్! అన్న మాట వినలేదూ! రా! రా! కారెక్కు"

బలరామయ్యగారి సాన్నిహిత్యం లభిస్తుందన్న ప్రలోభంతో పిలువని పేరంటానికి తయారయ్యాను.

విందుకి కోనసీమలోని ఎమ్మెల్యేలూ, ఎంపీలు, మాజీలతోసహా ఇతర రాజకీయ నాయకులూ వచ్చారు. మంది ఎక్కువైతే మజ్జిగ పల్చనౌతుందన్న సామెతగా నలుగురికి పదిమంది చేరినచోట ఉపయోగకరమైన డిస్కషన్స్‌కి బదులు కాలక్షేపం కబుర్లు పెరుగుతాయి.

భోజనాలు అయిన తరువాత బలరామయ్యగారు విశ్రాంతి తీసుకోవడానికి ఏసీ రూము చూపించారు.

"జీవిత చరమ దశలో ఈ శరీరానికి ఏసీ అలవాటుచేయడం ఎందుకయ్యా! నువ్వు విశ్రాంతి తీసుకో. మేము వెడతాం.





సాయంత్రం మళ్ళీ మీటింగు వుంది కదా!"

బలరామయ్యగారి మాటలకు భుజంగరావు గారి మొహం నల్లబడింది.

దాసుగారి ఇంటికి చేరుకున్నాం.

★ ★ ★

"ఏమిటి కృష్ణా! ఈమధ్య ఏ కార్యక్రమంలోనూ నువ్వు పాలు పంచుకున్నట్టు కనిపించడంలేదు. ఇల్లు వదలి బయటకు రావడం పూర్తిగా మానేశావా ఏమిటి? " మాటల మధ్య అడిగారు బలరామయ్యగారు. బహుశా, దాసుగారు కాలేజీకి కానీ, భుజంగరావుగారి ఇంటికి కానీ రాకపోవడం గమనించి వుండాలి.

"ఇక ఈ వయసులో నేను చేయగలిగింది ఏముంది బాబుగారూ!" నిస్పృహగా అన్నారు దాసుగారు.

కొత్త పంటకి 'అంతరించిపోతున్న పాత పంట ఎరువు కావాలి. అది వ్యవసాయ ధర్మం. కొత్తతరానికి పాతతరం ఆలంబన కావాలి. ఇది సమాజ ధర్మం'. ఈ మన ధర్మాన్ని మనం విస్మరించ కూడదు కృష్ణా! నిజానికి మనం ఈనాటి రాజకీయ వాతావరణంలో ఇమడలేం. అలాగని మన బాధ్యతను మనం మరచిపోతామా? శారీరకంగా మనం ఈనాడు సమాజానికి ఏమీ చేయలేకపోవచ్చు కానీ, చేసే ఉత్సహం వున్న యువతరాన్ని గైడ్ చేయవలసిన బాధ్యత మనకు లేదా? "

"నా కొడుకునే నేను సరిగా గైడ్ చేయలేకపోయాను. సమాజానికి కానీ దేశానికి కానీ పనికి వచ్చే విధంగా తీర్చిదిద్దలేకపోయాను. ఇక మిగిలిన వారికి చెప్పే అర్హత నాకెక్కడిది బాబుగారూ!"

కృష్ణమోహనదాసుగారు కొడుకు ప్రసక్తి వచ్చిన ప్రతిసారీ అదేవిధంగా మాట్లాడడం చాలాసార్లు గమనించాను. ఆయనకి ఒక్కగానొక్క కొడుకు సుభాష్‌చంద్రబోస్. మెడిసిన్ చదువుతానంటే, తన ఊరివారికి వైద్య సదుపాయం లభిస్తుందని డొనేషన్ కట్టి మెడికల్ కాలేజీలో చేర్పించారు. చదువు అయిన తరువాత తన క్లాస్‌మేట్ సరళను పెళ్ళి చేసుకుంటానంటే తన ఊరికి లేడీ డాక్టరు కూడా వస్తుందని ఆనందంగా అంగీకరించారు. కానీ పైపై ఆడంబారాలకే ప్రాధాన్యతనిచ్చే ఆ దంపతులు అవకాశం రాగానే అమెరికాకు ఎగిరిపోయారు. నెలకొకసారి ఫోనులో పలకరించడం, ఏ నాలుగైదేళ్లకో ఒకసారి వచ్చి నాలుగు రోజులుండి వెళ్లడంతో తన బాధ్యతను తీర్చుకుంటున్నాడు.

బలరామయ్యగారి దృష్టి నా మీద పడింది. "కృష్ణ మీ గురించి చెప్పాడు. ఈ రోజున ప్రభుత్వాలూ, రాజకీయ పార్టీలూ యువతరానికి ఏమీ చేయలేకపోతున్నాయి. ఇక వ్యక్తులు పూనుకుని చేయడం తప్ప వేరే దారిలేదు. యువతరం భవిష్యత్తు మీలాంటి టీచర్ల చేతుల్లోనే వుంది మాస్టారూ! పాఠాలతోపాటు నైతిక విలువల గురించి కూడా ఈ తరానికి నేర్పవలసిన అవసరం ఎంతైనా వుంది. ఈ తరం యువకులలో ప్రబలుతున్న అశాంతికి ముఖ్యకారణం వారు ఇతరుల గురించి ఆలోచించకపోవడమే. ఈ సమాజానికి మన అవసరం వుందని గ్రహించ గలిగిననాడు ఇతరులకు సహాయపడడంలోని ఆనందాన్ని వారు అనుభవించ గలిగిననాడు చాలా సమస్యలు పరిష్కారమౌతాయి. నిజానికి నిప్పుల్లో దూకమన్నా దూకే సాహసం యువకులకే వుంటుంది. వాళ్ళ ఎమోషన్స్‌ని ఛానలైజ్ చేయగలగాలి"

"మీలాంటి పెద్దలు ఏదైనా సలహా ఇస్తే ఆచరించడానికి నేను ఎప్పుడూ సిద్ధమే బాబుగారూ! ఏం చేయాలో తోచక సతమతమౌతున్నాను. ఏం చేయమంటారో చెప్పండి"

"ఏముందీ! ఉత్సాహవంతులైన పది మంది కుర్రాళ్లను కూడగట్టుకుని, 'యువ రక్షా సమితి' అని ఒక సంస్థను ప్రారంభించి

సోషల్ సర్వీస్ యాక్టివిటీస్ ప్రారంభించండి"

'యువరక్షా సమితి'! ఎంత చక్కని ఆలోచన? ఎంతసేపూ కాలేజీ పరిధిలోనే ఆలోచించాను కానీ ఇలా చేయవచ్చునని నాకెందుకు తోచలేదు? అలా తెలిసి వుంటే వారి ప్రత్యేకత ఏముంటుంది? ఇలాంటి పెద్దల గైడెన్స్‌లో మనం ఎంతైనా చేయగలం. ఈ అవకాశాన్ని వదులుకోకూడదు.

"అయితే, యువరక్షా సమితిని మీ చేతులతోనే ప్రారంభించండి. మీకు ఎప్పుడు వీలవుతుందో చెబుతే అప్పుడే ప్రారంభోత్సవానికి ఏర్పాటు చేస్తాం"

"ఎందుకయ్యా! ప్రారంభోత్సవాలూ, ఆర్భాటాలు? అనవసరమైన కాలయాపన? అంతగా కాదంటే మన కృష్ణమోహన్‌తో ప్రారంభించండి"

"కుర్రాళ్లు మంచి పని చేస్తానంటే నేను కాదంటానా బాబుగారూ! కానీ, ఈ పని మీ చేతులమీదుగా ప్రారంభమైతే మాకు సంతోషం" దాసుగారి మాటలకు ఒక్క క్షణం ఆలోచనలో పడ్డారు.

"అయితే ఈ రోజు మీటింగు అయిన వెంటనే ప్రారంభిద్దాం" బలరామయ్యగారి మాటలు పూర్తికాకుండానే ఆత్రుతగా అన్నాను. "అయితే వెంటనే బ్యానర్ రాయిస్తాను"

"మనకు కావలసింది బ్యానర్లూ, అట్టహాసాలూ కాదయ్యా! స్వచ్ఛందంగా పని చేయగలిగిన కుర్రాళ్లు కావాలి. ముందు వాళ్లను చూడు" బలరామయ్యగారి మాటలు పూర్తి కాకుండానే లేచాను.

భరత్‌నీ, వాసునీ కలుసుకుని యువరక్షా సమితి ఆలోచన చెప్పి వీలైనంత మంది కుర్రాళ్ళని కాలేజీ విద్యార్థులైనా కాకపోయినా ఫరవాలేదు, ఆసక్తివున్న వారినందరినీ ఒక గంటలో దాసుగారి ఇంటికి తీసుకుని రమ్మని చెప్పి ప్రిన్సిపాల్‌గారికీ, మిగిలిన లెక్చరర్స్‌కీ చెప్పాలని బయలుదేరాను. ఊరి పెద్దలకు మీటింగు జరిగేముందే ఎనౌన్స్ చేస్తే సరిపోతుందనుకున్నాను.

"సరి! ఇదొక కొత్త పిచ్చి పట్టుకుందన్న మాట" కొంత మంది లెక్చరర్లు మొహం మీదే నవ్వారు.

"ఎన్నెస్సెస్ కార్యక్రమాలు మీకు అప్పజెప్పలేదనే ఉక్రోషంతో పోటీగా పెడుతున్నారన్న మాట. చూద్దాం ఎంత సంఘసేవ చేస్తారో? " వెటకారంగా అన్నాడు ఎన్నెస్సెస్ రామారావు.

భుజంగరావుగారికి కూడా చెప్పాలని వెళ్లాను కానీ వారు నిద్రపోతున్నారని చెప్పడంతో రంజనికి విషయం చెప్పి ఇల్లు చేరే సరికి మండువా అంతా కుర్రాళ్లతో కిక్కిరిసి పోయి వుంది.

"రావయ్యా, సాగర్! రా! నీ కోసమే ఎదురు చూస్తున్నాం" సాదరంగా ఆహ్వానించిన బలరామయ్యగారు నవ్వుతూ అన్నారు. "నీ శిష్యులు చాలా గొప్పవాళ్ళయ్యా! అర్జంటుగా ఇప్పుడే ఏదో ఒకటి చేసి తీరాలంటున్నారు. ఏం చేయాలో చెప్పండంటున్నారు" అంటూ తమ చిన్ననాటి అనుభవాలనూ, సమాజం పట్ల యువతరానికి గల బాధ్యతల గురించి చెబుతూ వుంటే చెవులు రిక్కించుకుని విన్నారు పిల్లలు.

"ఇప్పుడిక ఇంటికి వెళ్ళి సరిగ్గా అయిదు గంటలు అయ్యేసరికి లైబ్రరీ దగ్గరకు రండి" బలరామయ్యగారి మాటలు పూర్తికాకుండానే అందరికీ లోపల నుండి టిఫిన్స్, షర్బత్‌లూ వచ్చాయి. అవి తీసుకున్న తరువాత పిల్లలను తీసుకుని లైబ్రరీ దగ్గరకు నడిచాను అక్కడి ఏర్పాట్లు చూడడానికి.

★ ★ ★

సరిగ్గా అయిదు గంటలు కావడానికి అయిదు నిముషాలు వుందనగా వచ్చారు బలరామయ్యగారూ, దాసుగారూ. ఊరి పెద్దలు ఒకరొకరుగా వస్తున్నారు. భుజంగరావుగారికోసం మనిషిని పంపించాను.

"ఏ సంస్థకైనా పంక్చుయాలిటీ ప్రాణం.





మీటింగు ప్రారంభించండి మాస్టారూ!" బల రామయ్యగారి మాటలకు నిస్సహాయంగా దాసుగారివైపు చూశాను. భుజంగరావుగారు రాకుండా మీటింగు ప్రారంభమైతే ఆయన అహం ఎంత దెబ్బ తింటుందో నాకు తెలి యంది కాదు.

"వీధి అరుగువైపుకి వున్న గదిని యువ రక్షా సమితికి కేటాయిద్దాం" అంటూ లేచారు దాసుగారు.

"మాస్టారూ!" చెమటలు కారుతుండగా పరిగెత్తుకు వచ్చాడు గోపాల్. వస్తూనే చేతిలోని పాకెట్ విప్పి సిల్కు తెరను బైటకు తీశాడు.

'యువరక్షా సమితి' ఎర్రటి సిల్కు తెర మీద పసుపురంగు సిల్కు బట్టతో కుట్టిన అక్షరాలు మెరుస్తున్నాయి. ఒక అర మీటరు సైను కొని అక్షరాలు పెయింట్ చేయించుకుని రమ్మని పంపిస్తే, సిల్కు క్లాత్ కొని టైలరుతో దగ్గర వుండి కుట్టించు కుని వచ్చాడన్నమాట.

బానర్‌ని గది గుమ్మానికి తగిలించి పూల దండలు కట్టారు.

"ఏమిటి, మాస్టారూ! ఏమిటింకా ఆలస్యం" అంటూ లోపలనుండి వచ్చారు బలరామ య్యగారు. ఇక ప్రారంభించకపోతే ఆయనే వేదికమీదకు వెళ్ళి కూర్చునేటట్లు వున్నారు. ఏం చేయాలా అనుకుంటూ వుండగానే భుజంగరావుగారు రావడంతో అమ్మయ్య అనుకున్నాను.

భుజంగరావుగారి దృష్టివస్తూనే ఆ బ్యానర్‌మీద పడింది.

"అసలే కుర్రాళ్ళకి చదువు సంధ్యలు లేవు. ఇక ఇలాంటివి కూడా ప్రారంభిస్తే, ఇక అచ్చోసిన ఆంబోతుల్లా ఊరిమీద పడతారు" భుజంగరావుగారు చిరచిరలాడుతుంటే బల రామయ్యగారు మందలించారు.

"వారానికొక్క రోజు పని చేసినంత మాత్రాన చదువు సంధ్యలకు ఆటంకం కల గదు భుజంగరావ్! తన గురించే తప్ప, తన వారి గురించి ఆలోచించడం మరచిపో తున్న ఈ తరానికి ఇటువంటి యాక్టివిటీస్ చాలా ముఖ్యమయ్యా. ఏదో కుర్రాడు. కష్ట పడే శక్తి వుంది. సాగర్‌ని నిరుత్సాహ పర చకయ్యా! అతనికి నువ్వూ, కృష్ణమోహన్ సహకరిస్తే మరింత ఉత్సాహంగా ముందుకు దూసుకుపోగలడు. ఈ రోజుల్లో ఈ మాత్రం ఇతరుల గురించి ఆలోచించ గల యువకులు ఎంత మంది వుంటారం టావ్?" బలరామయ్యగారి మాటలకు భుజంగరావుగారి మొహం మాడిపోయింది. అయినా మరుక్షణమే సర్దుకుని పెదాలకు చిరునవ్వును అతికించుకున్నారు. ఎంతైనా రాజకీయ నాయకుడు కదా!

★ ★ ★

కృష్ణమోహనదాసుగారి అధ్యక్షతన బహి రంగసభ జరిగింది. బలరామయ్యగారు కృష్ణమోహనదాసుగారి కుటుంబంతో తనకు గల అనుబంధాన్ని తెలియజేసి, ఆ తరు వాత గ్రంధాలయ ఉద్యమం గురించి సంగ్ర హంగా తెలియజేశారు. రెండు గంటల పాటు ప్రవాహంలా సాగిన ఉపన్యాసాన్ని చెవులు రిక్కించుకుని విన్నారు ఆహూతు లైన పెద్దలంతా.

1933లో ఒక్క తాలూకాలో 80 గ్రామా లలో గ్రంధాలయాలను సందర్శించి లేనిచోట ప్రారంభించి ఉన్నవాటిని పరిపుష్టి చేసి చందాలు వసూలుచేసి అనేక గ్రామా లలో గ్రంధాలయాలను స్థాపించారట. బల రామయ్యగారి ఉపన్యాసం వింటూవుంటే గ్రంధాలయ పితామహుడు అయ్యంకి వెంక టరమణయ్యగారు ఈ యాత్రల గురించి తమ వ్యాసంలో వివరించిన విషయం గుర్తుకు వచ్చింది.

యాత్రలో పాల్గొనేవారంతా ఆరు జట్లుగా ఏర్పడేవారట.

1. పురోగాములు, 2. భజన, 3. ప్రదర్శ నము, 4. గ్రామఫోను, 5. ఉపన్యాసము, 6. మాజిక్ లాంతరు.



పురోగాములు ముందురోజునే బయలు దేరి గ్రంథాలయమువారు అచ్చువేసిన యాత్ర గురించిన పోస్టర్లను ఊరంతా అంటించేవారట. గ్రామ పెద్దలతోనూ, గ్రంథాలయంపట్ల ఆసక్తిగలవారితోనూ మాట్లాడి మరునాడు వచ్చే యాత్రికులకు స్వాగతం చెప్పడానికి తగిన ఏర్పాట్లను చేసే వారట. మరునాడు యాత్రికులు ఊళ్లోకి అడుగుపెట్టగానే భజన జట్టువారు భజన చేస్తూ ఊరంతా తిరిగి గ్రామంలోని వారి నందరినీ సభకు ఆహ్వానించేవారట.

తరువాత ప్రదర్శన జట్టువారు వారి సామగ్రినంతా బహిరంగసభ జరిగే చోటుకి సమీపంలో గోడలమీద ప్రదర్శన ఏర్పాటు చేసేవారట. ఈలోగా గ్రామఫోను జట్టు వారు ప్రదర్శన స్థలములో గ్రామఫోను రికార్డులు వేసేవారట.

ఈలోగా ప్రదర్శన జట్టువారి వెనుక ఊరి వారంతా చేరి సభాస్థలికి వచ్చేసరికి ఉపన్యాసకుల జట్టువారు వివిధ విషయాలపై ఉపన్యాసాలు ఇచ్చేవారట. సభ అయిపోయిన తరువాత మాజిక్ లాంతరు ప్రదర్శన ప్రారంభించేవారట. బొమ్మల సహాయంతో ఆరోగ్యము సహకారము, గ్రంథాలయ ప్రచారము, గురించి ప్రదర్శన ఏర్పాటు చేసేవారట.

తరువాత గ్రామంలో వున్న గ్రంథాలయాలను సందర్శించి అవసరమైనచోట్ల అటకల మీదనుండి పుస్తకాలను దింపించి బూజు దులిపించి పుస్తకాల పట్టికలను తయారు చేసి తిరిగి ఆ గ్రంథాలయం ప్రారంభించి మరీ వెళ్లేవారట.

అయితే అన్ని ఊళ్లల్లోనూ అంత తేలికగా పనులు అయ్యేవా? కాకినాడ నుంచి వచ్చేటప్పుడు కారులో బలరామయ్యగారు చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది.

ఒకసారి ఒక ఊరికి వెళ్లారట. ఆ ఊరి వారు గ్రంథాలయోద్యమానికి పూర్తిగా వ్యతిరేకులట. ఎన్ని విధాల నచ్చజెప్పినా మా ఊరికి గ్రంథాలయం అవసరంలేదు. అది పెడితే మా కుర్రాళ్లు పని పాటలు మానేసి పుస్తకాలు ముందు వేసుకుని కూర్చుంటారు. ఇక వ్యవసాయం పనులు ఏమౌతాయని భీష్మించుకుని కూర్చున్నారట. వీళ్ళేమో ఏమైనా ఆ ఊళ్లో గ్రంథాలయాన్ని ప్రారంభించాలని ఊరి పెద్ద ఇంటి అరుగు మీద కూర్చున్నారట. ఆయన వచ్చి భోజనాలకు లేవమనడం, వీరు ముందు గ్రంథాలయాన్ని ప్రారంభించి కానీ భోజనాలు చేయమని చెప్పడం. వీరు చేయకుండా ఇంటి యజమాని భోజనం చేయడు. ఆ ప్రహసనం కొన్ని గంటలు సాగిన తరువాత ఊరివారు దిగి వచ్చి గ్రంథాలయాన్ని పెట్టడానికి అంగీకరించారట.

ఉదయం కాలేజీలో ఉపన్యాసం. మధ్యాహ్నం దాసుగారి ఇంటిలోనూ ఉపన్యాసం లాంటిదే. ఇప్పుడిక ఇది మహోపన్యాసమే. అయితే ఎక్కడా ఏ విషయమూ చర్విత చర్వణం కాలేదు. ఈ వయసులో ఎక్కడనుంచి వచ్చింది ఈయనకీ శక్తి? మౌనంగా మనసులోనే ఆ మహనీయుడికి నమస్కరించాను.

మీటింగు తరువాత యువరక్షా సమితి ప్రారంభోత్సవం వుంటుందని ఎనౌన్స్ చేశారు.

సభ పూర్తి కాగానే పెద్దలంతా వెళ్లిపోగా స్టూడెంట్సూ, కొంతమంది యువకులూ మాత్రం వుండిపోయారు యువరక్షా సమితి ప్రారంభోత్సవానికి.

సిసింద్రీ కొబ్బరి బొండంలో స్ట్రా వేసి బలరామయ్యగారికి అందించాడు.

"చాలా థాంక్సయ్యా! ఏం చదువుతున్నావ్?" బలరామయ్యగారి ప్రశ్నకు సమాధానంగా సిసింద్రీ కథను చెప్పారు దాసుగారు.

సంభ్రమంగా సిసింద్రీ మొహంలోకి చూస్తూ ఆదరంగా అతని భుజం నిమిరారు. "నువ్వు చాలా అదృష్టవంతుడ





వయ్యా. కృష్ణమోహన్ దాసు అండలో చాలా పైకి వస్తావు"

సిసింద్రీ మోహం సంతోషంతో వెలిగిపోయింది.

బలరామయ్యగారు రిబ్బన్ కత్తిరించి లాంఛనంగా యువరక్షా సమితిని ప్రారంభించారు.

యువరక్షా సమితికి కావలసిన ఆర్థిక సహాయం తాను చేస్తానని ప్రకటించారు దాసుగారు.

లైబ్రరీ వ్యవహారాలు చూసుకోవడానికి స్వచ్ఛందంగా ముందుకు వచ్చారు హరినారాయణగారు.

మురళి ఒక నోటుబుక్కు తీసుకుని యువరక్షా సమితిలో చేరే సభ్యుల పేర్లు రాసుకోవడం ప్రారంభించాడు.

ప్రతి ఆదివారం మధ్యాహ్నం మూడు గంటలకు సభ్యులందరూ సమావేశం కావాలన్న నిర్ణయంతో ఆ సమావేశం ముగిసింది. భుజంగరావుగారు ఎప్పుడో వెళ్ళిపోయినట్లున్నారు.

ఏం కార్యక్రమం చేపట్టాలో చెప్పమని బలరామయ్యగారిని పట్టుకున్నారు పిల్లలు.

"ఏ గ్రామమైనా ఆదర్శగ్రామం కావాలంటే ఆ గ్రామానికి ప్రధానంగా నాలుగు ఆలయాలు వుండాలి. అవి దేవాలయం, విద్యాలయం, వైద్యాలయం, గ్రంథాలయం. వీటిల్లో ఏ ఒక్క ఆలయమూ లేని మారుమూల కుగ్రామాల్లో సహితం మనకొక బోర్డు కనిపిస్తోంది. అది ప్రభుత్వ సారాయి దుకాణం. తినడానికి తిండిలేని మన దేశం వీధుల్లో సారా ప్రవహిస్తోంది. ఎన్నో కుటుంబాలు ఆ వ్యసనానికి బలి అయిపోతున్నాయి. ముందుగా సారా వ్యతిరేకోద్యమం ప్రారంభించండి"

బలరామయ్యగారి మాటలకు కొంత మంది కుర్రాళ్ల మొహాలు మాడిపోయాయి. అపరాధభావంతో తలలు వంచుకున్నారు. ఆ మాత్రం స్పందన వుంటే చాలు. వారిని మార్చడం పెద్ద కష్టంకాదు.

అక్కడితో సమావేశాన్ని ముగించి ఇళ్లకు బయలుదేరాం.

మీటింగు అయిన తరువాత బలరామయ్యగారిని కాకినాడలో దింపి రావాలని భుజంగరావుగారు ముందుగానే చెప్పారు. కారు కోసం ఎదురుచూస్తూ వుండగానే కాలం కదిలిపోతోంది. ప్రయాణం కోసం ఎదురుచూస్తున్న బలరామయ్యగారిలో అసహనం పెరుగుతోంది.

"సాగర్! ఒకసారి భుజంగరావుకి ఫోను చేసి బలరామయ్యగారు ప్రయాణానికి సిద్ధంగా వున్నారని చెప్పు" దాసుగారి మాటలతో లోపలకు వెళ్ళాను. ఫోను చేస్తే రంజని తల్లిగారు అనుకుంటాను మాట్లాడారు. భుజంగరావుగారి కోసం అడిగితే, అర్జంటుగా ఫోను వస్తే, హైదరాబాదు వెళ్ళారని ఆమెవద్ద నుండి జవాబు.

తెల్లబోయాను. ఎంత అర్జంటు పని అయితే మాత్రం మాట మాత్రం చెప్పకుండా వెళ్ళిపోవడమా? ఇక చేసేది లేక బలరామయ్యగారు ప్రయాణానికి సిద్ధంగా వున్నారనీ, ఒక్కసారి కారు పంపితే వారిని దింపి వస్తాననీ చెప్పాను.

"లేదు బాబూ! మామగారు ఏదో అర్జంటు పని అని కారులోనే హైదరాబాదు వెళ్ళిపోయారు. తిరిగి ఎప్పుడు వచ్చేదీ చెప్పలేమన్నారు"

నాకు ఒక్క క్షణం అయోమయంగా అనిపించింది. ఎంత అర్జంటు అయితే మాత్రం, కనీసం మాట మాత్రం చెప్పకుండా వెళ్ళిపోవడమేమిటి? పోనీ వెళ్లేటప్పుడే మమ్మల్ని కూడా ఎక్కించుకుని రావులపాలెంలో ఏదైనా టాక్సీ చూసి మమ్మల్ని పంపించవచ్చు. లేదా ముందుగానే అక్కడనుంచి టాక్సీని పురమాయించవచ్చు. అదీ కాదయ్యా ఇలా వెళ్ళవలసి వచ్చిందని మాట మాత్రం తెలియజేస్తే, ఆ టాక్సీ ఏర్పాటేదో దాసుగారే చేసేవారు. ఛ! ఏం

మనిషి?

"ఏమిటయ్యా సాగర్! భుజంగరావు ఫోనులోనే రాజకీయ పురాణం వల్లెవేస్తు న్నాడా? " బయటనుంచి విసుగ్గా వినిపి స్తోంది బలరామయ్యగారి మాట.

బయటకు వచ్చి నా మొహంలోకి విసుగ్గా చూశారా ఇద్దరూ.

"ఏమిటి సాగర్! ఎందుకలా వున్నావు? ఏమైంది? " ఆత్రుతగా అడుగుతున్న దాసు గారికి విషయం చెప్పాను. బలరామయ్య గారి అసహనమంతా ఏమైపోయిందో? గట్టిగా నవ్వారు. "సో దటీజ్ భుజంగరావ్' అంటూ.

దాసుగారికి కారు లేదు. ఎప్పుడైనా అవ సరమైతే, పక్క ఊరి టాక్సీకి ముందుగానే కబురుచేసేవారు.

"ఏం చేస్తాం? ఇప్పుడిక నన్ను వదిలిం చుకునే మార్గమేదో ఆలోచించు. లేకపోతే మీ ట్రాక్టరులో రావులపాలెం వరకూ పంపి స్తావా? అక్కడ నుంచి ఏదైనా టాక్సీ మాట్లాడుకుని వెళ్ళిపోతాం"

"ప్లీజ్ బాబుగారూ! మమ్మల్ని ఇంకా సిగ్గుపడేటట్లు చేయకండి. మనిషిని పంపి టాక్సీ తెప్పిస్తాను. కానీ ఆలస్యమవుతుం దేమో? "

బలరామయ్యగారు ఒక్కక్షణం ఆలోచన లోపడ్డారు. "ఎందుకయ్యా నన్ను వదిలించు కోవడానికి అంత కంగారు పడతావు? ఇంత రాత్రి పూట మనిషిని పంపించడం, అర్థరాత్రి దాటాకా ప్రయాణం చేయడం, ఎందుకు వచ్చిన యిబ్బంది కానీ, రేపు మాత్రం వీలైనంత తొందరగా టాక్సీ తెప్పించు. మీ భుజంగరావు పుణ్యమా అని మీ ఇంట్లో ఈ రాత్రికి విశ్రాంతి తీసుకుం టాను" బలరామయ్యగారి మాటలు దాసు గారికి సంతోషాన్నే కలిగించాయి.

"అయితే, నేను ఫస్టు బస్సుకే రావుల పాలెం వెళ్లి టాక్సీ తీసుకువస్తానండి"





ఆత్రంగా అన్నాడు సిసింద్రీ.

"ఇంతకూ నీ పేరేమిటయ్యా? " ఆద రంగా అడుగుతున్న బలరామయ్యగారిని చూసి బుర్ర గోక్కున్నాడు.

"నాకు వేరే పేరేమీ లేదండి. అందరూ సిసింద్రీ అని పిలుస్తారు. స్కూల్లో కూడా ఆ పేరే చెప్పేసరికి మాస్టారు ఆ పేరే రాసే శారండి"

"జ్ఞానార్జన కోసం తపించేవాడవు, నీకీ పేరేమిటయ్యా? రేపు నువ్వే కలెక్టరువో, పోలీసు ఆఫీసరువో అయితే, నీ పేరు చూసి నీ క్రింది ఉద్యోగస్థులు నవ్వుకోరూ? ఈరో జునుంచీ నీ పేరు జ్ఞానేశ్వర్ తెలుసా!"

సిసింద్రీ చటుక్కున లేచి బలరామయ్య గారి పాదాలు అందుకుని కళ్లకు అద్దుకు న్నాడు.

"నీకు ఉజ్వలమైన భవిష్యత్తు వుంటుం దయ్యా!" ఆశీర్వదిస్తున్నట్లే అన్నారు బలరా మయ్యగారు.

మొత్తంమీద భుజంగరావుగారి పుణ్యమా అని బలరామయ్యగారు ఆ రాత్రికి అక్కడ వుండక తప్పలేదు.

మరునాడు చీకటితోనే సిసింద్రీ తీసుకువ చ్చిన టాక్సీలో బలరామయ్యగారిని దింపి రావడానికి బయలుదేరాం నేనూ, సిసింద్రీ.

"ఇప్పటికైనా ఒక కారు కొనవయ్యా కాలంతోపాటు మనమూ మారాలి" టాక్సీ ఎక్కుతూ దాసుగారికి సలహా ఇచ్చారు బల రామయ్యగారు.

"తప్పకుండా బాబుగారు!" వాగ్దానం చేస్తు న్నట్టే అన్నారు దాసుగారు.

★ ★ ★

యువరక్షాసమితి చాలా యాక్టివ్‌గా పని చేస్తోంది. ప్రతీ ఆదివారం మూడు గంట లకు సమావేశమవుతున్నాం. ముందుగా ఒక గంటసేపు దేశనాయకుల జీవిత చరి త్రలు చదివి వినిపించడం, ఒకరు చదు వుతూ వుంటే, మిగిలినవారు వినడం, మధ్య మధ్య దాసుగారు తమ అనుభవాలను జోడించి వ్యాఖ్యానిస్తుంటే, సభ్యులకు రాను

రాను ఉత్సాహం పెరుగుతోంది. మధ్యలో ఏమైనా సందేహాలు వస్తే దాసుగారు వివరిస్తూ వుండేవారు. అందుకోసం లైబ్రరీకి ఒక మైక్ సెట్ ప్రెజెంట్ చేశారు హరినారాయణగారు. హరినారాయణగారికీ దాసుగారికీ అభిప్రాయాలు బాగా కలిశాయి. వారి సూచనలతో కార్యక్రమాలను నిర్వహించడం చాలా తేలికగా వుంది.

పుస్తక పఠనం అయిన తరువాత నాలుగు గంటలనుంచి ఏడు గంటలవరకూ సేవా కార్యక్రమాలు జరుగుతాయి.

నెలలో మొదటి ఆదివారం పక్కఊరు నుంచి ప్రైవేట్ డాక్టరుగారు వస్తారు. ఆయన చేత ఉచిత వైద్యశిబిరం. బీదలకు మందుల పంపిణీ. డాక్టరుగారు వారి మెడికల్ శాంపుల్స్ తీసుకువస్తే అవసరమైన ఇతర మందులు దాసుగారు తెప్పిస్తారు.

రెండవ ఆదివారం పశువుల డాక్టరుగారు వస్తారు. పశువులవైద్య శిబిరం.

మూడవ ఆదివారం శాస్త్రీయ విజ్ఞానాన్ని అందించే ఫిల్ము షో, ప్రదర్శనలు. ఆ కార్యక్రమానికి ఊరివారినందరినీ ఆహ్వానిస్తాం.

నాల్గవ ఆదివారం సభ్యులు జట్లు జట్లుగా విడిపోయి ఊళ్లో ప్రతి ఇంటికీ వెళ్ళి ఆరోగ్యసూత్రాలను, కుటుంబ నియంత్రణ అవసరాన్ని గురించి తెలియజేయడం.

దానితో ఉత్సాహం వచ్చిన మరికొంత మంది యువకులు వయోజన విద్యాకేంద్రాన్ని నడుపుతామని ముందుకు వచ్చారు. అలాగే పనిపాటలు చేసుకుంటూ వున్న వారు ఈ వయసులోనైనా తమకు నాలుగు అక్షరమ్ముక్కలు నేర్పమని అడిగారు. నిజానికి యువరక్షాసమితికిది నైతిక విజయం.

దానితో ప్రతిరోజూ రాత్రి ఎనిమిది గంటలనుండి తొమ్మిదిన్నర వరకూ లైబ్రరీలోనే వయోజనులకు విద్యాదానం.

దాసుగారి సలహాతో యువరక్షాసమితికి సంబంధం లేకుండా వయోజన విద్యాకేంద్రాన్ని ఏర్పాటుచేసుకున్నాం.

ఊళ్లో వ్యవసాయ కుటుంబాలలోని వారు చాలామంది గ్రాడ్యుయేట్లే. ఉద్యోగాలు అవసరంలేక కొంత, తీరా ఉద్యోగాలకు వెడితే ఇక్కడ వ్యవసాయం దెబ్బ తింటుందనే ఆలోచన కొంత వుండడంతో చాలా మంది యువకులు వ్యవసాయంలోనే స్థిరపడిపోయారు. అలాంటి వారిలో ఉత్సాహం వున్న వారిని పదిమందిని కూడదీసి వారిలో ఒకరిని అధ్యక్షునిగా, మరి ఒకరిని కార్యదర్శిగా ఎన్నుకుని కార్యక్రమాలను ప్రారంభించాం. వారు కార్యక్రమాన్ని ప్రారంభించడమే కాకుండా మూల ధనాన్ని కూడా ఏర్పాటు చేసుకున్నారు.

ఇంటి దగ్గర సిసింద్రీ చదువు చాలా చురుగ్గా సాగుతోంది. వేసవి సెలవులు ఇచ్చే సమయానికి ఫోర్త్‌ఫారం పుస్తకాలు తెప్పించుకున్నాడు. ఒక వైపు సిసింద్రీ చదువూ, మరోవైపు యువరక్షా సమితి కార్యక్రమాలు. ఈ స్థితిలో హైదరాబాదు వెళ్లడమా? అని ఆలోచనలో పడ్డాను. కానీ, నా ఆలోచనను దాసుగారు తీవ్రంగా వ్యతిరేకించారు.

ఏ ఒక్క అసోసియేషనూ మన మీదే ఆధారపడి వుందనుకోవడం పొరపాటు సాగర్! ఇప్పుడు ఊళ్లో వారందరికీ ఉత్సాహంగానే వుంది. నాలుగు రోజులు మనం లేకపోయినా ఏ పనీ ఆగదు. పైగా పొరుగూరిలో వున్న కొడుకు సెలవులకు కూడా ఇంటికి రాకపోతే కన్నవారికి ఎంత కడుపుకోతో ఈ వయసులో నీకు అర్థంకాదు. నాకు అనుభవమే. మరో ఆలోచన లేకుండా ఇంటికి వెళ్లు. తిరిగి వచ్చేటప్పుడు మన వయోజన విద్యాకేంద్రానికీ, శాస్త్రీయవిజ్ఞానానికీ సంబంధించిన ఫిల్ముల్ని, స్లైడ్సుని తీసుకునిరా. అదీ ఒకవిధంగా అవసరమే. ఇకపోతే సిసింద్రీని మళ్ళీ మార్చి నాటికి మెట్రిక్ పరీక్షకు పంపిద్దాం. వాటి వివరాలు తెలుసుకునిరా!"

దాసుగారి మాటలతో మరో ఆలోచన



లేకుండా హైదరాబాదు బయలుదేరాను.



"మాస్టారూ!

నేను ఎన్ని ఉత్తరాలు రాసినా సమాధానం రాయరు ఎందుకని? 'వనిత తనంతతాను వలచివస్తే' మీకు కూడా చులకనేనా మాస్టారూ!

మాస్టారూ! అసలు విషయానికి వస్తాను. మీరీ ఊరు వచ్చిన ఈ నాలుగేళ్ల నుంచీ నా కలల రాకుమారుడు మీరే. నా ప్రేమను ఉత్తరాల ద్వారా తెలియజేస్తున్నాను. కానీ, మీరు మా తాతయ్యకు భయపడి సమాధానాలు ఇవ్వడం లేదు కదూ!

అవును, మీ మనసు నాకు తెలియదూ? మీకు నాపై గల ప్రేమను నా మనసు గ్రహించగలదు మాస్టారూ! మీరు ఏదో ఒక పని కల్పించుకుని మా యింటికి రావడం, వచ్చిన దగ్గర నుంచి నేనెప్పుడు కనిపిస్తానా అని ఆత్రుతగా లోపలి గదుల్లోకి చూడడం, నేను కనిపించిన వెంటనే మీ కళ్లల్లో కనిపించే ఆ మెరుపులు; అమ్మ దొంగా మీరు పైకి చెప్పనంతమాత్రాన, మీ మనసు నేను తెలుసుకోలేననుకున్నారా? ఇద్దరం ఒకరినొకరు కావాలనుకున్నప్పుడు ఇంకా ఎందుకు మాస్టారూ ఈ అనవసరమైన కాలయాపన?

ఒకవైపు ఎలాగైనా ఈ సంవత్సరం నా పెళ్ళి చేసేయాలని తాతయ్య సీరియస్‌గా సంబంధాల వేటలో పడ్డారు. ఎన్ని సంబంధాలను నచ్చలేదని చెప్పి తప్పించుకోగలను?

మాస్టారూ! మీరు ఎటూ ధైర్యం చేయలేరు కాబట్టి, సాహసించి నేనే ఒక నిర్ణయానికి వచ్చాను.

మీకు ఈ ఉత్తరం అందే సమయానికి నేను రాజమండ్రిలో వుంటాను. మా స్నేహితురాలి పెళ్ళికని వంకపెట్టి రాజమండ్రి బయలుదేరుతున్నాను. రాత్రి పదకొండు గంటలకు కోణార్క్ వచ్చే సమయానికి మీరు రైల్వేస్టేషన్లో వుండాలి. కోణార్క్ ఎక్కి తెల్లవారే సమయానికి ఈ ఆంధ్రదేశానికీ, ఈ ఊరికీ, మా తాతయ్యకీ దూరంగా వెళ్ళిపోదాం. ముందు మన పెళ్ళి అయిపోతే వీళ్లిక మనల్ని ఏమీ చేయలేరు. మా తాతయ్యకి నేను ఒక్కతినే వారసురాలిని, ఈ వేళ కాకపోతే రేపైనా వీళ్లు మనల్ని ఆదరించకపోరు. అంతవరకూ నాతోపాటు లక్షల విలువైన నా నగల్ని తీసుకువస్తున్నాను.

పిచ్చి అమ్మ! స్నేహితురాలి పెళ్ళిలో నా నగలన్నీ వేసుకుని ఆ పెళ్ళి మండపంలో తిరిగితే మన స్టేటస్ వారికి తెలుస్తుందంటే, నమ్మి నా నగలన్నీ సూటుకేసులో సర్ది ఇచ్చింది. ముందు ఈ ఆంధ్రదేశానికి దూరంగా వెళ్ళిపోతే, అక్కడనుంచి ఎలాగైనా కలకత్తా నగరం చేరుకుంటే, ఆ మహానగరంలో మనం బతకలేకపోము.

మాస్టారూ! నా పట్టుదల మీకు తెలుసు. మీరు సమయానికి రాజమండ్రి స్టేషనుకి రాకపోయినా, ఈ విషయాన్ని ఎవరికైనా తెలియజేసినా, నా శవాన్నే చూస్తారు మీరు.

అందుకని వేరే ఆలోచన ఏమీ పెట్టుకో




కుండా ప్రయాణానికి సిద్ధంకండి.

రాజమండ్రి స్టేషన్‌లో మీ కోసం ఎదురు చూస్తూ వుంటాను. ఏదో రకంగా దూరంగా వెళ్ళిపోతే అక్కడ నుంచి కలకత్తా చేరడం పెద్ద కష్టంకాదు. అర్ధరాత్రి ప్రయాణం కోసమే కోణార్క్‌ని ఎన్నుకున్నాను.

మీ

రంజని

రంజని ఉత్తరం చదివి నిర్ఘాంతపోయాను. గత నాలుగైదు నెలలుగా అప్పుడప్పుడు ఆమె దగ్గరనుంచి ఇలాంటి జాబులు వస్తున్నా, సమాధానం ఇవ్వకపోతే తనే గ్రహించుకుని మనసు మార్చుకుంటుందని అనుకున్నానే కాని, ఇంతగా తెగించగలదని అనుకోలేదు.

ఇప్పుడేం చెయ్యాలి? ఇదివరకులా నాకేమీ పట్టనట్లుగా ఎలా వుండగలను? ఇల్లు వదిలిన ఆడపిల్ల వెనక్కి తిరిగి రావడానికి అహం దెబ్బతిని ఏ అఘాయిత్యం చేస్తుందో? 'సమయానికి రాజమండ్రి రాకపోయినా, ఈ విషయాన్ని ఎవరికైనా తెలియజేసినా నా శవాన్నే చూస్తారు మీరు?' ఉత్తరంలో వాక్యాలు కళ్లముందు మెదిలాయి.

అసలు నేనెప్పుడూ రంజనితో అతిగా ప్రవర్తించలేదే? అసలు యువరక్షాసమితిలో ఆడపిల్లల్ని కూడా చేర్చుకొమ్మని రంజని ఎంత గొడవ చేసినా, ఈ పల్లెటూరిలో ఆడపిల్లల్ని ఇలాంటి యాక్టివిటీస్‌లోకి తీసుకురావద్దని దాసుగారు ఇచ్చిన సలహాను అనుసరించి యువరక్షా సమితిని యువకులకే పరిమితం చేశాం.

"సాగర్ ఏమిటిది? ఎటూ కాని వేళ ఈ నిద్రేమిటి? ఆరోగ్యం సరిగా లేదా?" గుమ్మం దగ్గర నిలబడిన దాసుగారిని చూస్తూనే అపరాధిలా తలవంచుకున్నాను.

"అన్నట్టు ఇందాకా నీకేదో ఉత్తరం వచ్చిందని చెప్పాడు సిసింద్రీ. నీ అనారోగ్యానికి అదే కారణమా?" దాసుగారి గొంతు తీక్షణంగా మారడం తెలుస్తూనేవుంది.

"విషయాన్ని దాచి మరిన్ని సమస్యలను కొని తెచ్చుకోకు సాగర్!" హెచ్చరిస్తున్న దాసుగారిచేతికి రంజని లేఖను అందించాను. తలుపులు చేరవేసి ఉత్తరం చదవడం ప్రారంభించిన దాసుగారు ఆ ఉత్తరాన్ని పూర్తిచేసి నిర్ఘాంతపోయారు.

"ఎప్పటినుంచి వస్తున్నాయి ఈ ఉత్తరాలు?"

"దాదాపు నాలుగైదు నెలలనుంచి" బిక్కుబిక్కుమంటూ చెప్పాను. "కానీ, నేనింతవరకూ దేనికీ సమాధానాలు రాయలేదు. జవాబు ఇవ్వకపోతే తనే రాయడం మానేస్తుందని అనుకున్నాను. కానీ..."

"ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నావా? పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం వుందా?" నిశితంగా చూస్తూ అడుగుతున్నారు దాసుగారు.

"లేదు లేదు" గాభరాగా అన్నాను. "నేనా అమ్మాయిని ఎప్పుడూ అటువంటి దృష్టితో చూడలేదు"

"చాలా పొరపాటు చేశావు సాగర్! నీకా ఉద్దేశ్యం లేనప్పుడు ఆ విషయాన్ని మొట్టమొదటి ఉత్తరం వచ్చినప్పుడే ఆ అమ్మాయికి స్పష్టంచేసి ఉండవలసింది. అప్పటికీ ఆ అమ్మాయి వినిపించుకోకపోతే, అప్పుడు ఈ విషయాన్ని భుజంగరావు దృష్టికి తీసుకురావలసింది" అంటూనే చేతినున్న వాచీ చూసుకుని ఉలిక్కిపడ్డారు.

"మైగాడ్! మరో రెండు గంటల్లో కోణార్క్ రాజమండ్రి స్టేషనుకి వస్తుంది. ఈలోగా మనం అక్కడికి వెళ్ళి ఆ అమ్మాయిని ఎలాగైనా వెనక్కి తీసుకురావాలి. లేకపోతే ఆ పిల్ల ఏం అఘాయిత్యం చేస్తుందో? పద, ఏంచెయ్యాలో కారులో ఆలోచించుకోవచ్చు" అంటూనే డ్రైవరుని పిలిచి కారు సిద్ధంచెయ్యమన్నారు. భోజనం టైములో ఎక్కడికి ప్రయాణమని అడుగుతున్న సావిత్రమ్మగారికి సమాధానమైనా చెప్పకుండా కారు ఎక్కి కూర్చున్నారు.

దారిపొడవునా రంజనితో ఎలా మాట్లా డాలో, ఏంచెయ్యాలో చెబుతూనే వున్నారు దాసుగారు.

★ ★ ★

"అమ్మయ్య! నా జాబు సమయానికే అందిందన్న మాట" రైల్వే ప్లాటుఫారంమీద తచ్చాడుతున్న నేను, హఠాత్తుగా వినిపించిన మాటలకు ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాను.

కళ్లకు గాగుల్స్, కొత్తరకం హెయిర్‌స్టైల్, పమిట చెంగునే మేలి ముసుగుగా వేసుకున్న రంజనిని ఒక్కక్షణం గుర్తుపట్టలేకపోయాను.

"అదేమిటలా కొత్తగా చూస్తున్నారు? కొత్త జీవితంలోకి అడుగుపెడుతున్నాం, మరి మీకంటికి కొత్తగా కనిపించవద్దూ?"

చనువుగా నా చెయ్యి పట్టుకుంది. "ముందు అవతలి ప్లాటుఫారం మీదకు వెడదాం రండి. రైలు వచ్చేసమయమైంది. తరువాత ఎటూ జీవితమంతా ఒకరి కళ్లల్లోకి ఒకరు చూసుకుంటూ జీవితాన్ని నందనవనం చేసుకుందాం"

"చాలా థాంక్స్ రంజనీ! నా మనసుని సరిగ్గా గ్రహించావు" నవ్వుతూ అన్నాను. "ఇంతకూ ఎక్కడిదాకా ప్రయాణం?"

"ముందు ఇక్కడనుంచి దూరంగా కలకత్తా వెళ్ళిపోదాం. మెల్లిగా ఏదో ఒక ఉద్యోగం చూసుకుందాం. ఈలోగా మా తాతయ్య సగౌరవంగా ఇంటికి తీసుకువెడతారు" సగర్వంగా అంది రంజని.

"కలకత్తాలో తెలుగు మాస్టారుకి ఉద్యోగం ఎలా వస్తుంది రంజనీ! అయినా కలకత్తాలో నీకు తెలిసినవారెవరైనా వున్నారా? వెంటనే ఉద్యోగం ఎలా వస్తుంది?" అనునయంగా అడిగాను.

"ఆంధ్రాలో వుంటే మా తాతగారికి తెలిసిపోయే అవకాశం వుంది. అందుకనే కలకత్తా వెడదామంటున్నాను. వెంటనే ఉద్యోగం రాకపోయినా పరవాలేదు. నా నగలు ఉన్నాయిగా రెండేళ్లపాటు ఉద్యోగం లేకపోయినా మనం బతకలేకపోం" నిర్లక్ష్యంగా అంది రంజని.

"అది కాదు రంజనీ! ఒక్క విషయం ఆలోచించు. నేను కష్టపడి డబ్బు సంపాదించి నిన్ను సుఖపెట్టాలి కానీ, నీ నగలు అమ్మి నిన్ను పోషించడం ఏం బాగుంటుంది చెప్పు? కలకత్తాలో కంటే బొంబాయిలో ఉద్యోగావకాశాలు ఎక్కువ. పైగా నా స్నేహితుడు ఒకడు అక్కడ మంచి పొజిషన్లో వున్నాడు. నీ జాబు చదివిన వెంటనే అతనికి ట్రంకాల్ చేసి మన విషయం చెప్పాను. వెంటనే బయలుదేరి బొంబాయి వచ్చెయ్యమన్నాడు. అక్కడ తెలుగు మీడియం స్కూలు ఒకటి వుందట. మనం స్టేషన్లో దిగేసరికి మనకు ఉద్యోగమే కాదు ఉండడానికి ఇల్లు కూడా చూసి వుంచుతానన్నాడు. మనం బొంబాయి వెడితే మంచిది కదూ మరొక్క అయిదారు గంటలు ఓర్పు వహిస్తే బొంబాయి వెళ్లే కోణార్క్ ఎక్కవచ్చు, ఏమంటావ్?"

"చూశారా! ఇన్నాళ్లూ మన్నుతిన్న పాములా ఏమీ పట్టించుకోని మీలో ఎంత మార్పు వచ్చిందో? అందుకే ధైర్యం చేశాను" సగర్వంగా నవ్వింది.

ఈ అయిదారు గంటలూ హోటల్లో విశ్రాంతి తీసుకోవడానికి కూడా అంగీకరించింది. లేకపోతే ఎవరైనా తెలిసినవారు కనిపిస్తారేమోననే భయం వుండనేవుంది. మా మాటలమధ్యనే కోణార్క్ రావడం, వెళ్ళిపోవడం కూడా జరిగింది. ప్లాటుఫారం ఖాళీ అయిన తరువాత నెమ్మదిగా రంజనిని బయటకు తీసుకువచ్చి స్టేషన్ ఎదురుగా వున్న దాసుగారి కారు ఎక్కించాను.

"ఇదేమిటి? హోటల్‌కి రిక్షాలో వెళ్ళవచ్చు కదా టాక్సీ దేనికి?" అంటున్న రంజనిని చూసి మెల్లిగా నవ్వుతూ అన్నాను. "రాకుమారిలా పెరిగిన నిన్ను స్వంత కారు లేకపోయినా కనీసం టాక్సీలో




నైనా తిప్పద్దూ?" అంటూ డ్రైవరుపక్క కూర్చున్నాను.

"ఇంకా ఎవరైనా తెలిసినవారు కనిపిస్తారేమోననే భయంపోలేదా?" అంటూ నవ్వింది రంజని.

డ్రైవరు కారు స్టార్ట్‌చేసే సమయానికి అంతవరకూ ఆ పక్కనే చీకటిలో నిలబడి వున్న దాసుగారు చటుక్కున కారువెనుక డోరు తీసుకుని లోపల కూర్చోవడం, రంజని కెవ్వున కేకవేయడం, కారు స్పీడు అందుకోవడం క్షణాలలో జరిగిపోయింది.

మరుక్షణంలోనే దాసుగారిని గుర్తుపట్టిన రంజనికి జరిగినదేమిటో అర్థమైంది.

"భేష్! చాలా బాగుంది మాస్టారూ! ప్రేమించి తన సర్వస్వాన్నీ అర్పించడానికి సిద్ధపడ్డ ఆడపిల్లను వదిలించుకోవడానికి ఇంత కష్టపడాలా? కనీసం నా మొదటి ఉత్తరానికే మీరు డైరెక్టుగా వచ్చి మీకే ఆసక్తీలేదని చెప్పవచ్చునే? అన్ని ఉత్తరాలు రాసిన దాకా ఆగి ఇప్పుడిలా? మీకు నాతో రావడం యిష్టంలేనప్పుడు అసలు ఇక్కడిదాకా రావడం ఎందుకు? ఓహ్! మీకు ఊరివారంతా మెచ్చి మేకతోలు కప్పాలి కదూ! అందుకే కదూ మీకీ తాపత్రయం? నా మానాన్ని నన్ను వదలండి. మీలాంటి వెన్నెముక లేనివాడికి ప్రేమ సందేశాలు పంపించినందుకే సిగ్గుతో చచ్చిపోతున్నాను. ఇంకా మీచేత రక్షింపబడి మా తాతయ్య ముందు తల వంచుకోలేను. కారు ఆపించండి. దిగి నా దారి నేను చూసుకుంటాను.

"ఏయ్ డ్రైవర్ కారు ఆపు. లేకపోతే డోర్ తెరిచి దూకేస్తా మాస్టారూ! నేను చచ్చి దెయ్యమై మిమ్మల్ని పీక్కుతింటాను. అంతే కానీ, నన్ను కాదన్న మిమ్మల్ని సుఖంగా బతకనిస్తానని మాత్రం అనుకోకండి. నన్ను నమ్మించి మోసంచేసిన మీరు ఇంతకింతా అనుభవించకపోరు" రంజని గొంతు క్రమంగా పెరుగుతోంది. ఇక ఆవేశాన్ని ఆపుకోలేక తిట్లు ప్రారంభించింది. ఒక సభ్యసమాజంలో పెరిగిన ఆడపిల్ల నోటి వెంబడి అలాంటి తిట్లు ఎలా వచ్చాయో? తిట్టితిట్టి అలసిపోయిన తరువాత ఒక్కసారిగా ఏడుపు ప్రారంభించింది.

"అమ్మా రంజనీ!" అంతవరకూ ఎంతో ఓపికగా భరించిన దాసుగారు రంజని తలమీద చెయ్యివేశారు.

దాసుగారి చెయ్యి విసిరి కొట్టింది రంజని.

కారు ముందుకు సాగిపోతూనే వుంది.

★ ★ ★

"డ్రైవర్! కారాపు" ఊళ్లోకి వస్తూనే ముందుగా రంజనిని వాళ్ళ తాతగారికి అప్పగించి వెడదామన్న దాసుగారు భుజంగరావుగారి మేడ కనుచూపుమేరలో కనిపిస్తుండగానే కారు ఆపించారు.

నిజమే భుజంగరావుగారి ఇల్లంతా ఎలక్ట్రిక్ లైట్ల వెలుగులో పట్టపగలుగా వుంది. ఇల్లంతా కోలాహలంగా వుంది. వీధి గుమ్మం దగ్గర కర్రలతో నిలబడి వున్న మనుషులను చూసేసరికి ఏదో ప్రమాదం రాబోతున్నదని తెలుస్తూనే వుంది.

"కారుని మన ఇంటికే పోనీయ్" దాసుగారు అంటూ వుండగానే రంజని కారు డోరు తెరిచింది.

"ఏమీ అక్కరలేదు. నేను దిగి నడిచి వెళ్లగలను. మీ పేర్లు ఎవరికీ చెప్పనులెండి. అనవసరంగా హడిలి చావకండి" వ్యంగ్యంగా అంది.

"ఛ! నోర్మూయ్" విసురుగా కారు డోరు వేసేశారు. "నీ పుణ్యమా అని ప్రశాంతంగా వున్న ఊళ్లో కొట్లాటలు జరగబోతున్నాయి"

ఇల్లు చేరుతూనే రంజనిని సావిత్రమ్మగారికి అప్పగించి సీతను కూడా సాయంగా అక్కడే వుండమన్నారు. తరువాత హాల్లోకి వచ్చి ఫోను అందుకున్నారు.

"హలో! ఆనందరావుగారా? క్షమించాలి,

అర్ధరాత్రి ఇబ్బంది పెడుతున్నాను. మీరు ఒక్కసారి మా ఇంటికి రాగలరా? ప్రమాద మేమీ లేదనుకోండి. అయినా మీ అవసరం వస్తుందేమోనని సందేహం. వద్దు. ఈ విషయం మన మధ్యనే వుండిపోవాలి"

వింటున్న నేను కొయ్యబొమ్మలా నిలబడి పోయాను. ఆనందరావు సర్కిల్ ఇనస్పె క్టర్. దాసుగారికి సన్నిహితుడు.

ఏం జరుగుతోంది? ఏమిటిదంతా? రంజని ఏదో వ్యామోహంలో పడింది. నా తెలివి తక్కువతనం వల్ల ఇల్లు విడిచే వరకూ వచ్చింది. సరే ఆమెగారికేదో బుద్ధి చెప్పి వెనక్కి తీసుకు రావాలంటే దాసుగా రితో బయలుదేరాను. కానీ చివరికిదేమిటి?

నా ఆలోచనల్లో నేను ఉండగానే సి.ఐ గారి జీపు ఇంటి ముందు ఆగింది.

"ఏమిటి మాస్టారూ! దాసుగారు రమ్మని ఫోను చేశారు. ఏం జరిగింది?" అంటూ లోపలకు వచ్చాడు ఆనందరావు.

"ఆయాం సారీ! మిమ్మల్ని ఇబ్బంది పెడు తున్నాను. భుజంగరావు ఇంటి ముందు వ్యవహారం నాకేదో అనుమానంగా వుంది" అంటూ జరిగిన కథ అంతా చెప్పుకుని వచ్చారు దాసుగారు.

"అంటే వీరిద్దరి పెళ్లికీ భుజంగరావు గారి వైపు నుంచి ఎటువంటి ఆటంకమూ ఎదు రవకుండా చూడాలంటారు. అంతేనా?" అతి తేలికగా అన్నాడు ఆనందరావు.

"పెళ్లి ప్రసక్తే లేదు ఇనస్పెక్టరు గారూ ఆ అమ్మాయేదో అమాయకత్వంతో ఇల్లు విడి చింది. ఇది వన్ సైడెడ్ లవ్. మాకు కావ లసింది ఆ అమ్మాయిని జాగ్రత్తగా వారి ఇంటికి చేర్చడం. ఆ తరువాత ఆ అమ్మాయి ఏ అఘాయిత్యమూ చేయకుండా వాళ్ల వాళ్లు జాగ్రత్తలు తీసుకుంటారు. మధ్యలో వాళ్లు మా మీదకు దండెత్తి రాకుండా చూడాలి"

దాసుగారి మాటలకు ఆలోచనలో పడ్డాడు ఆనందరావు.

"ఒక పని చేయండి. అమ్మాయి ఇక్కడ క్షేమంగా వున్నట్టు భుజంగరావుగారికి ఫోను చేసి చెప్పండి. ఆయన రియాక్షన్ చూసిన తరువాత ఏం చెయ్యాలో నిర్ణ యిద్దాం" అంటూ జీపుని వెనక్కి పంపిం చేశాడు.

"భుజంగరావు! నేను కృష్ణమోహనదాసుని మాట్లాడుతున్నాను" దాసుగారి మాటలు పూర్తి కానేలేదు. అవతల నుంచి భుజంగ రావు గారి మాటలు స్పష్టంగా వినిపిం చాయి పక్కనే కూర్చున్న మాకందరికీ.

"ఏం మేమెలా ఏడుస్తున్నామో తెలుసు కుని సంతోషిద్దామని ఫోను చేశావా? నీ ధైర్యం చూసుకునేగా కూటికి గతిలేని ఆ పంతులుగాడు, నా మోచేతి నీళ్లు తాగి పడి వుండేవాడు నా మనుమరాల్ని లేవదీసుకు పోయాడు. కానీ నేనింతటితో వదిలి పెడ తానని మాత్రం అనుకోకు. మీ అందరి అంతూ చూడకపోతే నా పేరు భుజంగ రావే కాదు. వాళ్లు ఎక్కడున్నా జుట్టు పట్టు కుని ఈడ్చుకుని రమ్మని ఇప్పుడే మను షుల్ని కారు ఇచ్చి పంపించాను. ఊళ్లో మనుషుల్ని మీ జిత్తులమారి వేషాలతో మీ గుప్పెట్లో పెట్టుకున్నామని సంతోష పడుతు న్నారేమో? డబ్బు పారేస్తే పక్క ఊరు నుంచి వస్తారు పచ్చిరక్తం తాగే కసాయి వాళ్లు. పాపం నీ కొడుకు లాంటివాడు కదూ! ఆ పంతులుగాడికి తలకొరివి పెట్ట డానికి రెడీగా వుండు" అంటూనే ఫోను పెట్టేశాడు.

బహుశా రైల్వే ప్లాటుఫారమ్ మీద మా ఇద్దర్నీ ఈ ఊరు వారెవరో చూసి వుంటారు. వెంటనే వచ్చి భుజంగరావుగా రికి ఉప్పు అందించి వుంటారు. వెంటనే కారులో అతని మనుషులు బయలుదేరి వుంటారు. పాపం, ప్రతీ స్టేషనులోనూ ఆ రైల్లో వెతుకుతూ చివరి వరకూ వెళ్లినా ఆచూకీ దొరకక వెర్రిమొహాలు వేసుకుని వెనక్కి వస్తారు.





దాసుగారు ఓపికగా మరోసారి డయల్ చేశారు. ఈసారి ఎవరో ఆడవారు ఎత్తినట్లు న్నారు.

"అమ్మా అనసూయా! నేను దాసుని మాట్లాడుతున్నాను. ఆహా మీ మామగారిని పిలవక్కరలేదు. కనీసం నువ్వైనా నేను చెప్పేది వినిపించుకో. మీ అమ్మాయి మా ఇంట్లో క్షేమంగా వుంది. మరేమీ కంగారు పడకు. భుజంగరావుని వచ్చి మీ అమ్మాయిని తీసుకు వెళ్లమను. లేకపోతే అమ్మాయి ఇక్కడ ఏ అఘాయిత్యమైనా చేస్తే... చూడమ్మా ఏడుస్తూ కూర్చోవడానికిది సమయం కాదు. భుజంగరావుని మాత్రం వెంటనే బయలుదేరి రమ్మని చెప్పు"

ఆనందరావు సలహా ప్రకారం ఇద్దరం వీధి అరుగుమీదకు వచ్చాం.

మరో పది నిముషాలలోపాతిక మంది మనుషులు బాణాకర్రలతో, గొడ్డళ్లతో ఇంటి మీదకు వచ్చి పడ్డారు. అందరికన్నా ముందు వేగంగా అడుగులు వేస్తూ వచ్చిన భుజంగరావు నన్ను చూస్తూనే ఒక్క అంగలో అరుగుమీదకు వచ్చి రెండు చేతులతోనూ నా చొక్కాను పట్టుకున్నారు.

"నా మనుమరాల్ని లేవదీసుకుని పోయి మళ్లీ ఏ ధైర్యంతో ఊళ్లో అడుగు పెట్టావ్? నా పరువుని బజారుకీడ్చిన నిన్నింకా ప్రాణాలతో వుండనిస్తాననే అనుకుంటున్నావా?" వీధి అరుగు మీద వున్న వాడిని విసురుగా మెడపెట్టి గెంటాడు. అంత ఎత్తునుంచి పడ్డానేమో తల దిమ్మెక్కిపోయింది.

"చూస్తారేంరా! ఏ కండకా కండ కోసి కాకులకీ గ్రద్దలకీ వేయండి" భుజంగరావు గారి మాటలు పూర్తి కాకుండానే అతని మనుషులు నన్ను చుట్టుముట్టి, చేతుల్లోని కర్రలు పైకెత్తారు. ఆ క్షణం నాకు ఆఖరి క్షణమే అనిపించింది.

"ఆగండి" మేఘ గర్జనలా వినిపించింది ఆనందరావు మాట. "భుజంగరావు గారూ! ముందు మీ మనుషులను మర్యాదగా వెనక్కు వెళ్లమని చెప్పండి. అతని మీద ఒక్క దెబ్బ పడిందా? మీ అందరినీ జైల్లో తోస్తాను"

"నువ్వెవడివిరా మాకు చెప్పడానికి? అడ్డు వస్తే ముందు నీ బుర్ర రామకీర్తన పాడిస్తాను" భుజంగరావు గొంతు అది.

"భుజంగరావుగారూ! ఆవేశంతో కళ్లకు పొరలు కమ్మడం వల్ల నన్ను గుర్తు పట్టలేకపోతున్నారా? లేక మఫ్టీలో వున్నందువల్ల గుర్తు పట్టలేక పోతున్నారా? నేను సార్" ఆనందరావుని. మీ ఏరియా సర్కిల్ ఇన్స్పెక్టర్ని. మర్యాదగా మీ వాళ్లను వెనక్కి తప్పుకోమని చెప్పకపోతే ఒక్కొక్కళ్లనీ పిట్టను కాల్చినట్టు కాల్చి పారేస్తాను జాగ్రత్త" ఆనందరావు చేతిలోని తుపాకీ గాలిలోకి పేలింది. దానితో అతని మనుషులందరూ వెనక్కి తగ్గారు.

"భుజంగరావ్! మీ అమ్మాయిని క్షేమంగా వెనక్కి తీసుకు వచ్చాం. నీకు అప్పగించడానికే నిన్ను పిలిపించాం. కానీ నువ్వు అనవసరంగా కయ్యానికి కాలు దువ్వుతున్నావు. ముందు నీ ఆవేశాన్ని తగ్గించుకో" దాసుగారి మాటలవి.

"భుజంగరావుగారు! రెండు నిముషాలు టైము ఇస్తున్నాను. మీ వాళ్లంతా ఈ ఆవరణ విడిచి వెళ్లాలి. మీరు లోపలికి రండి మాట్లాడుకుందాం" లోపలికి ఆహ్వానించాడు ఆనందరావు.

"నన్ను ఒక్కణ్ణీ లోపలకు పిలిచి ఏమైనా చేస్తే? అందులోనూ పోలీసుల మద్దతు వున్నవాడు ఏం చేసినా చెల్లుతుంది" కసిగా అన్నారు భుజంగరావుగారు.

"అనవసరమైన మాటలతో కాలక్షేపం చేసి ప్రయోజనం లేదు భుజంగరావ్! ముందు లోపలికి రా! రంజనితో మాట్లాడు"

"ఛ ఛ! ఆ చెడిపోయిన దానితో మాటలేమిటి?"

"చూడు భుజంగరావ్! నీ దయవల్ల

ఇక్కడ ఎవరూ చెడిపోలేదు. రంజని అమా యకత్వంతో ఏదో వ్యామోహంలో పడి ఇల్లు విడిచింది. క్షేమంగా వెనక్కి వచ్చింది. కొంచెం మంచి మాటలతో ఆ పిల్లకు ధైర్యం చెప్పి ఇంటికి తీసుకువెళ్లు. ఇంటి పరువు బజారుకి ఎక్కకుండా చూసుకో"

దాసుగారి మాటలతో కొంత శాంతించి లోపలకు వచ్చారు భుజంగరావుగారు.

రంజని తాతగారి ఎదుటకు రావడానికి ఒక విధంగా ఒప్పుకోలేదు. అందరూ బల వంతం చేసి ధైర్యం చెప్పడంతో బయటకు వచ్చి వెక్కివెక్కి ఏడుస్తూ నిలబడిపో యింది.

రంజనిని తీసుకుని భుజంగరావుగారు బయలుదేరగానే దాసుగారు రంజని తల్లికి ఫోను చేశారు.

"రంజనిని తీసుకుని మీ మామగారు బయలుదేరారు. అనవసరమైన ప్రశ్నలు వేసి ఆ అమ్మాయిని రెచ్చగొట్టకండి. రెండు రోజులు ఆ అమ్మాయిని జాగ్రత్తగా చూసు కోండి. చూడమ్మా, అనసూయా! అయి నింటి ఆడపిల్ల నోటి వెంట రాకూడని



మాటలు మీ అమ్మాయి దగ్గర విన్నాను ఈ రోజు. కన్నతల్లివి. నీ బిడ్డకు కాస్త మంచీ చెడూ చెప్పుకోకపోతే ఎలాగమ్మా? "

★ ★ ★

మరో నాలుగు రోజులు గడిచాయి. జరిగిన కథకి చిలవలూ, పలవలూ వచ్చి చేరాయి. ఊరి వారందరికీ ఇదొక కాలక్షేపంగా పనికి వచ్చింది. చేయని నేరానికి తల వంచుకుని నడిచే నన్ను వెంటాడే చూపులు ఎన్నెన్నో? అంత వరకూ నా పై అంతటి అభిమానం చూపించిన ఆ ఊరి జనం ఒక్కసారిగా నాపై ఇంత విముఖత్వం చూపించడం నాకు చాలా బాధగా వుంది. ఎదుటివారిలో చెడును చూడడంలో మనిషికి అంతటి రాక్షసానందం ఉంటుందేమో?

ఆ రోజు కాలేజీలో అడుగు పెడుతూనే ప్రిన్సిపాలుగారి వద్ద నుండి కబురు వచ్చింది.

"అయాంసారీ సాగర్!" నన్ను చూస్తూనే లేచి నా చేతికి ఒక కవరు ఇచ్చారు.

విప్పి చూసిన నేను నిర్ఘాంతపోయాను. అది నా సస్పెన్షన్ ఆర్డర్.

నా ప్రవర్తన సరిగా లేదనీ, విద్యార్థినుల పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తున్నానని, కాలేజీ స్టాఫ్‌తో దురుసుగా మాట్లాడతాననీ, విద్యార్థులకు చదువు సంధ్యలు సరిగా సాగనీయకుండా సోషల్ సర్వీస్ పేరిట వారిని పక్కదారులు పట్టిస్తున్నాననీ, నా లాంటి వాడు లెక్చరర్‌గా వుండడం విద్యార్థుల భవిష్యత్తుకి ప్రమాదకరమనీ... అవును, రాజు తలచుకుంటే దెబ్బలు కొదవా? సస్పెన్షన్ ఆర్డర్ తీసుకుని కాళ్లీడ్చుకుంటూ ఇంటి మొహం పట్టాను.

"ఏమిటి? మళ్లీ ఏమైంది? " ఆత్రుతగా అడుగుతున్న దాసుగారి చేతిలో కవరు పెట్టి విసురుగా గదిలోకి వెళ్లి మంచం మీద వాలిపోయాను.

ఈ ఊరు వచ్చిన కొత్తలో ఏం ఆశించాను? వెడుతూ ఎంతటి అవమానాన్ని మూటగట్టుకుని పోతున్నాను.

★ ★ ★

ఆ రోజే నా ప్రయాణం. దాసుగారి దగ్గర, సావిత్రమ్మగారి దగ్గరా సెలవు తీసుకున్నాను. సావిత్రమ్మగారు మౌనంగా కళ్లు ఒత్తుకున్నారు. సిసింద్రీ కాలేజీకి వెళ్లినట్లున్నాడు. ఇంట్లో ఎక్కడా కనిపించలేదు.

"వెళ్లిపో సాగర్! అయాం సారీ! నీకు నేనేమీ సహాయం చేయలేకపోతున్నాను. కనీసం ఈ ఊరికి దూరంగా వెడితేనన్నా, నీకు మనశ్శాంతిగా వుంటుందేమో? అక్కడైనా నీకు మంచి భవిష్యత్తు కలగాలని ఆశిస్తున్నాను. బెస్టాఫ్ లక్" దాసుగారు చరచరా లోపలకు నడిచారు.

సామానంతా కారులో సర్దుకున్నాను. ఎక్కి కూర్చునే సమయానికి. కారుకి అడ్డంగా స్టూడెంట్సు.

"మాస్టారూ! మీరు వెళ్లడానికి వీల్లేదు"

"మాస్టారూ! మిమ్మల్ని వెళ్లనివ్వం"

"మాస్టారూ! ఈ అన్యాయాన్ని కొనసాగనివ్వం"

"దిగండి మాస్టారూ! మీరు ఊరు వెళ్లడం లేదు" స్టూడెంట్స్ అందరూ కారుని చుట్టుముట్టారు. కాలేజీ విద్యార్థి నాయకుడు ముందుకు వచ్చాడు.

"మాస్టారూ! మిమ్మల్ని సస్పెండు చేసినందుకు నిరసనగా స్టూడెంట్సు సమ్మె చేస్తున్నారు. కాలేజీ ముందే శిబిరం వేసి నిరాహార దీక్ష చేస్తున్నారు. కొంతమంది ప్రిన్సిపాల్ గారిని ఘెరావ్ చేస్తున్నారు. మరి కొంత మంది భుజంగరావుగారి ఇంటి ముందు ధర్నా చేస్తున్నారు. ఈ పరిస్థితిలో మీరు ఊరు విడిచి వెళ్లడానికి వీల్లేదు మాస్టారూ! కాలేజీ కాలేజీ అంతా మీ వెనుక వుంది. అన్యాయాన్ని ఎదిరించి పోరాడదాం"

అలికిడి వినిపించి బయటకు వచ్చారు దాసుగారు. స్టూడెంట్సు చెప్పినదంతా





విన్నారు.

"ఎందుకయ్యా అతన్ని ఆపుతారు. వెళ్లనివ్వండి. స్టూడెంట్సుకి ఏదో చెయ్యాలని తాపత్రయపడ్డాడు. ఫలితం అవమానించి పంపుతున్నాం. వెళ్లనివ్వండి. అక్కడైనా అతనికి మంచి భవిష్యత్తు వుంటుందేమో? "

"అదేమిటి సార్ మీరు కూడా అలా అంటారు భుజంగరావుగారు..." అతని మాటలు పూర్తి కానేలేదు. నలుగురు విద్యార్థులు పరిగెత్తుకు వచ్చారు.

భుజంగరావు పోలీసులను పిలిపించాడనీ, తన మనుషులను పెట్టి దౌర్జన్యానికి దిగాడనీ కబురు మోసుకు వచ్చారు.

"సాగర్! పద ముందుకాలేజీ దగ్గరకు వెడదాం" దాసుగారు కారు ఎక్కి కూర్చున్నారు. స్టూడెంట్సు కారులోని సామానంతా లోపలకు చేర్చి కారు వెనుక బయలుదేరారు.

నిజంగానే కాలేజీ ముందు వాతావరణం చాలా ఉద్ధృతంగా వుంది. కాలేజీ గేటు ముందే షామియానా వేసి కూర్చున్నారు విద్యార్థులంతా.

ఇంటర్ సెకండియర్ చదువుతున్న సిసింద్రీ మెడలో మాల వేసుకుని ఆమరణ నిరాహార దీక్షలో కూర్చున్నాడు. అతనికి మద్దతుగా మరో నలుగురు విద్యార్థులు రిలే నిరాహార దీక్ష చేస్తున్నారు. శిబిరం చుట్టూ రకరకాల స్లోగన్స్‌తో బానర్స్ తయారుచేసి తగిలించారు. రంజని మీదా, భుజంగరావు గారి మీదా వ్యాఖ్యలు.

"ఏమిటిదంతా? " దాసుగారు శిబిరంలోకి అడుగు పెడుతూనే సీరియస్‌గా అడిగారు.

"మా మాస్టారిని సస్పెండు చేయడం అన్యాయం" విద్యార్థులంతా ముక్త కంఠంతో అరిచారు.

"మీ మాస్టారిని సస్పెండు చేయడం న్యాయమని ఎవరూ అనడంలేదు. కానీ చదువుకుంటున్నారు. ఒక ఆడపిల్ల మీద ఇటువంటి రాతలు రాయడానికి సిగ్గు లేదూ? " తీవ్రంగా అన్నారు.

"అసలీ గొడవకంతటికీ కారణం ఆ మహా తల్లేగా? " వెనుక నుంచి ఎవరో అరిచార్రు.

"షటప్!" ఒక్కసారిగా రెచ్చిపోయారు దాసుగారు. దాసుగారిలో అంతటి ఆవేశం ఏనాడూ చూడని విద్యార్థులందరూ స్థాణువులైపోయారు.

"ఒక అమాయకురాలి మీదనా మీ ప్రతాపం. ముందా రాతలు తగలబెట్టండి. లేకపోతే ఈ సమ్మెలు చేసే హక్కు మీకు నైతికంగా లేదు. ఇంతకాలం మీ మాస్టారు మీకు చెప్పిన నీతిబోధలు ఇవేనా? "

మరుక్షణంలోనే బ్యానర్లన్నీ చింపి పోగులు పెట్టారు. దాసుగారు ఒక అగ్గిపుల్ల గీసి వాటి మీద పడేశారు.

"మీరు ఆవేశపడి పోలీసులను కానీ, భుజంగరావు మనుషులను గాని రెచ్చగొట్టకండి. మీ వెనుక మేమంతా వుంటాం. మీరు దౌర్జన్యానికి దిగితే మాత్రం నేనిక ఈ విషయం కల్పించుకోను" దాసుగారి తీవ్ర స్వరానికి పిల్లలంతా కిక్కురు మనకుండా తలలు వంచుకున్నారు.

ఇంతటి అల్లరికి కారకుణ్ణి అయిన నేను ఏమీ చేయలేని నిస్సహాయతతో ఆ శిబిరం లోనే ఒక మూల కూర్చుండిపోయాను.

ఇంతలో ఊళ్లోంచి పది మంది పెద్దలను వెంటబెట్టుకుని హరినారాయణగారు వచ్చారు.

"హరి నారాయణగారూ! మీరొక పని చేయాలి. భుజంగరావు ఇంటి దగ్గరకు వెళ్లి అక్కడ కుర్రాళ్లు ఏ అఘాయిత్యమూ చేయకుండా చూడండి. నేనొకసారి ప్రిన్సిపాలుగారిని కలుసుకుని వస్తాను" దాసుగారి మాటలు పూర్తి కాకుండానే పోలీసు జీపు వచ్చి ఆగింది. సి.ఐ ఆనందరావు జీపు దిగాడు.

"ఇనస్పెక్టరుగారూ! సమయానికి వచ్చారు. ముందు ప్రిన్సిపాలుగారితో మాట్లాడితే బాగుంటుందనుకుంటున్నాను.



మీరో సహాయం చేయాలి. అనవసరంగా లాఠీఛార్జీ చేసి కుర్రాళ్లని రెచ్చగొట్ట వద్దని మీ వాళ్లకి చెప్పండి. మా వాళ్లకు మేము నచ్చజెప్పుకుంటాం. కుర్రాళ్లు అల్లరి చేయ కుండా చూసుకునే బాధ్యత మాది. సాగర్, పద" అంటూ ముందుకు దారి తీసిన దాసు గారిని అనుసరించాం నేనూ, ఆనందరావూ.

దాసుగారు కనిపించడంతో అంత వరకూ నిస్సహాయంగా తన గదిలో కూర్చుండిపో యిన ప్రిన్సిపాల్ గారికి ప్రాణాలు లేచి వచ్చాయి.

"క్షమించండి సార్! జరిగిన దానిలో నా ప్రమేయం ఏమీ లేదు. పాలకవర్గం నిర్ణ యాన్ని పాటించవలసిన వాడిని మాత్రమే. సాగర్ అంటే నాకూ అభిమానం వుంది. కానీ!"

"ఇది పాలక వర్గ నిర్ణయమా? లేక, పాలక వర్గ 'అధ్యక్షుల వారి స్వంత నిర్ణ యమా?" దాసుగారి మాటలకు సమా ధానం చెప్పలేకపోయారు ప్రిన్సిపాలుగారు.

"మీరు సస్పెన్షన్ ఆర్డర్ను వెనక్కి తీసు కోక తప్పదు మాస్టారూ!" ఆనందరావు కల్పించుకున్నాడు.

"ఇనస్పెక్టరుగారూ! సాగర్ ఈ కాలేజీ వదిలి పెడితే అందరికంటే ఎక్కువ నష్టపో యేది నేను. కానీ, నేను ఒక్కణ్ణే చేయగలి గింది ఏమీ లేదు" నిస్సహాయంగా అన్నారు ప్రిన్సిపాలుగారు.

"పాలకవర్గ సమావేశాన్ని ఏర్పాటు చేయండి మాస్టారూ! నిజంగా సాగర్ వెళ్లి పోవాలనే అందరూ కోరుకుంటే అలాగే పంపించి వేద్దాం. వెళ్లిపోవడంవల్ల సాగర్‌కి వచ్చిన నష్టమేమీ లేదు"

అప్పటికప్పుడు పాలకవర్గ అత్యవసర సమావేశానికి రమ్మని సభ్యులందరికీ నోటీ సులు జారీ చేయడం జరిగింది. ఇంతకూ సమావేశానికి భుజంగరావు రాలేదు. ఉపా ధ్యక్షుల అధ్యక్షతను జరిగిన సమావేశంలో,





దాసుగారూ, ఆనందరావూ కూడా పాల్గొ న్నారు. అసలు ముద్దాయిని నేను కాబట్టి ఆ సమావేశంలో నేను పాల్గొనకూడదని దాసుగారు నిర్ణయించడంతో వారి సూచన మేరకు పక్క గదిలోకి వెళ్లిపోయాను. కానీ వారి మాటలు అక్కడికి స్పష్టంగా వినిపిస్తు న్నాయి.

తీగలాగితే డొంక కదులుతుంది. భుజం గరావుగారు ఎదురుగా లేకపోవడంతో సభ్యులందరూ వారివారి అభిప్రాయాలను స్వేచ్ఛగా వెల్లడించారు. సస్పెన్షన్ గురించి అసలు సమావేశమే జరగలేదనీ, ఆ మాటకు వస్తే అసలు సమావేశాలకు ఎప్పుడూ తమని పిలవలేదనీ, రిజిస్టర్స్ ఇంటికి పంపితే సంతకాలు పెట్టడం మాత్రమే తమ డ్యూటీ అనీ చెప్పారు. భుజంగరావు అభిమానులు ఒకరిద్దరు సర్ది చెప్పాలని ప్రయత్నించినా ప్రయోజనం లేక పోయింది.

భుజంగరావు అంటే పడని ఇద్దరు ముగ్గురు ధైర్యంగా భుజంగరావు అవినీతిని బయట పెట్టారు. కాలేజీ విద్యార్థులు కొంత మంది వద్ద డొనేషన్స్ వసూలు చేస్తున్నా రట. ఆర్థికంగా వెనుకబడిన ఇద్దరు విద్యా ర్థులకి ప్రతి సంవత్సరం స్కాలర్‌షిప్స్ ఇవ్వాలి. కానీ తన వాళ్ల పేరు ప్రతిపా దించి ఆ సొమ్ము తన ఎకౌంటులో వేసు కుంటున్నారట. అదేమని అడిగే ధైర్యం ఆ విద్యార్థులకు గానీ, వారి తల్లిదండ్రులకు గాని లేదు.

వెంటనే కాలేజీ రికార్డు తనిఖీ చేస్తే మరో దారుణమైన విషయం బయట పడింది. విద్యార్థుల నుంచి వసూలు చేస్తున్న ఫీజులు కాలేజీ రికార్డ్స్‌లో ఎంటర వడంలేదు. ఆడిట్ వాళ్లకు సబ్మిట్ చేస్తున్న రికార్డు వేరు, కాలేజీ ఆఫీసులో వున్న రికార్డు వేరు. ఆఫీసు సూపరింటెండెంట్ తోడుదొంగ. కొన్ని లక్షల రూపాయలకు ఎకౌంట్స్‌లేవు.

నిముషాల మీద భుజంగరావు గారిని

పాలకవర్గ అధ్యక్షునిగా తొలగించే తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. నా సస్పెన్షన్ ఆర్డర్ని వెనక్కి తీసుకోవాలని తీర్మానించారు.

ఆఫీసు సూపరింటెండెంటుని సస్పెండ్ చేశారు.

మిస్ అప్రోప్రియేట్ అయిన సొమ్ముకి లెక్కలు చెప్పి తీరాలనీ, లేకపోతే లీగల్ యాక్షన్ తీసుకోవలసి వస్తుందని భుజంగ రావుగారికి నోటీసు పంపడం జరిగింది.

అందరి కోరిక మీదా దాసుగారు పాలక వర్గ అధ్యక్షులుగా పదవీ బాధ్యతను స్వీకరించారు.

నా సస్పెన్షన్ ఆర్డర్ రద్దు కాగానే విద్యార్థులు సమ్మె విరమించారు.

భుజంగరావుగారు కోరలు తీసిన పాములా అయిపోయారు.

తన మీద కోర్టు కేసు పెట్టవద్దనీ, లెక్క తేలని డబ్బుకి తను చెక్కు పంపిస్తున్నాననీ, దాసుగారికి ఉత్తరం రాసిపెట్టి సకుటుంబంగా ఊరు విడిచి వెళ్లిపోయారు భుజంగ రావుగారు.

"కంగ్రాట్స్ మాస్టారూ! మీరు బాధ పడితే పడ్డారు కానీ కాలేజీకి మళ్లీ మంచి రోజులు వచ్చాయి" ఆనందరావు మాటలకు అందరూ సంతోషంగా చప్పట్లు కొట్టారు.

★ ★ ★

దాసుగారు కాలేజీ కమిటీ అధ్యక్షులైన తరువాత కాలేజీలో చాలా మార్పులు తీసుకు వచ్చారు. మొట్టమొదట నేను అనుకున్న పేరెంట్స్ టీచర్స్ గెట్ టుగెదర్ మూడు నెలలకు ఒకసారి ఏర్పాటు చేశారు. ఒక్కొక్క లెక్చరరుకి కొంతమంది విద్యార్థులను కేటాయించి వారి తల్లిదండ్రులతో మీటింగు ఏర్పాటు చేశారు. రెండు నెలలకు ఒకసారి కార్యవర్గ సమావేశమూ, ఏడాదికి రెండుసార్లు స్టాఫ్ మెంబర్లతో గెట్ టుగెదర్.

ఎన్నెస్సెస్ కార్యక్రమాలు రెగ్యులర్గా జరుగుతున్నాయి. చెప్పా పెట్టకుండా దాసుగారు ఎప్పుడు పడితే అప్పుడు కాలేజీని విజిట్ చేయడంతో క్లాసులు ఎగ్గొట్టి లేడీస్ వెయిటింగు రూము చుట్టూ తిరిగే విద్యార్థులకీ, సెలవు పెట్టకుండా కాలేజీకి గైర్హాజరు అయ్యే లెక్చరర్లకీ వారి ఆటలు సాగడం లేదు. జగదీశ్ వుండి వుంటే అతని ఆధ్వర్యంలో మిగిలిన లెక్చరర్లు తిరుగుబాటు చేసేవారేమో కానీ నాలుగు నెలల క్రితమే గవర్నమెంటు ఉద్యోగం రావడంతో రాజీనామా చేసి వెళ్లిపోయాడు. దానితో మిగిలిన వారు దాసుగారి మాటలకు తొందరలోనే సమాధానపడ్డారు.

ఒక ఆరు నెలలు గడిచే సరికి కాలేజీ వ్యవహారాలు ఒక దారిన పడ్డాయి. లెక్చరర్లందరికీ బాధ్యత పెరిగింది. సిన్సియర్గా పని చేయడంలోని ఆనందమూ తెలిసి వచ్చింది. ఒకవైపు యువరక్షా సమితి, మరోవైపు కాలేజీ యాక్టివిటీస్ మొదట్లో ఉక్కిరిబిక్కిరిగా వున్నా త్వరలోనే అందరమూ ఎడ్జస్ట్ అయిపోయాము. ఇప్పుడు ఊరంతా ఒక్క మాట మీద నడుస్తోంది.

ఎప్పటిలాగే సెలవులకు హైదరాబాదు వెళ్లాను.

★ ★ ★

"బాబూ! నా స్నేహితురాలు కొత్తగా హైదరాబాదు వచ్చింది. తన ఎడ్రస్తో జాబు రాసింది. ఈమధ్య చాలా ఇబ్బందుల్లో వున్నారట. విజయవాడలో వ్యాపారం దివాళా తీస్తే, కొడుకుకి ఇక్కడ ఒక ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చూసుకుని ఇక్కడికే వచ్చి చేరారు. ఎటూ విజయవాడ వెళ్లి చూడలేకపోయాను. ఊళ్లోకి వచ్చిన మనిషిని వెళ్లి పలకరించకపోతే ఏం బాగుంటుంది చెప్పు. మీ నాన్నగారికి ఎటూ తీరదు. నేను ఒక్కదాన్నీ ఎడ్రస్ వెతుక్కుంటూ వెళ్లలేను. ఒక్కసారి నువ్వు తీసుకు వెడితే నా స్నేహితురాలిని చూసి వస్తాను" వచ్చిన నాలుగో రోజున అంది అమ్మ.

"నీ స్నేహితురాలి ఇంటికి తీసుకు వెళ్ల మని చెప్పడానికి ఇన్ని కారణాలు వల్లె వేయాలా అమ్మా! రేపు నాన్నగారిని ఆఫీసులో దింపి ఆ స్కూటరు మీద నిన్ను తీసుకు వెడతాను. సరేనా? "

అమ్మ ఇచ్చిన ఎడ్రస్ చేతపట్టుకుని స్కూటరు మీద బయలుదేరాం. ఊరు చివర నాలుగు అంతస్థుల భవనంలో చివరి అంతస్థులో ఒక భాగం.

"దేవేంద్ర భవనంలాంటి ఇంటిలో వుండి చివరికీ అద్దె కొంపలోకి వచ్చారు" మెట్లెక్కుతూ నిట్టూర్చింది అమ్మ.

కాలింగుబెల్లు మోగగానే ఒక ఇరవైయేళ్ల అమ్మాయి వచ్చి తలుపు తీసింది.

అడ్రసు కాగితం చూపగానే "అవును ఈ ఇల్లే. లోపలకు రండి. నాన్నగారు ఊరు వెళ్లారు. అన్నయ్య ఆఫీసుకి వెళ్లాడు. అమ్మను పిలుస్తాను ఉండండి" అంటూ కూర్చోమని డ్రాయింగు రూములో సోఫాలు చూపించి లోపలకు నడిచింది.

హాల్లోకి వచ్చిన ఆమె, అమ్మ ఒకరినొకరు చూడగానే కౌగలించుకున్నారు.

"చూశావా జయా! మా బతుకులెలా అయిపోయాయో? " వెక్కివెక్కి ఏడుస్తున్న ఆమెను కన్నీళ్లతో ఓదార్చింది అమ్మ.

"కనీసం దీనికి పెళ్లి అయిపోయినా మాకింత దిగులు వుండేది కాదు. రెండేళ్ల క్రితం రాజాలాంటి సంబంధం వస్తే చదువుకుంటున్న పిల్ల ముందు డిగ్రీ పూర్తికావాలి, రెండేళ్ల వరకూ పెళ్లి చేయం అని పాపిష్టిదాన్ని పెళ్లికి ఒప్పుకున్నాను కాదు. ఇప్పుడు సంబంధాల కోసం కాళ్లు అరిగేటట్లు తిరుగుతున్నారాయన దీని అదృష్టం ఎలా వుందో? " కళ్లనీళ్లు తుడుచుకుంది ఆమె. తల్లి మాటలకు కూతురి మొహంలో అసహనం కనిపిస్తోంది.

"నువ్వేమీ అనవసరంగా కంగారు పడకు శ్యామూ! మీ అమ్మాయికేం? లక్షణమైన పిల్ల. నువ్వు బెంగపెట్టుకుని అమ్మాయిని మరింత కంగారు పెట్టకు. ఇంతకూ తనకు వయసు ఏమంత మించి పోయిందని? రాజాలాంటి అల్లుడు వస్తాడు"

చిన్నప్పటి స్నేహితులట. పాతికేళ్ల తరువాత కలుసుకున్నారట. ఈ పాతికేళ్ల కబుర్లా అయితేకానీ వాళ్లు ఈ లోకంలోకి వచ్చేటట్టు కనిపించడంలేదు.

"మీకు బోర్ కొడుతున్నట్లుంది. నాన్నగారి రూములో బుక్సు వున్నాయి చూద్దురుగాని రండి" లోపలకు దారి తీసిన ఆమెను అనుసరించాను. అక్కడ బుక్ షెల్ఫ్‌లో రామకృష్ణ మిషన్ వారి పుస్తకాలు, జిడ్డు కృష్ణమూర్తిగారి రచనలు, ఆ పుస్తకాలు చూస్తూ ఎంతసేపు గడిపేశానో?

"వీడితో ఇదే వరుస శ్యామూ! పుస్తకం కనిపిస్తే చాలు ఇక మన లోకంలో వుండడు" వాళ్లిద్దరూ గదిలోకి ఎప్పుడు వచ్చారో నేను గమనించనేలేదు. అమ్మ మాటలతో ఈ లోకంలోకి వచ్చాను.

"మంచి అలవాటేగా జయా! మా అమ్మాయికి క్లాసు పుస్తకాలు చదవడమే గగనం. కనీసం పత్రికలు కూడా చదవదు. ఎంతసేపూ టీవీ, వీసీఆర్ వుంటే చాలు. సినిమాలు చూస్తూ కాలక్షేపం చేస్తుంది"

ఆమె బలవంతంతో వారింటిలోనే భోజనం చేసి ఇల్లు చేరుకున్నాం. వచ్చిన దగ్గర నుండి అమ్మ ఒకటే పాట. ఆ అమ్మాయి సుధ, రూపంలో లక్ష్మీదేవియట. చదువుల సరస్వతి అట. డిగ్రీవున్నా ఈ కాలం పిల్ల కాదట. పెద్దలంటే గౌరవం, అణకువ వున్నాయట. ఒకటేమిటి? ఆ పిల్ల మెట్టిన ఇంట సిరి నాట్యమాడుతుందట.

"మరి ప్రస్తుతం లక్ష్మీదేవి వారి ఇంటి నుంచి ఎందుకు సెలవు పుచ్చుకుంది? " అని అడిగి చివాట్లు తిన్నాను.

నాలుగు రోజుల తరువాత ఆ రోజు రాత్రి మేమంతా భోజనాలు చేస్తుండగా అమ్మ మాటల మధ్య ఆ అమ్మాయి ప్రసక్తి తీసుకుని వచ్చింది. కాసేపు రోజూలాగే ఆ





అమ్మాయి నామస్మరణ అయిన తరువాత ప్రారంభించింది.

"ఏమిటండీ? ఈ సంవత్సరమైనా అబ్బాయి పెళ్లి చేయరా ఏమిటి?" నాన్నగారిని నిలదీసింది అమ్మ.

"ఇదిగో జయా! చల్లకు వచ్చి ముంత దాచినట్లు ఎందుకీ డొంకతిరుగుడు? నువ్వు చెప్పదలచుకున్నదేమిటో స్పష్టంగా చెప్పు" అంటూ నావైపు చూసి "ఏమిటో ఈ ఆడ వాళ్లు ఏ విషయమూ సూటిగా చెప్పరు" అంటూ నాన్న విసుక్కున్నారు.

"ఈ ఇంట్లో నా మాట ఎంత వరకూ సాగుతుందో తెలియజేస్తే అన్ని మాటలూ సూటిగానే వస్తాయి" నిష్ఠూరంగా అంది అమ్మ.

"ఈ ఇంట్లో నీ మాట కాకపోతే నా మాట ఎప్పుడైనా సాగిందా? ఏరా అబ్బాయ్! మీ అమ్మ మాటకు నేను ఎదురు చెప్పడం ఎప్పుడైనా చూశావా నువ్వు?"

"లేదు నాన్నా!"

"అవున్లే! నువ్వు మీ నాన్నగారి పక్షం కాకపోతే నా పక్షం ఎప్పుడైనా మాట్లాడావా?" నిష్ఠూరంగా అంది అమ్మ.

"తల్లీ! నువ్విలా మమ్మల్ని వాయించడం మాని అసలు విషయానికి రా!" నవ్వారు నాన్న.

"అయితే సీరియస్‌గా అడుగుతున్నాను. మా శ్యామూ కూతురిని మన వాడికి చేసుకుంటే ఎలా వుంటుంది?"

"వాడి మాట ఎలా వున్నా నీకు మాత్రం చాలా బాగుంటుంది. ఆహా! మళ్లీ సీరియస్ అవకు. నేను కూడా సీరియస్‌గానే చెబుతున్నాను. నీకూ వాడికీ ఇష్టం అయితే నాకేమీ అభ్యంతరంలేదు"

"ఏరా అబ్బాయ్! నీ అభిప్రాయం ఏమిటో చెప్పు. అమ్మాయి చదువుకుంది, బుద్ధిమంతురాలు, మనలో కలిసిపోతుంది. అటువంటి పిల్ల మన ఇంటి కోడలు కావడం మన అదృష్టం అనుకో. నీ అభిప్రాయం ఏమిటో చెబితే ముహూర్తాలు పెట్టించేస్తాం"

"నీ ధోరణే నీదికానీ కాస్త వాడినికూడా ఆలోచించుకోనియ్. రేపటి రోజున కష్టం, సుఖం అనుభవించవలసిన వాడు వాడు"

"పిలిచి పిల్లనిస్తానంటే కులం తక్కువ అన్నాడట మీలాంటివాడే" చిరాగ్గా అంది అమ్మ.

"అమ్మా! ప్లీజ్ నన్ను కాస్త ఆలోచించుకోనియ్" డైనింగు టేబులు ముందు నుంచి లేచాను.

"ఎంతసేపూ నీ ధోరణిలో నువ్వు మాట్లాడేస్తున్నావు కానీ అవతల ఆ పిల్ల తరపు వాళ్ల అభిప్రాయం కూడా తెలుసుకోవాలిగా. నీకు ఇష్టమైనంత మాత్రాన అవతల వాళ్లకి కూడా నచ్చాలని ఏముంది" మందలించారు నాన్నగారు.

"ఏం నా కొడుక్కి ఏం తక్కువ? ఎంత అదృష్టం చేసుకుంటే ఇలాంటి భర్త దొరుకుతాడు. కళ్ల ముందుకు వచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకునేంత తెలివితక్కువదేమీ కాదు ఆ పిల్ల" అతిశయంగా అమ్మ అంటున్న మాటలకు నాలో నేను నవ్వుకున్నాను.

"అవునులే ఎంతైనా కాకిపిల్ల కాకికి...! అబ్బేబ్బే! మరీ అంతలా సీరియస్‌గా చూడకు. భస్మమై పోగలను. తరువాత నువ్వే బాధ పడతావు" వెనుక నుంచి విని పిస్తున్న నాన్నగారి మాటలకు నవ్వుకుంటూ నా గదిలోకి నడిచాను.

కళ్లు మూసుకుంటే కళ్ల ముందు ఆ అమ్మాయే ప్రత్యక్షమైంది. ఎంత విచిత్రంగా కలిసింది తమ బంధం? వాళ్లకు అభ్యంతరం వుంటుందని నేను అనుకోను. మొదటి రోజు అక్కడి నుండి తిరిగి వచ్చిన తరువాత అమ్మ వాళ్ల పరిస్థితి అంతా వివరంగా చెప్పింది. ఆమె మనసు విప్పి తమ పరిస్థితి అంతా వివరంగా చెప్పారట.

ఆ రాత్రి అంతా ఆలోచించాను. అమ్మ సంతోషాన్ని ఎందుకు కాదనాలి? కాబోయే

భార్య గురించి నేనేమీ ప్రత్యేకంగా కలలు కనడంలేదు. చటుక్కున రంజని గుర్తుకు వచ్చింది. పాపం, ఎక్కడ వుందో? ఎలా వుందో? రంజనిలా విద్యార్థినులను ప్రలోభానికి దూరంగా వుంచడం కోసమైనా పెళ్లాడక తప్పదు. అటువంటప్పుడు అమ్మ కోరుకున్న ఆ అమ్మాయినే చేసుకుంటే అమ్మకూ సంతోషమే. ఉద్యోగం విషయంలో ఎటూ వారి మాట వినలేదు. పైగా వాళ్లూ ఆర్థికంగా చితికిపోయి వున్నారు. కట్నం లేకుండా ఆ అమ్మాయినే చేసుకుంటే వారికీ సంతోషమే కలుగుతుంది. ఆ అమ్మాయికీ నా మీద ప్రేమానురాగాలు పెరుగుతాయి. నా జీవితం సుఖసంతోషాలతో గడిచిపోతుంది.

"ఏం బాబూ! ఏం ఆలోచించావు? " ఇంకా తెల్లవారకుండానే అమ్మ వచ్చి నా మంచం మీద కూర్చుని అడుగుతుంటే అర్థమైంది అమ్మ ఆ అమ్మాయిని ఎంతగా కోరుకుంటోందో?

"నాకు అభ్యంతరం ఏముంటుందమ్మా! అయితే ఒక్కటే కండిషన్ వాళ్ల దగ్గర కట్నం పుచ్చుకోకూడదు"

"చాలా సంతోషం బాబూ! నిన్నా దేవుడు చల్లగా చూస్తాడు" నా తల నిమిరి లోపలకు వెళ్లింది.

తెలిసిన వాళ్లు కావడంతో పెళ్లిచూపుల తతంగం, తాంబూలాలు పుచ్చుకోవడం లాంటివేవీ పెట్టుకోలేదు. ఒక రోజు అమ్మాయి తండ్రి జగన్మోహనరావుగారు కొడుకు కిశోర్‌తోనూ, సిద్ధాంతిగారితోనూ మా ఇంటికి వచ్చి మా నాన్నగారిని సంప్రదించి డైరెక్టుగా పెళ్లికి ముహూర్తాలు పెట్టుకున్నారు.

అమ్మ ఆత్రుతకు తగ్గట్టే పదిహేను రోజుల్లో ముహూర్తం కుదిరింది. అది దాటితే మరో మూడు మాసాల దాకా మరో ముహూర్తం లేదట.





ఇక పెళ్లి హడావుడి ప్రారంభమైంది. అమ్మ తన స్నేహితురాలితో షాపింగ్ ప్రారంభించింది. ఆవిడా తరచు వస్తూనే వున్నారు. నన్ను పలకరిస్తూనే వున్నారు. ఎవరూ కూడా పెళ్లికూతురితో మాట్లాడతావా అని అడగలేదు. నాకు మాట్లాడాలని వున్నా ఆ విషయం ఎలా చెప్పాలో అర్థం కాలేదు. అయినా అమ్మ నాతో మాట్లాడేంత తీరిక కూడా లేనంత బిజీగా వుంది.

ఇన్విటేషన్స్ వచ్చేశాయి. బంధు మిత్రులకు పోస్టు చేయడం కూడా అయిపోయింది. ఇన్విటేషన్‌తో పాటు నా ఉత్తరాన్ని కూడా అందుకున్న కృష్ణమోహనదాసుగారు సతీసమేతంగా పెళ్లికి వస్తున్నట్లు ఉత్తరం రాశారు.

"మాస్టారూ! నేను వచ్చేశాను" పెళ్లికి నాలుగు రోజులు ముందుగానే వచ్చేశాడు సిసింద్రీ. ఈ సంవత్సరమే గుంటూరు మెడికల్ కాలేజీలో చేరాడు.

మా అమ్మకూ, నాన్నకూ పరిచయం చేశాను. మా నాన్నగారికీ అమ్మకూ రెండో కొడుకులా బాధ్యత తన మీద వేసుకుని పెండ్లి మండపం అంతా తిరిగిన వాడు తిరిగినట్లే వున్నాడు.

"మాస్టారికి తోడుపెళ్లికొడుకును నేనే" అంటూ హుషారుగా తిరిగే సిసింద్రీని చూస్తుంటే ఏడెనిమిదేళ్ల క్రితం మొట్టమొదట చిటచిటలాడిపోతూ నాతో మాట్లాడిన సిసింద్రీయే గుర్తుకు వస్తాడు.

ఆనాటి పసివాడు, పనివాడు మెడికల్ కాలేజీలో చేరగలడని ఎవరు ఊహించారు? నిజానికి సిసింద్రీయే కలలో కూడా అనుకుని వుండడు. మెట్రిక్‌లో సైన్సు గ్రూపు తీసుకోమని దాసుగారు సలహా ఇస్తే మారుమాట్లాడకుండా తీసుకున్నాడు. ఇంటరులో బైపీసి తీసుకోమంటే అలాగే తీసుకున్నాడు. తీరా ఇంటరు పరీక్షలు అవగానే ఎమ్సెట్ కోచింగుకి వెళ్లమంటే తెల్లమొహం వేసుకుని చూస్తూ వుండిపోయాడు.

"ఒక డాక్టరుగా నా ఊరివారికి వైద్య

సేవలు అందిస్తాడని మెడికల్ కాలేజీకి పంపిస్తే దేశాన్నే వదిలి పోయాడు నా కొడుకు. కనీసం నువ్వు అయినా డాక్టరువై ఊరు వారికి ఉపయోగపడాలని నా ఆశ. మా వాడిలా ఊరుని కాదని వెళ్లిపోవు కదూ!" దాసుగారి మాటలు వింటూనే ఆయన కాళ్లమీద పడి ఒక్కసారిగా బావురు మని పోయాడు.

"అరెరె! ఇదేమిటిరా" లేవనెత్తిన దాసుగారిని చూసి కళ్లనీళ్లు తుడుచుకుంటూ అన్నాడు సిసింద్రీ "మట్టిలో బతికే వాడిని. మీ దయవల్ల చదువుకుని నలుగురిలోనూ గౌరవంగా బతకాలని ఆశించానేకానీ, నేను డాక్టర్ని కావడం? లేదు బాబుగారూ! నాకెందుకో నమ్మబుద్ధి కావడంలేదు. నాకెందుకో భయంగా వుంది బాబుగారూ!"

"ఛ! దేనికిరా భయం? చదువుని ఒక తపస్సుగా భావించిన నీవల్లనే ఈ ఊరి వారికి నిజమైన సేవలు లభిస్తాయి. కష్టపడి చదువు. ఊరివారికి సహాయంగా ఊళ్లోనే వుండిపో. అదొక్కటే నా కోరిక"

"నేను ఎప్పుడూ మిమ్మల్నీ ఈ ఊరునీ వదిలి వుండను బాబుగారూ!" ప్రతిజ్ఞ చేస్తున్నట్లే స్థిరంగా అన్నాడు సిసింద్రీ. రెట్టింఛిన ఉత్సాహంతో ఎమ్సెట్ కి ప్రిపేరయ్యాడు. ఎనభై నాల్గవ రాంకు సాధించాడు. గుంటూరు మెడికల్ కాలేజీలో చేరాడు.

★ ★ ★

పెళ్లికి వచ్చిన దాసుగారినే ఊళ్లో నాకు ఒక ఇల్లు అద్దెకు చూసి పెట్టమని అడిగాను.

"నీకెందుకు? ఆ విషయం నాకు వదిలిపెట్టు. కాలేజీ రీఓపినింగు రోజున అమ్మాయిని తీసుకుని వచ్చెయ్యి" అన్నారు దాసుగారు. పదిహేను రోజులపాటు సుధతో బెంగుళూరు, మైసూరు, ఊటీ చూసుకుని ఇంటికి తిరిగి వచ్చాం. రెండిళ్ల మధ్య తిరుగుతూ రోజులు క్షణాల్లా గడిపేశాం. కాలేజీ తెరిచే సమయానికి సుధతో ప్రయాణమయ్యాను. కూతురు సంసారం చక్కబెట్టి రావడానికి మా అత్తగారూ, కొడుకు కొత్త సంసారం చూడడానికి అమ్మ కూడా వచ్చారు. సంసారానికి సరిపడిన సామాను లన్నీ లారీలో పంపించారు. ప్రయాణ వివరాలు ముందుగా రాయడంతో రాజమండ్రి స్టేషన్ బయటకు వచ్చేసరికి ఎదురుగా దాసుగారి కారు మా కోసం ఆగివుంది.

కారు ఇంటి ముందు ఆగేసరికి ఆశ్చర్యపోయాను. ఈ రెండు నెలల కాలంలోనూ దాసుగారు ఏదో కట్టుబడి ప్రారంభించినట్లున్నారు. గుమ్మంలో సీత హారతి పళ్లెంతో ఎదురుపడింది. కొత్త కోడలితో గృహప్రవేశం చేయించినంత హడావుడి చేశారు సావిత్రమ్మగారు. ఆడవారి నందరినీ లోపలకు తీసుకు వెళ్లారు. దాసుగారు అద్దె ఇంటి విషయం ఏమైనా చెబుతారేమోనను కుంటే ఆ విషయం తప్ప మిగిలిన విషయాలన్నీ మాట్లాడుతున్నారు.

"ఇల్లు దొరికి వుంటుందనే ఉద్దేశ్యంతో మొత్తం సామానంతా లారీతో పంపిస్తున్నారు" చివరికి నేనే అన్నాను. నామాట పూర్తికాకుండానే లేచారు దాసుగారు. నేను వారిని అనుసరించాను.

మండువాకి ఒకవైపుగా వున్న రెండు గదులూ ఖాళీగా వున్నాయి. అటువైపున ప్రహరీగోడకు ఆనుకుని రెండు గదులు వేశారు. ఆ రెండు గదులూ ఈ రెండు గదులూ కలుపుతూ విశాలమైన హాలు. కొత్తగా కట్టిన గదులకీ, హాలుకీ స్లాబు వేశారు.

"కొద్దిగా అల్మారాల పని మిగిలిపోయింది. ఈ నెలాఖరుకు పూర్తి అవుతుంది. ఎల్లుండి మంచి రోజు. మీ దంపతుల చేత గృహప్రవేశం చేయిద్దామనుకుంటున్నాం. ఈ రెండు రోజులూ ఆగండి" దాసుగారి మాటలకు తెల్లబోయి చూశాను.

"ఇది మేము వుండడానికా? "ఆశ్చర్యంగా అడిగాను.

"నిన్ను ఇక్కడ వుంచడానికి నాకు మరో దారి కనిపించలేదు" నిర్మలంగా నవ్వుతూ అన్నారు దాసుగారు.

"అయ్యో ఇల్లు కుదిరిందని బాబు చెప్పడంతో మేమూ బయలుదేరి వచ్చేశాం. వాళ్లిద్దరితో పాటు మేమూ మీకు ఇబ్బంది కలిగిస్తున్నాం" నొచ్చుకున్నారు అమ్మా, మా అత్తగారు కూడా.

"అదేమిటమ్మా కొత్త కోడలు ఇంటికి వచ్చిందంటే మాకూ సంతోషమే కదా" సర్ది చెప్పారు సావిత్రమ్మ గారు.

ఇల్లు సర్దిపెట్టి ఒక పదిహేను రోజులుండి వెళ్లారు అమ్మా, అత్తగారూ.

★ ★ ★

"అబ్బ ఈ ఊళ్లో మరీ బోర్ కొట్టేస్తోంది బాబూ. మీకు సిటీలో ఉద్యోగం ఎప్పుడు వస్తుందో? మన కష్టాలు ఎప్పుడు గట్టెక్కుతాయో?" ఒకరోజు మాటలమధ్య అంది సుధ.

"అదేమిటి? ఇది నేను కావాలని ఎంచుకున్న ఉద్యోగం. రిటైర్ అయ్యేంతవరకూ మనం ఇక్కడే వుంటాం. ఈ ఊరిని ఆదర్శ గ్రామంగా తీర్చిదిద్దడం నా కోరిక"

"చాల్లెండి. ఊరిని ఉద్ధరించడానికి మీ భవిష్యత్తుని నాశనం చేసుకుంటారా? డాక్టరేట్ చేసి ఏ యూనివర్శిటీలోనో చేరితే ఎంత బాగుంటుంది?"

"డాక్టరేట్ చేసిన వారికందరికీ యూనివర్శిటీలో ఉద్యోగం దొరకదు సుధా! నీకు తెలియదేమో ఇప్పుడు లెక్చరర్ పోస్టుకి పి. హెచ్.డి చేయడం ఒక అర్హత. నేను కూడా దానికోసమే ప్రయత్నిస్తున్నాను" నా మాటలకు సుధ మొహం మాడ్చుకుంది.

సుధ మొదట్లో కొన్ని నెలలు బాగానే వుంది. కానీ, క్రమంగా హైదరాబాద్‌లో ఉద్యోగం చూసుకుని వెళ్లిపోదామని గొడవ చేయడం ప్రారంభించింది.

"డిగ్రీ వచ్చిన వెంటనే ఏదో ఒక ఉద్యోగం అని చేరిపోయారనుకున్నాను. మీకు ఉద్యోగం చూసిపెట్టే శక్తి మీ నాన్నగారికి లేదు కాబట్టి ఈ మారుమూల పల్లెటూరిలో పడి వుంటున్నారనుకున్నాను. మా నాన్నగారి ఇన్‌ఫ్లుయెన్స్‌తో ఏదో ఒక కాలేజీలో ఉద్యోగం చూసి పెట్టలేకపోతారా అని మిమ్మల్ని చేసుకోవడానికి ఒప్పుకున్నాను. అంతే కానీ, బతికినంత కాలమూ ఇలా ఈ పల్లెటూళ్లో మగ్గిపోవడానికి కాదు. ఇప్పటికైనా మా నాన్నగారికి ఉత్తరం రాస్తాను, అక్కడే ఏదో ఒక ఒద్యోగం చూసిపెట్టమని. వెళ్లిపోదాం" అని ప్రారంభించింది.

ఒక్క క్షణం తెల్లబోయాను. ఇన్ని రోజులూ ఆర్థిక ఇబ్బందుల్లో వున్న అమ్మ స్నేహితురాలి కూతురిని పెళ్లి చేసుకుని ఆ కుటుంబానికి ఏదో సహాయపడ్డానని అనుకున్నానే కానీ, పెళ్లికూతురి అభిప్రాయం తెలుసుకోవాలని కానీ, ఆవిడకు వేరే ఊహలు వుండి వుంటాయని కానీ ఏనాడూ ఊహించలేదు. జీవితంలో సరిదిద్దుకోలేని పొరపాటు జరిగిపోయింది. అయినా నాకేదో ధైర్యం. ఈ వాతావరణంలో కొన్నాళ్లు వుంటే సుధ తనే సర్దుకుపోగలదనే ధైర్యం.

★ ★ ★

"ఏం పురాణం పంతులుగారూ, అయిందా మీ పురాణ కాలక్షేపం?" ఎప్పటిలాగే ఆదివారం ఉదయం దాసుగారి ఇంటికి వచ్చిన వారికి భాగవతం చదివి వినిపించి లోపలకు వచ్చిన నన్ను చూసి వ్యంగ్యంగా అంది సుధ. మొదట్లో దాసుగారూ, సావిత్రమ్మగారే భారత భాగవతాలు వింటూ వుండేవారు. క్రమంగా ఊళ్లోని స్త్రీ పురుషులు, పరిచయస్తులు రావడం ప్రారంభించారు. దానితో నిజంగానే అదొక పురాణ కాలక్షేపంగా మారింది. కానీ, అంత మందికి ఉపయోగపడుతున్నాననే భావం ఎంతటి ఆనందాన్నిస్తుందో సుధకు అర్థం కావడం లేదు.

"సరేలే ముందు భోజనం వడ్డించు.




ఆకలి దంచేస్తోంది" మాట మార్చబోయాను.

"ఆ తొందర ఎందుకో నాకు తెలియదా? మళ్ళీ ఆ యువరక్షా సమితి వంకతో బయట బలాదూర్ తిరగడానికేకదూ! ఛ...ఛ. ఏం మనిషో? కొత్తగా పెళ్ళి అయింది. భార్యను ఏ సినిమాకైనా తీసుకు వెళ్ళాలనే జ్ఞానంలేదు. ఇంట్లో వున్నంతసేపూ ఆ ముసలాయనతో కబుర్లు. ఆదివారం వచ్చిందంటే ఇక కంటికే కనిపించరు. మాట్లాడే తోడు లేక పిచ్చెక్కిపోతోంది" ఈరోజు ఏమైందో మరీ చిరచిరలాడిపోతోంది సుధ.

"ప్రయివేటుగా కట్టి ఆ బి.ఎ. పూర్తిచేయమంటే వినిపించుకోవు. బి.ఎ. పూర్తిచేసి ఆ తరువాత ఎం.ఎ. కూడా ప్రయివేట్‌గా చేయవచ్చు. కాలక్షేపం కావడంలేదని విసుక్కునే బదులు, ఊళ్ళో ఇంతమంది చదువుకున్న ఆడపిల్లలున్నారు, ఏ మహిళామండలి అయినా ప్రారంభించకూడదూ? " ఎప్పటినుంచో నా మనసులో వున్న ఆలోచనను బయటపెట్టాను.

"ఆ... ఇద్దరం చెరోవైపు ఊరంతా బలాదూర్ తిరుగుతూ ఉంటే, ఇక సంసారం సాగినట్లే" విసురుగా అంటూ లోపలికి నడిచింది సుధ. ఒక్కతే ఆడపిల్ల అని గారంగా పెంచారేమో, తన మాటే నెగ్గాలనే పంతమూ ఎక్కువే. సినిమాలంటే విపరీతమైన మోజు. అన్నగారితో పోట్లాడి వాళ్ళ ఇంట్లోని టీవీ, వీసీఆర్ తెచ్చుకుంది. "మనం నెమ్మదిగా కొనుక్కుందాం" అని నేను నచ్చ చెప్పినా వినలేదు. "అప్పుడే వాళ్ళ టీవీ వాళ్ళకు ఇచ్చేద్దాంలెండి" నిర్లక్ష్యంగా అంది.

హైదరాబాదు వెళ్ళినప్పుడల్లా కొత్తగా రిలీజైన కాసెట్స్ కొనుక్కుని రావలసిందే. ఎందుకా అనవసరమైన ఖర్చు అంటే, "ఇలా పైసా పైసా లెక్కపెట్టుకోవడం తమ ఇంటా వంటా లేద"ంది నిర్మొహమాటంగా. ఎప్పుడు చూసినా టీవీముందు కూర్చునే వుంటుంది. ఎప్పుడూ నిశ్శబ్దంగా వుండే ఆ ఇల్లు సుధ వచ్చిన దగ్గరనుండీ అలా టీవీలో మాటలు వినిపిస్తూనే వుంటాయి. అయినా మధ్యమధ్య థియేటర్లో సినిమాలు చూస్తూ వుంటేనేకానీ సుధకు తోచదు.

రెండుమూడుసార్లు సినిమాల విషయంలో నాతో వాదనకు దిగడం దాసుగారు గమనించి వుంటారు. ఒకరోజు మాటలమధ్య అన్నారు. "పట్నవాసం నుంచి వచ్చిన పిల్ల. బొత్తిగా ఇలా నాలుగు గోడల మధ్యా బంధించి వుంచితే ఎలా? చేతిలో కారు ఉంది. ఎప్పుడైనా ఏ సినిమాకు అయినా తీసుకువెళ్ళకూడదూ? " అని.

నేను వినిపించుకోకపోయేసరికి ఒకరోజు సుధనే పిలిచి చెప్పారు.

సంతోషంగా దాసుగారికి థాంక్స్ చెబుతూ ఆరోజే ప్రోగ్రాం వేసింది.



"ఏమిటీ, ఆ సిసింద్రీ అన్న కుర్రాడు అంటరానివాడా? " ఉరమని పిడుగులా వచ్చిన ఆ ప్రశ్నకు తెల్లబోయి చూశాను అప్పుడే కాలేజీనుంచి వచ్చిన నేను.

"ఛ... ఏం మాటలవి సుధా. కాస్త సభ్య

తగా మాట్లాడలేవూ? "

"అబ్బో సభ్యతట... ఇల్లంతా మంగళం చేసి. నిజం చెప్పండి అతని కులం ఏమిటి? " సిసింద్రీ కథ అంతా చెప్పాను.

"అయ్యో... అయ్యో. మీకిదేం పోయేకాల మండీ? వాడిని మా ఇంటికి తీసుకువచ్చి మనతో సమానంగా డైనింగ్ టేబులు దగ్గ రకూర్చోబెట్టారు. మాచేత వాడు తిన్న ప్లేటు తీయించారు"

"చూడు సుధా! సిసింద్రీ ఈ ఇంట అడు గుపెట్టిన నాటినుండీ ఈ ఇంటి కుర్రాడు గానే మసులుతున్నాడు. త్వరలోనే ఈ ఊరికి డాక్టరుగా రాబోతున్నాడు. సావిత్ర మ్మగారికే ఏ అభ్యంతరమూ లేకపో యింది. పట్నంలో పెరిగిన నీలో ఇంత సంకుచిత భావం వుందంటే విన్నవాళ్ళు నవ్వుతారు"

"పట్నంలో వున్నా మేం మన ఆచారా లను వదిలిపెట్టలేదు తెలుసా? " సగర్వంగా చూసింది సుధ.

నాకు మండిపోయింది. "మీ ఆచారాల గురించి ఎందుకు చెబుతావు సుధా! మన పెళ్ళికి వచ్చిన మీ అన్నయ్య కంపెనీ ఎం.డి.గారికి భోజనం ఎక్కడ పెట్టారు? ఆయన కులమేమిటో తెలియదా? మనం హనీమూన్ నుంచి వచ్చిన తరువాత మనల్ని చూడడానికి వచ్చారు హైకోర్టు జడ్జీ గారు. మీ నాన్న క్లోజ్ ఫ్రెండ్. ఆయన కులమేమిటి? ఎవరికి చెబుతావు మీ ఆచా రాల గురించి? పోనీ వాళ్ళు పై అంతస్థుల వారు కాబట్టి నీకు అభ్యంతరం లేకపోయి వుండచ్చు. సిసింద్రీ కూడా ఈ సంవత్సరం ఫైనల్ ఎగ్జామ్స్‌రాసి డాక్టరు కాబోతున్న వాడు. ఇక నీకు అభ్యంతరం ఏమిటి? "

"వాళ్లు భోజనాలుచేసి వెళ్ళిన తరువాత ఆ ప్లేట్స్ పనివాళ్ళచేత తీయించి టేబుల్ క్లీన్ చేయించి కానీ, మేం అక్కడ భోజనాలు చేయం తెలుసా? ఈ దౌర్భాగ్యుడు తిన్న ప్లేటుని నా చేత్తో నేను తీశాను" ఉక్రోషంగా అంది.

"సుధా. ఇక అనవసరంగా మాట్లాడకు. ఎవరైనా వింటే బాగుండదు" విసురుగా బయటకు నడిచాను.

రాను రాను సుధలో మార్పు చాలా స్పష్టంగా తెలుస్తోంది. పెళ్ళయిన రెండేళ్ళు బాగానే వుంది. అక్కడనుంచి ప్రారంభ మైంది నస. హైదరాబాదు వెళ్ళి ఈ ఉద్యో గమేదో అక్కడే చూసుకోవచ్చుననే సాధింపు ప్రారంభమైంది. క్రమంగా తనే మారుతుం దని మౌనం వహించాను.

★ ★ ★

"మీరు కేవలం పురాణ పురుషులే అనుకు న్నాను. కానీ దక్షిణ నాయకుని అంశ కూడా వుందని నాకు తెలియదు సుమండీ" వ్యంగ్యంగా మాట్లాడడం సుధకు వెన్నతో పెట్టిన విద్య.

"అర్ధరాత్రి అంకమ్మ శివాలని, ఇప్పుడీ రాత్రి పదిగంటలవేళ నాపై నీకీ సదభి ప్రాయం కలగడానికి కారణమేమిటో? " విసుగ్గా అన్నాను.

"మీ కృష్ణలీలలన్నీ విన్నానులెండి. పాపం, మీ రంజిత..."

"ప్లీజ్ సుధా. ఎందుకా అమాయకురాలి ప్రసక్తి తీసుకుని వస్తావు? నిజంగా ఆమె పట్ల నాకేమాత్రం ఆసక్తి వున్నా, ఈ రోజున నువ్వీ ఇంట్లో వుండి వుండేదానివి కాదు" చిరాగ్గా అన్నాను.

"సుఖపడేదాన్ని" నిర్లక్ష్యంగా అంది సుధ.

రంజని మనసులో మెదిలింది. పాపం ఇప్పుడు ఎక్కడ వుందో? ఎలా వుందో? సిరిసంపదలతో పుట్టిపెరిగిన పిల్ల అహంభా వంతో నాకొక వ్యక్తిత్వం లేకుండా చేస్తుం దని భయపడి కావాలని ఆమెను దూరం చేసుకున్నాను.

కానీ సుధ... సిరిసంపదలకు దూరమైన సుధను కావాలని కోరి పెళ్ళి చేసుకున్నాను. తన తల్లిదండ్రుల భారం తీర్చిన నామీద తనకు అభిమానం పెరుగుతుందని కలలు





కన్నాను. కేవలం సిరిసంపదలకు దూర మైందే కానీ, అహంభావానికీ, అహంకారా నికీ దూరంకాలేదు. మారిన పరిస్థితులతో పాటు మారలేకపోతోంది. కానీ, నేను మాత్రం ఎంత కాలమని ఓపిక పట్టగ లను? స్త్రీవాదులు పురుషాహంకారమని పురుష ప్రపంచం మీద ధ్వజమెత్తుతారు కానీ, ఆడవారు రెండవ కంటివారికి తెలియ కుండా మగవారిని ఎంతగా టార్చర్ పెట్టగ లరో నాకు బాగానే అనుభవంలోకి వచ్చింది.

ఏ వ్యాపకమూ లేకుండా కూపస్థ మండూకంలా నాలుగు గోడలమధ్యా ఉండి పోవడం, ఎంతసేపూ గత వైభవాన్ని తల చుకుని కుమిలిపోవడం, దానితో సుధ మనసు నలిగిపోతోంది.

★ ★ ★

ఆరోజు కాలేజీనుంచి వచ్చేసరికి ఇంట్లో సుధ అమ్మానాన్నగారు కనిపించారు.

"అరే! ఎప్పుడు వచ్చారు? కనీసం ఉత్తరం కూడా రాయలేదే? ప్రయాణం సుఖంగా జరిగిందా? " సంతోషంగా పలక రించాను.

"మా ఫ్రెండ్ కూతురు పెళ్లికి నిన్న రాజ మండ్రి వచ్చాం. సరే, ఇంతదూరమూ వచ్చాంకదా. ఒకసారి మిమ్మల్ని కూడా చూసిపోదామని ఇటు వచ్చాం" అన్నారు మా మామగారు మాధవమూర్తిగారు.

"బాగున్నావా బాబూ" సాదరంగా అడి గారు మా అత్తగారు.

"ఇల్లు పట్టకుండా తిరగమంటే చాలా బాగా వుంటారు" నిర్లక్ష్యంగా అంది సుధ.

"ఏమిటా మాటలు సుధా! వయసు వస్తున్నా ఇంకా చిన్నతనం పోకపోతే ఎలా? " అత్తగారు మందలిస్తుంటే, మామ గారు తల వంచుకున్నారు.

మెల్లగా అక్కడనుంచి తప్పుకుంటే మంచిది. అత్తగారు అందించిన ఫలహారా లను తీసుకుని మా మామగారిని కూడా తీసుకుని దాసుగారి దగ్గరకు వచ్చాను. ప్రతి రోజూ సాయంత్రం కాలేజీనుంచి రాగానే పొగడచెట్టు కింద కూర్చుని దాసుగారితో కబుర్లుచెప్పడం నాకు అలవాటే.

కాలేజీ విషయాలూ, యువరక్షా సమితి కార్యక్రమాల గురించి చర్చించుకోవడానికి ఆ సమయం బాగా ఉపయోగపడుతుంది.

పెరటివైపు వెళ్ళేసరికి సిసింద్రీ అక్కడ కూర్చుని దాసుగారితో మాట్లాడుతున్నాడు.

"రండి మాస్టారూ. కుర్చీలు తీసుకుని వస్తాను" తూనీగలా పరుగెత్తాడు.

"రండి మూర్తిగారూ. ఎప్పుడు వచ్చారు? ప్రయాణం సుఖంగా జరిగిందా? " సాద రంగా నిలబడి ఆహ్వానించారు దాసుగారు.

"ఏమిటీ ఎగ్జామ్స్ అయిపోయాయా? " సిసింద్రీ తీసుకువచ్చిన కుర్చీలో కూర్చుంటూ అడిగాను.

"రిజల్ట్స్ కూడా తెలుసుకుని విజయవం తంగా తిరిగి వచ్చాడు. ఇప్పుడు మనవాడు డాక్టర్ జ్ఞానేశ్వర్" సిసింద్రీని అభిమానంగా చూస్తూ అన్నారు దాసుగారు.

"చాలా సంతోషం బాబూ! కంగ్రాట్యులే షన్స్" సంతోషంగా అభినందించారు మా మామగారు.

నాకైతే సంతోషంతో నోటమాట రాలేదు. మౌనంగా సిసింద్రీ భుజంమీద చెయ్యివే శాను. దాసుగారి కోరిక నెరవేరింది. ఈ ఊరివారికి వైద్యసదుపాయం లభించబో తోంది. ఈ విజయం ఎన్ని సంవత్సరాల తపస్సు ఫలితం?

"ఇదంతా మీ ప్రోత్సాహమే. మాస్టారూ! బాబుగారు పెట్టిన భిక్ష. మట్టిలో బతకాల్సి నవాడిని మీ ఇద్దరి దయవల్లా ఇంతవరకూ వచ్చాను" సిసింద్రీ కళ్ళలో సన్నని నీటితెర.

"అంత పెద్దపెద్ద మాటలు ఎందుకు? నా ఆశ, మీ మాస్టారి ఆశయం నెరవే రాయి"

"వస్తాను మాస్టారూ. బాబుగారికీ, మీకూ ఈ విషయం ముందుగా చెప్పాలని బస్సు

దిగుతూనే ఇటు వచ్చాను ఒక్కసారి మా వాళ్ళకు కూడా కనిపించి వస్తాను" అంటూ సెలవు తీసుకుని వెళ్ళాడు సిసింద్రీ.

తరువాత మాటలమధ్య చెప్పారు మా మామగారు. నిన్న పెళ్ళిలో కనిపించిన ఆయన మిత్రుడు కిశోర్‌కి ఏదో పెళ్ళి సంబంధం గురించి చెప్పి అమ్మాయిని చూసుకోవడానికి రమ్మన్నాడట. ఇటు మమ్మల్ని చూసినట్టూ వుంటుంది, అటు అన్నీ కలిసివస్తే కొడుక్కి పెళ్ళి సంబంధం చూసినట్టూ వుంటుందని వచ్చారట.

అమ్మాయిది పదిహేను కిలోమీటర్ల దూరంలో వున్న గ్రామం. ఊరు, పేరూ చెప్పేసరికి తీరా వాళ్ళు దాసుగారికి సన్నిహితులే. సంప్రదాయమైన కుటుంబమని చెప్పేసరికి మా మామగారు చాలా సంతృప్తిపడ్డారు.

మరునాడు మా అత్తగారు, మామగార్లతో పాటు నేనూ, సుధా కూడా అమ్మాయిని చూడడానికి వెళ్ళాం.

మమ్మల్ని రిసీవ్ చేసుకోవడానికి వచ్చిన పెళ్ళికూతురి అన్న రమేష్‌ని చూసి గుర్తుపట్టాను. అతను మా కాలేజీ స్టూడెంటే. బి.ఎ. సెకండియర్ చదువుతూ ఎందువల్లో చదువు మానేశాడు రెండేళ్ళ క్రితం.

"ఏం చదువుతున్నావు బాబూ?" అడిగారు మా మామగారు.

"ఏం చెప్పమంటారు బావగారూ. తిన్నగా చదువుకోరా అని కాలేజీలో చేర్పిస్తే చదువుకుంటే ఉద్యోగాలు ఏం వస్తాయ్? వచ్చినా ఆ వచ్చే జీతాలు మనకు పాకెట్ మనీకైనా సరిపోతాయా? అని వాళ్ళ మేనమామ మధ్యప్రదేశ్‌లో కాంట్రాక్ట్సు చేస్తున్నాడు లెండి. వెళ్ళి చేతులు కాల్చుకుని వచ్చాడు" అన్నారు పెళ్ళికూతురి తండ్రి జగన్మోహన రావుగారు.

"ఎప్పుడు చూసినా ఆ విషయమే చెబుతావుకానీ నిరుడు రొయ్యల చెరువులు వేసి ఇరవై లక్షలు సంపాదించాను అనే విషయం చెప్పవేం? "

ఏమిటో ఈనాడు అందరూ ఈజీ మనీకి అలవాటుపడుతున్నారు. ఎవరో రొయ్యల చెరువులు వేసి లక్షలు సంపాదించారని తెలియడంతో మామూలు రైతులు కూడా పంట భూములను చెరువులుగా మార్చేస్తున్నారు. దానివల్ల కలిగే పర్యావరణ కాలుష్యంకానీ, భవిష్యత్తులో కనీసం తాగడానికి మంచినీళ్ళు కూడా దొరకవనే సంగతి కానీ వాళ్ళకు పట్టడంలేదు. పోనీ అందరూ దాని వల్ల లాభాలు పొందుతున్నారా? అంటే అదీ సందేహమే. వాళ్ళు సంపాదించే లక్షల వెనుక ఎన్ని నెలల శ్రమ వుందో వీళ్లకు తెలియదు. కేవలం జూదం ఆడుతున్నట్లే ఈ చెరువులు వేస్తున్నారు.

ఒకసారి సముద్రపు ఒడ్డుకు స్టూడెంట్స్‌ని పిక్నిక్‌కి తీసుకువెళ్ళాం. అక్కడ ఇద్దరు పల్లెవాళ్ళు నీటిగుంటల్లో రొయ్యపిల్లల్ని పట్టుకుని వాళ్ళ పాత్రలలో వేసుకుంటున్నారు. నెమ్మదిగా వాళ్ళతో మాటలు కలిపాను. ఆ పిల్లల్ని అమ్ముతారట. మాటలమధ్య ఒకతనన్నాడు.

"ఇదివరకు ఈ చేపలను పట్టడం, రొయ్యల్ని పట్టడం మేం పల్లెవాళ్ళం చేసే వాళ్ళం బాబూ! కానీ ఇప్పుడు పెద్ద కులాల వాళ్ళంతా పెద్ద ఎత్తున సాగుచేసి మా కడుపులు కొడుతున్నారు" అన్నాడు.

అమ్మాయిని టెన్త్ పాసయిన తరువాత కాలేజీ చదువులకు బయటకు పంపించడం ఇష్టం లేకపోయింది. అత్తగారికి అమ్మాయి రూపం నచ్చితే, వారి పద్ధతులు మామగారికి నచ్చాయి. ఇద్దరు అన్నదమ్ముల మధ్యా ఒక్కగానొక్క అమ్మాయి. అమ్మాయీ, అబ్బాయీ ఒకరినొకరు ఇష్టపడితే వెంటనే ముహూర్తాలు పెట్టుకోవచ్చునని పెద్దలంతా నిశ్చయించారు.

మా మామగారికి ఏ విషయమూ నాన్చడం ఇష్టం వుండదు. తిరిగి వస్తున్నప్పుడే మేమిద్దరం పోస్టాఫీస్ దగ్గర దిగి




పోయి కిశోర్‌కి ఫోన్ చేశాం. విషయం చెప్పి వెంటనే అమ్మాయిని చూసుకోవడానికి రమ్మని మామగారు చెప్తే తెల్లవారేసరికి దిగిపోయాడు.

"ఏమిటీ? అమ్మాయిని చూసుకోవడానికి అంత తొందరా? " అని ఆట పట్టించింది సుధ.

కిశోర్ అమ్మాయిని చూసి పెళ్ళికి అంగీకరించడంతో వెంటనే తాంబూలాలు పుచ్చుకున్నారు.

"హూ! అదృష్టవంతురాలు. చదువుసంధ్యలు లేకపోయినా, పల్లెటూరిలో పుట్టి పెరిగినా హాయిగా పట్టణవాసం చేయబోతోంది" నిరసనగా అంది సుధ.

"నీ అదృష్టానికి లోటేం వచ్చింది తల్లీ!" అన్నాడు కిశోర్.

"ఆ! ఇది అదృష్టం అనుకుంటే నువ్వూ ఈ కాలేజీలో ఉద్యోగంలో చేరు. మీరు మాత్రం పట్టణాలలో హాయిగా బతకాలి. మేం మాత్రం ఈ పల్లెటూళ్ళల్లో మగ్గిపోవాలి. ఇదంతా నా ఖర్మ" చివాలున లేచి వంటింట్లోకి వెళ్ళిపోయింది సుధ.

★ ★ ★

"సుధా! నీ పద్ధతి ఏమీ బాగుండలేదు. నెమ్మదిమీద నువ్వే అర్థం చేసుకుంటావని ఇన్నాళ్ళూ నేనేమీ అనలేదు. కానీ వయసు వచ్చినకొద్దీ బొత్తిగా మంచీ చెడూ తెలియకుండా పోతోంది" కాలేజీనుండి వచ్చిన నాకు ముందు గదిలో మా అత్తగారి మాటలు వినిపించి గుమ్మంలోనే ఆగిపోయాను.

"నా జీవితాన్ని ఇలా నాశనం చేసింది నువ్వే. నీవల్లే ఇలా ఈ పల్లెటూరిలో పడి మగ్గిపోతున్నాను" వెక్కి వెక్కి ఏడుస్తోంది సుధ.

"ఆ పరిస్థితిలో సాగర్ ముందుకు వచ్చి నిన్ను పెళ్ళి చేసుకున్నాడు కాబట్టి కానీ, లేకపోతే నీకసలు పెళ్ళి చేయగలిగి వుండేవాళ్ళమా? "

"చేయగలిగినప్పుడు చేయకుండా వదిలేశావు నేను ఎక్కడ సుఖపడిపోతానో అని. ఏం? అప్పుడు ఆ గుంటూరు సంబంధాన్ని ఎందుకు కాదన్నావు? ఆవేళ నువ్వు అడ్డు చెప్పకుండా వుండి వుంటే, ఈ పాటికి హాయిగా అమెరికాలో వుండేదాన్ని" ఉక్రోషంగా అంటోంది సుధ.

"నోర్ముయ్" తీవ్రంగా వుంది వాళ్ళ అమ్మగారి స్వరం. "అతగాడి గురించి నీకేం తెలుసు? చేసుకున్న పిల్లని నట్టేట ముంచి అక్కడ మరో పెళ్ళిచేసుకున్నాడు. అక్కడ ఆ అమెరికా అమ్మాయే అతని రాక్షసత్వాన్ని భరించలేక ఆరునెలలు తిరగకుండా విడాకులు పుచ్చుకుంది. ఇక్కడ పెళ్ళిచేసుకున్న పిల్ల జీవితం ఎటూ కాకుండాపోయింది. నీ కళ్ళకు పొరలు కమ్మి, నీ అదృష్టమేదో నీకు తెలియడంలేదు కానీ, లంకంత ఇల్లు, స్వంత కూతురులా చూసుకుంటున్న దాసు గారి కుటుంబం, ఇది పల్లెటూరు అయినా నీకు వచ్చిన లోటేమిటి? ఏ వ్యసనమూ లేని సాగర్ భర్తగా రావడం ఎంతటి అదృష్టమో నీకు తెలియడంలేదు. చేజేతులా నీ అదృష్టాన్ని కాలదన్నుకోకు. అతని ప్రాణం విసిగితే...? "

"ఆ పురాణం పంతులుకి ఆమాత్రం స్పందన కూడానా? " నిర్లక్ష్యంగా అంది సుధ.

చటుక్కున వెనుదిరిగాను. సుధకు నా పట్ల ఇంతటి వ్యతిరేకత వుందని నాకు తెలియదు. చిన్నతనంనుంచి గారాబంగా పెరగడంవల్ల వచ్చిన మంకుతనం అని అనుకున్నానేకానీ నా పట్ల ఇంతటి వ్యతిరేకత వుందని నేను ఏనాడూ ఊహించలేదు. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్య పెళ్ళి అయిన అయిదేళ్ళ తరువాత కూడా మరొకరికి భార్య కాలేదని విచారిస్తోందంటే, ఏ మగవాడికైనా అంతకంటే దురదృష్టం ఏముంటుంది? కాళ్ళు అసంకల్పితంగా పొగడచెట్టు దగ్గరకు తీసుకువెళ్ళాయి.

అక్కడ దాసుగారితో పాటు ఎవరో సేటు వాలా అట్టహాసంగా కూర్చుని వున్నాడు. ప్రక్కనే సిసింద్రీ. చాలా సేపటి నుంచి ఏదో చర్చ సాగుతున్నట్లు వాతావరణం సీరియస్‌గా వుంది. వెనక్కి తిరుగుతున్న నన్ను సిసింద్రీ చూశాడు.

"రండి మాస్టారూ" అంటూ లేచి కుర్చీ జరపడంతో అక్కడ కూర్చోక తప్పలేదు.

"మీరే తనకు గార్డియన్ అని జ్ఞానేశ్వర్ చెప్పడంతో మీతో సంప్రదించాలని ఇంత దూరం వచ్చాను. జ్ఞానేశ్వర్ మంచి భవిష్యత్తు వున్న కుర్రాడు. మా అమ్మాయినిచ్చి పెళ్లి చేసి వాళ్లిద్దరినీ పై చదువులకు అమెరికా పంపించాలని అనుకుంటున్నాను. కానీ..."

"క్షమించండి సర్, మీకిదివరకే చెప్పాను. మీ అమ్మాయిని పెళ్లి చేసుకోవడానికి నాకేమీ అభ్యంతరంలేదు. కానీ, పెళ్లి అయిన తరువాత ఆమె కూడా ఇక్కడే నాతో ప్రాక్టీసు చెయ్యాలి"

"నగరాలలోనూ, విదేశాలలోనూ పుట్టి పెరిగిన పిల్ల, ఈ పల్లెటూరిలో ఎలా వుండగలదయ్యా. గుంటూరులో వుండడానికే చాలా అవస్థ పడుతోంది. ఏదో నాలుగేళ్లు కళ్లు మూసుకుని డిగ్రీ తీసుకుని అమెరికాకు వెళ్లాలని ముళ్లమీద వున్నట్లుగా కాలక్షేపం చేస్తోంది. అలాంటిది ఈ మట్టిలోనా?" నిరసనగా అని అంతలోనే సర్దుకుని మళ్లీ అన్నాడు.

"చేజేతులా నీ భవిష్యత్తుని కాలదన్నుకోకు, మరోసారి ఆలోచించుకో. మా అమ్మాయిని పెళ్లాడి ఒక సూపర్ స్పెషలిస్టుగా జీవిస్తావో లేక ఒక అనామకుడైన పల్లెటూరి డాక్టరుగా నీ జీవితాన్ని గడుపుతావో నీ ఇష్టం. ఏదో కోరి వచ్చానని తేలిక చెయ్యకు. మా అమ్మాయి మనసుపడిందని కానీ, నీబోటివాడు మా అమ్మాయికి దొరకడు. 'కో' అంటే కోటిమంది వస్తారు"

"శుభం. ఆ కోటిమందిలో మీ అమ్మాయికి నచ్చినవాడిని, మీ స్టేటస్‌కి తగ్గవాడినీ చూసుకోండి. ఇక సెలవ్" విసురుగా రెండుచేతులూ జోడించాడు సిసింద్రీ.

"కుక్కను తీసుకుని వచ్చి కనకపు సింహాసనంమీద కూర్చోబెట్టినట్లు అయింది" విసురుగా లేచి కనీసం దాసుగారితో వెళ్లి వస్తానని కూడా అనకుండా, తన కోపాన్నంతా అడుగుల శబ్దంలో చూపిస్తూ వెళ్లిపోయాడు ఆ వ్యక్తి.

ఒక్కక్షణం ఆ పరిసరాలన్నీ నిశ్శబ్దంగా వుండిపోయాయి. చివరకు దాసుగారే ముందు తేరుకున్నారు.

"నీకు ఆ అమ్మాయిని పెళ్లిచేసుకుని అమెరికా వెళ్లాలని వుంటే తప్పకుండా వెళ్లు. నేను నీ అభివృద్ధికి అడ్డు కాదలచుకోలేదు. ఏదో మాట ఇచ్చాననే చాదస్తం పెట్టుకోకు"

"వద్దు బాబుగారూ! అంత మాట అనకండి. నేను బతికినంత కాలమూ మీ కాళ్ల దగ్గర పడి వుండవలసిన వాడిని. నేను ఈ ఊరునీ, మిమ్మల్నీ వదిలి వుండలేను బాబుగారూ" కన్నీళ్లతో దాసుగారి కాళ్లమీద పడ్డాడు.

చటుక్కున సిసింద్రీని లేవదీసి రెండుచేతులతోనూ దగ్గరకు తీసుకున్న దాసుగారి కళ్లల్లో సన్నని నీటితెర. "దేముడు నిన్ను చల్లగా చూస్తాడు బాబూ"

సిసింద్రీ వెళ్లిపోయిన తరువాత జరిగిన కథనంతా చెప్పుకువచ్చారు దాసుగారు.

సిసింద్రీ క్లాస్‌మేట్ కళ. ఫారిన్ సర్వీసెస్‌లో వున్న పెద్ద ఆఫీసర్ కూతురు. హాలెండులోనూ, అమెరికాలోనూ ఆమె బాల్యం గడిచింది. ఇండియాలో వుంటే ఢిల్లీలోనే. తండ్రికి అరబ్ కంట్రీస్ ట్రాన్స్‌ఫర్ కావడంతో కాలేజీ చదువుకి కనీసం తన వాళ్ళకైనా దగ్గర వుంటుందనే అభిప్రాయంతో గుంటూరులో చేర్పించాడు. ఇంటరు అయిన తరువాత గుంటూరు మెడికల్ కాలేజీలోనే సీటు వచ్చింది. కూతురు ద్వారానే సిసింద్రీ పరిచయం అయ్యాడు.





కూతురిని చూడడానికి వచ్చినప్పుడల్లా ఆమె క్లాసుమేటు అయిన సిసింద్రీని కూడా కలుస్తూ వుండేవాడు. కూతురు కోరుకున్న అతగాణ్ణి అల్లుణ్ణి చేసుకుని ఆ ఇద్దరినీ పై చదువులకు అమెరికా పంపించాలని ఆశించాడు. సిసింద్రీ తన సూచనను కాదంటాడేమో అనే అనుమానం కూడా అతనికి రాలేదు. తనకు పెద్ద దిక్కు దాసుగారికి చెప్పడంతో ఆయన ద్వారా అయినా అతగాణ్ణి ఒప్పించవచ్చుననే ఆశతో ఇంత దూరమూ వచ్చాడు.

మెడిసిన్‌లో చేరింది మొదలు కళకూ, సిసింద్రీకీ చదువులో పోటీ. సంవత్సరాలు గడిచేకొద్దీ ఇద్దరి మధ్యా సాన్నిహిత్యం పెరిగింది. కళను పెళ్ళిచేసుకోవడం అతగాడికి ఇష్టమే. కానీ, ఆమె తన ఊరికి రావాలి. తనతోపాటు తన ఊరివారికి వైద్యసేవలను అందించాలి.

తన ఆశయంకోసం, దాసుగారికి తాను ఇచ్చినమాటకోసం తను ఇష్టపడిన కళను దూరం చేసుకోవడానికే నిశ్చయించుకున్నాడు.

సుధకూ సిసింద్రీకీ గల బేధం కొట్టొచ్చినట్టు కనిపించింది.

★ ★ ★

కిశోర్ పెళ్ళి ఆ వేసవిలోనే జరిగింది. సహాయానికి రమ్మని అత్తగారు ఉత్తరం రాయడంతో సుధ నెలరోజుల ముందుగానే హైదరాబాద్ వెళ్ళింది. కాలేజీకి సెలవులు ఇచ్చిన వారంరోజులకే ముహూర్తం కావడంతో నేను వుండిపోయాను. పెళ్ళికి నాలుగురోజులు ముందుగానే మా ఇంటికి వస్తే ఇక్కడినుండే పెళ్ళికి తరలి వెళ్ళచ్చన్న నా సలహా మా అత్తమామలకు నచ్చింది.

పెళ్ళి తెల్లవారుఝామున కావడంతో ముందురోజు సాయంత్రమే అందరం పెళ్ళికి తరలివెళ్ళాం.

అక్కడ అడుగడుగునా ఆడబడుచు పెత్తనం చలాయిస్తూ సుధ అందరినీ హడలెత్తించింది. కాఫీ చల్లారిపోయిందనీ, టిఫిన్ బాగుండలేదనీ, ఒట్టి పల్లెటూరి మేళమనీ అడుగడుగునా ఎత్తిపొడుస్తూనే వుంది. ఏదైనా చెప్పినకొద్దీ రెచ్చిపోయే స్వభావం కావడంతో ఎవరూ తనకేమీ నచ్చచెప్పడానికి ప్రయత్నించలేదు.

చివరికి భోజనాలకు బయలుదేరే సమయానికి తనకు స్నానానికి వేడినీళ్ళు కావాలని కూర్చుంది. అప్పటికి అందరూ స్నానాలు చేసి బయలుదేరడానికి సిద్ధంగా వున్నారు. అంతవరకూ అమ్మ, అత్తగారూ స్నానానికి వెళ్ళమని ఎన్నిసార్లు చెప్పినా అదిగో, ఇదిగో అంటూ కాలక్షేపం చేసింది. పోనీ భోజనం చేసిన తరువాత చేద్దామని అనుకుందని ఊరుకున్నారు. తీరా పెళ్ళివారు భోజనాలకు పిలిచిన తరువాత అప్పుడు స్నానం చేయకుండా భోజనం ఎలా చేస్తానని ప్రారంభించింది. పోనీ త్వరగా చేసి రమ్మంటే వేడినీళ్ళు కావాలంటుంది. అదేమిటంటే, ఎంత వేసవిలోనైనా తనకు వేడినీళ్ళు పోసుకోవడమే అలవాటని భీష్మించుకుని కూర్చుంది.

చివరకు అందరమూ విసుగుపుట్టి ఆమెను వదిలి భోజనాలకు వెళ్ళిపోయాం. భోజనానికి ఆడబడుచు రాలేదని తెలుసుకున్న పెళ్ళికూతురి తల్లి అంత హడావుడిలోనూ విడిదికి వెళ్ళి ఆవిడగారి అలక తీర్చి అప్పటికప్పుడు వేడినీళ్ళు తెప్పించి ఆవిడ ముస్తాబు అయిన తరువాత దగ్గరుండి భోజనానికి తీసుకువచ్చారు.

"అయ్యో! అదేమిటి వదినగారూ! మీరింత హడావుడిలో వుండి కూడా తనకోసం వెళ్ళారా? ఏమిటో, దానికి వయసు వస్తున్నకొద్దీ చిన్న పిల్ల చేష్టలు ఎక్కువవుతున్నాయి" నొచ్చుకున్నారు అత్తగారు.

"దానిదేముందండీ. చిన్నపిల్ల కాక, అప్పుడే ముసలిదైపోయిందా ఏమిటి మీ అమ్మాయి? అయినా, పెళ్లిలో ఆడబడుచు అలిగితేనే అందం సుమండీ" చిరునవ్వుతో



సుధను బంతిలో కూర్చోబెట్టి ఆవిడ వెళ్ళిపోయారు.

"ఊ... మీ అందరికంటే ఆవిడే నయం" నిష్టూరంగా అంది సుధ.

"ఇదంతా నీ వల్లనే వచ్చింది బావా! ఆమాత్రం భార్యను కంట్రోలు చేయలేవూ? " నామీద చిరచిరలాడాడు కిశోర్.

"అబ్బో! నువ్వు మీ ఆవిడను ఎంత కంట్రోలు చేస్తావో నేను చూస్తానులే" వెక్కిరిస్తున్నట్లే అంది సుధ.

"తల్లీ! నీ అంత..." కిశోర్ మాటలకు మధ్యలోనే అడ్డుపడ్డారు అత్తగారు.

"కిశోర్! ఏమిటిది? దానితోపాటు నీకు కూడా మతిపోతోందా? ఛ... ఏం పిల్లలో? పెళ్ళివారి ఇల్లు అన్న ఆలోచన కూడా లేదు. బొత్తిగా మంచీమర్యాదా తెలియకుండా పోతోంది" విరక్తిగా అన్నారు. సుధ ప్రవర్తన ఆమె మనసును ఎంత గాయపరిచిందో అర్థమౌతూనే వుంది. కానీ ఏం చేయగలం?

"అదేమిటి శ్యామూ! ఇంత చిన్న విషయానికి ఎందుకు అనవసరంగా బాధపడుతున్నావు? ఏదో చిన్న పిల్లలు" సర్దిచెప్పింది అమ్మ.

"ఆ... నువ్వూ, మీ అబ్బాయీ ఇలా సర్దుకుపోబట్టే మా అమ్మాయికి మంచీ చెడూ తెలియకుండా పోతోంది"

"చూశావా బావా! అమ్మ నన్ను తిట్టింది కానీ, ఇప్పుడు మళ్ళీ తనూ ఇదేమాట అంటోంది" నా చెవిలో గొణిగాడు కిశోర్.

"ఇక చాలు, ముందు భోజనాలు కానివ్వండి" నాన్నగారి మాటలతో అందరమూ మౌనం వహించాం.

★ ★ ★

పెళ్ళి వైభవంగా జరిగింది.

పెళ్ళికూతురిని తీసుకుని బయలుదేరాం. బయలుదేరే సమయంలో కిశోర్ అత్తగారు ఆడవారికందరికీ చీరలు పెట్టారు.

"ఛ! ఇదేం చీర? ఇదేం రంగు? ఒట్టి పల్లెటూరి టేస్ట్" అని అందరిలోనూ ఆ చీరను విసిరికొట్టింది సుధ.

"పోనీ, మా అమ్మాయి చీరల్లో నీకు నచ్చింది తీసుకోమ్మా" అంటూ పెళ్ళికూతురి సూటుకేసులను లోపలకు తెప్పించి సుధను లోపలకు తీసుకువెళ్ళారు ఆవిడ.

పది నిమిషాలలో సంతోషంగా ఒక చీర చేత్తో తీసుకుని బయటకు వచ్చింది సుధ. ఆ చీరను చూసి ఉలిక్కిపడింది పెళ్ళికూతురు. కానీ తల్లి కళ్ళల్లో ఏ సందేశం కనిపించిందో ఏమీ మాట్లాడకుండా తల వంచుకుంది.

ఆ చీర చూస్తూనే మా అత్తగారి మొహం ఒక్క క్షణం నల్లబడింది.

"చూడు! ఆవేళ నాకు కూడా ఇటువంటి చీరనే కొనమంటే వీల్లేదన్నావు. ఇప్పుడేం చేస్తావు? " సగర్వంగా అంటూ టాక్సీ ఎక్కి కూర్చుంది సుధ.

మా అత్తగారు తిన్నగా కిశోర్ అత్తగారి దగ్గరికెళ్ళి ఆమె రెండుచేతులూ పట్టుకున్నారు. "అయాం సారీ! మీకు చెప్పగలిగినదానిని కాదు. కానీ ఇలా ప్రతి విషయంలోనూ సర్దుకుపోవడం ప్రారంభిస్తే, తరువాత చాలా సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది" చటుక్కున మొహం తిప్పుకుని వెళ్ళి ఇంకో టాక్సీ ఎక్కి కూర్చున్నారు.

రైల్లో అందరూ నిద్రపోయిన తరువాత మెల్లిగా చెప్పింది అమ్మ. 'పెళ్ళికూతురికి చీరలు కొంటున్నప్పుడే తనకు కూడా అలాంటి చీరే కావాలని పేచీ పెట్టిందట సుధ. కానీ పెళ్ళికూతురికి ఖరీదైన చీర పెట్టకపోతే బాగుండదనీ, అలాంటి చీర మరొకటి కొనడానికి తమ ఆర్థికపరిస్థితి బాగుండలేదని చెప్పి అయిదువేలు పెట్టి సుధకు చీర తీశారట. అమ్మ పక్కనే వున్నదనే జ్ఞానం కూడా లేకుండా "నాకూ పెట్టారు మా అత్తగారు ముష్టిచీరలు' అని అందట. ఆ విషయం చెబుతూ అమ్మ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది.





"ఏమిటో, ఈ పిల్ల ధోరణి విపరీతంగా వుంది. స్నేహితురాలికి సహాయం చేద్దామనుకుని నీ బతుకు బండలు చేశాను"

నిజానికి నాకూ చాలా విసుగ్గానే వుంది. కానీ తెంపుకుంటే తెగే బంధమా వివాహ బంధం?

ఏం చేయాలి? ఆమెను ఎలా మార్చాలి?

"నువ్వు మాత్రం తొందరపడకు సుమా. దాని కడుపున ఒక కాయ కాస్తే అదే మారుతుంది" అమ్మ మాట ఓదార్పుగా వినిపించింది.

మా అత్తగారు ఏమనుకున్నారోకానీ, పెళ్ళి హడావుడి తగ్గిన తరువాత ఇల్లు కోడలికి అప్పచెప్పి మా ఇంటికి వచ్చి నెలరోజులు వున్నారు. ఆమె ఏం చెప్పారో కానీ, సూటిపోటి మాటలు తగ్గించింది కానీ, ఆమెలో నిరాసక్తత పెరుగుతూనే వుంది. కానీ నేను చేయగలిగింది ఏముందీ?

★ ★ ★

ఆరోజు సిసింద్రీ హాస్పిటల్ ఓపెనింగ్.

హాస్పిటల్ ఓపెనింగ్ దాసుగారి చేత చేయిద్దామని అన్నాడుకానీ, ఆయన ఒప్పుకోలేదు. చదువు నేర్పిన ప్రొఫెసర్స్ చేస్తే దానికి నిండుతనం వస్తుందని అనడంతో, హాస్పిటల్ ఓపెనింగ్ మెడిసిన్ ప్రొఫెసర్‌తోనూ, ఆపరేషన్ థియేటర్ సర్జరీ ప్రొఫెసర్‌తోనూ చేయిస్తే బాగుంటుందని నిర్ణయించాం. మీటింగుకి దాసుగారు అధ్యక్షత వహించాలన్న సిసింద్రీ కోరికను దాసుగారు కాదనలేకపోయారు.

సరిగ్గా ప్రారంభోత్సవం సమయానికి నర్సింగ్‌హోం ముందు కారు దిగుతున్నందుల బలరామయ్యగారిని చూసి సంభ్రమాశ్చర్యాలతో పరుగున కారు దగ్గరకు వెళ్ళాం నేనూ, సిసింద్రీ.

"కంగ్రాట్స్ జ్ఞానేశ్వర్. ఇక్కడ ఇంత ఉత్సవం జరుగుతుంటే రాకుండా వుండలేక పోయానయ్యా" నవ్వుతూ అంటున్న బలరామయ్యగారికి అక్కడే పాదాభివందనం చేశాడు సిసింద్రీ.

"చూడు! వినయం మంచిదేకానీ, ఇలా ఎక్కడ పడితే అక్కడ, ఎవరి కాళ్ళమీద పడితే వారి కాళ్ళమీద పడిపోవడం మంచి దికాదయ్యా"

బలరామయ్యగారి ఆశీస్సులకోసం ఇన్విటేషన్ పంపించాడు కానీ, నిజంగా ఆయన ఈ వయసులో ఫంక్షన్‌కి వస్తారని మేమెవరమూ ఊహించలేదు.

ఎటూ బలరామయ్యగారి వచ్చారు కాబట్టి ఆయన అధ్యక్షతన మీటింగ్ జరిగితే బాగుంటుందని దాసుగారు అన్నారు, కానీ బలరామయ్యగారు సున్నితంగా తిరస్కరించారు.

"తొంభైయేళ్ళు దాటిన వాడిని ఎందుకయ్యా నన్ను ఇబ్బందిపెడతావు? ఈ వయసులో స్టేజిమీదకు మోసుకువెళ్ళాలి. ఎందుకు కానీ స్టేజి ఎదురుగా కూర్చుని హాయిగా చూస్తాను. మీ కార్యక్రమం యథావిధిగా కానివ్వండి" అన్నారు.

మీటింగ్ ప్రారంభమైన తరువాత ఎంత చెప్పినా వినకుండా నన్ను కూడా స్టేజి ఎక్కించారు. ప్రొఫెసర్‌గారు తమ ఉపన్యాసంలో దాసుగారితోపాటు నన్నూ పొగుడుతూ వుంటే చాలా మొహమాటం వేసింది. ఇదంతా దాసుగారి చలువ. నేనే అయితే సిసింద్రీకి అక్షరజ్ఞానం కలిగించడంతో సంతృప్తి చెంది వుండేవాడిని. కాదంటే డిగ్రీ చేసి ఏ గుమస్తాగానో వుండి పోయేవాడు.

ఫంక్షన్ అయిన తరువాత బలరామయ్యగారి కారుని వెనక్కి పంపించేసి తన కారులో ఎక్కించుకుని తీసుకుని వెళ్ళారు ప్రొఫెసర్‌గారు. ప్రస్తుతం ఆయన కాకినాడ మెడికల్ కాలేజీకి ప్రిన్సిపాల్‌గా వున్నారు.

హాస్పిటల్‌కి చుట్టుపక్కల గ్రామాల నుండి వచ్చేవారికి కూడా వీలుగా వుంటుందని బస్టాప్ దగ్గర కొత్తగా కట్టిన ఇల్లు అద్దెకు తీసుకుని నర్సింగ్‌హోం పెట్టడానికి

అనువుగా మార్పులు చేయించాడు సిసింద్రీ.

ఫంక్షన్ హడావుడి అయిపోయిన తరువాత బయట గేటు దగ్గరకు వచ్చేసరికి ఎదురుగా కనిపించింది పాక హోటల్ 'న్యూ అలంకార్'.

"మీరు ఈ ఊళ్లో దిగిన మొదటిరోజు గుర్తుకు వస్తోందా మాస్టారూ!" వెనుక నుండి సిసింద్రీ మాట వినిపించేసరికి చటుక్కున వెనక్కి తిరిగి చూశాను. చిరునవ్వుతో డాక్టర్ జ్ఞానేశ్వర్.

గతాన్ని మరచిపోని మనిషికి ఎప్పుడూ ఉజ్వలమైన భవిష్యత్తు వుంటుంది.

"కంగ్రాట్స్! నిజంగా యువతరం నిన్ను ఆదర్శంగా తీసుకోవాలి"

"ఇదంతా మీరు పెట్టిన భిక్షేగా మాస్టారూ! నిజంగా ఆనాడు మీరు ప్రోత్సహించి వుండకపోతే నేను ఇంకా ఆ హోటల్లో గ్లాసులు కడుగుతూ వుండేవాడిని. కాదంటే సర్వర్‌గా ప్రమోషన్ ఇచ్చి వుండే వారనుకోండి" మెల్లిగా నవ్వాడు.

"నేను చేసిందేముంది? నిజంగా దాసుగారి ఆదరణ లభించడం నీ అదృష్టం"

"బాబుగారి ఋణం తీర్చుకోగలిగింది కాదు. వారి ఆశ్రయం కూడా మీవల్లనే దొరికిందనే విషయాన్ని మరచిపోలేను మాస్టారూ!"

"మల్లెతీగ ఏ ఆలంబన దొరికినా అందుకుని పైకి ప్రాకుతుంది. సువాసనలను పక్కవారికి అందరికీ అందిస్తుంది. అంత మాత్రాన ఆ వెదురుబద్దకో, లేక వైరుకో కృతజ్ఞత చెప్పవలసిన అవసరం ఆ మల్లెతీగకు లేదు. కానీ చెప్పడం తన సంస్కారం' ' మా మాటలను ఎప్పటినుంచి వింటున్నారో కానీ దాసుగారు లోపలినుండి వచ్చి మాతో మాటలు కలిపారు.

ఇంతలోనే సిసింద్రీ తండ్రి లోపలనుండి వచ్చి చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

"డాక్టరుగారి తండ్రివయ్యావు. ఈ రోజు నాకు చాలా సంతోషంగా వుంది నాగన్నా! ఇక మీ వాడికి పెళ్లి కూడా చేసేస్తే నీకు బాధ్యత తీరిపోతుంది" మాట కలిపారు దాసుగారు.

"ఈ మొండోడు మా మాట చెవిన బెడతాడా బాబయ్యా! ఆమధ్య ఎవరో పెద్దాయన వచ్చి పిల్లనిచ్చి ఎక్కడికో పంపుతానంటే కాదన్నాడా? మొన్నీమధ్య ఎవరో పెద్ద ఇంజనీరట బాబూ! ఆ పిల్ల కూడా ఏవో పెద్ద చదువులే చదివిందంట. ఆయన వచ్చి పిల్లనిస్తానంటే వీల్లేదని మొండికేసి కూర్చున్నాడు. కాస్త మీరైనా చెప్పండి బాబయ్యా"

"అటువంటి అమ్మాయిని చేసుకుంటే నేను వాళ్లకు అల్లుడినవుతానే కానీ ఆ వచ్చే అమ్మాయి మా ఇంటి కోడలు కాలేదనే ఆలోచనే మా నాన్నకు లేదు బాబుగారూ! మీ దయవల్ల నేను అభివృద్ధిలోకి వచ్చాను. ఇకనైనా నేను మా కుటుంబాన్ని వృద్ధిలోకి తీసుకు రావాలిగా బాబూ! మా అన్నదమ్ముల పిల్లల్ని చదివించాలి"

ఆమధ్య ఎప్పుడో మాటల మధ్య దాసుగారు అన్న మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. మనవాళ్లు రిజర్వేషన్స్ విషయంలో ఒక విషయాన్ని మరచిపోతూ వుంటారు. ప్రభుత్వం రిజర్వేషన్స్ కల్పించి వుండవచ్చు వాళ్లకు స్కాలర్‌షిప్పులు ఈయవచ్చు కానీ ఒక యువకుడు డాక్టరో, ఇంజనీరో కావాలంటే ఆ ఇంటిల్లపాదీ కడుపు కట్టుకుని అతనిని చదివించవలసి వస్తుంది. తీరా అతగాడు చదువుకుని ఉద్యోగస్తుడైన తరువాత ఆ కులంలోని ఏ పెద్ద ఆఫీసర్ కూతురినో పెళ్లి చేసుకుని తన కుటుంబానికి దూరమైపోతాడు. అంతే కానీ తన కోసం కష్టపడిన తన అన్నల కుటుంబాన్ని పైకి తీసుకుని రావాలన్న బాధ్యత తనదేనని అనుకోడు. నిజంగా సిసింద్రీ దాసుగారి మానసపుత్రుడు.

"ఇదీ వరస బాబూ! అటువంటి పిల్లల్ని





ఇస్తామంటే కాదని ఏ దిక్కూ లేని ఆ సరస్వతిని పెళ్లాడతానని కూర్చున్నాడు"

"కొండంత మామవు నువ్వుండగా సరస్వతి దిక్కులేనిదెలాగవుతుంది నాన్నా!" విసుగ్గా అన్నాడు సిసింద్రీ.

సరస్వతి చిన్నప్పుడే తల్లీతండ్రీ చనిపోతే నాగన్న పంచన చేరింది. సిసింద్రీ ప్రోత్సాహంతో స్కూల్లో చేరింది. ఇంటిపని చూసుకోవడం, హాస్టల్లో ప్రభుత్వం వారు స్కాలర్‌షిప్పులు ఇవ్వడంతో నాగన్నకు పెద్దగా అభ్యంతరం లేకపోయింది. గత సంవత్సరమే నర్సు ట్రైనింగుకి వెళ్లింది. ఆమెను నర్సు ట్రైనింగుకి పంపించడంలో సిసింద్రీ ఉద్దేశ్యం ఇదన్నమాట.

"దేముడు మెచ్చే పని చేస్తున్నావు బాబూ! ఆ పిల్ల జీవితమూ బాగుపడుతుంది. ఇటు మన ఊరికీ నీ నర్సింగ్‌హోమ్‌కీ నర్సు లేని కొరతా తీరుతుంది. శుభం! నాగన్నా! ఆ శుభకార్యం కూడా తొందరగా కానియ్యవయ్యా!" దాసుగారి మాటలను మధ్యలోనే అడ్డుకున్నాడు సిసింద్రీ.

"ముందు ఆవిడ చదువు పూర్తి కావాలిగా బాబుగారూ"

★ ★ ★

దాసుగారి కొడుకు సకుటుంబంగా ఇండియా వస్తున్నట్లూ, అందులో ఒక వారం ఈ ఊళ్లో ఉండబోతున్నట్లు ఫోను వచ్చింది. దాసుగారికీ, రుక్మిణమ్మగారికీ సంతోషానికి అవధులులేవు. వారికోసం ఇల్లు కొత్తగా ముస్తాబు అవుతోంది. దాసుగారికి అనుక్షణమూ మనుమల ధ్యాసే. ఇక రుక్మిణమ్మగారి సంగతి చెప్పనే అవసరం లేదు. ఇంటి పనులతోనూ, వారికి ఇష్టమైన పిండి వంటలు తయారు చేయించడంతోనూ బిజీగా వున్నారు.

వారు ఇంటి ముందు కారు దిగిన క్షణం ఆ దంపతులకు పండుగే. నడి వయసులో వున్న ఆ దంపతులు కారు దిగుతూనే దాసుగారికీ, రుక్మిణమ్మగారికీ పాదాభివందనం చేశారు. వారి అడుగుజాడల్లోనే వారి పిల్లలూ తమ పాదాలకు నమస్కారం చేయడంతో ఇక ఆ పెద్దవాళ్ల ఆనందానికి అవధులులేవు.

అమ్మాయికి పెళ్లి కుదిరిందట. పెళ్లి కొడుకు అమెరికాలో బోసుగారి స్నేహితుడి కొడుకే. అందరికీ అనుకూలంగా వుంటుందని హైదరాబాదులో పెట్టారు. వారం రోజులు వుండి పెళ్లికి నాలుగు రోజులు ముందుగా రమ్మని తల్లిదండ్రులకు చెప్పి పనిలో పనిగా మా దంపతులను కూడా పెళ్లికి రమ్మని ఆహ్వానించారు.

వాళ్లు వున్న నాలుగు రోజులూ ఇల్లంతా కళకళలాడిపోయింది. పండుగ వాతావరణం కనిపించింది. బోసుగారు కూడా ఫ్రీగా కలసిపోయే మనిషి. సంస్కారవంతుడు. ఆయన కొడుకు రవీ, నేనూ చాలా తొందరలోనే స్నేహితులమయ్యాం. ఆ వున్న వారం రోజులలోనూ నాతోపాటు లైబ్రరీకీ, యువ రక్షా సమితి కార్యక్రమాలకీ చాలా ఉత్సాహంగా వచ్చాడు. అవును మరి, ఎంతైనా దాసుగారి వారసులుకదా, ఆ సంస్కారం ఎక్కడకు పోతుంది?

కానీ ఎందుకో సుధకు బోసుగారి భార్య నచ్చలేదు. ఆమెకు అమెరికా నుంచి వచ్చాననే గర్వమనీ, పల్లెటూళ్ల వాళ్లు నచ్చరనీ గొణుగుతూనే వుంది. చివరికి ఒక రోజు ఉక్రోషం ఆపుకోలేక "ఆయన తన కొడుకుని హాయిగా అమెరికా పంపించి అందలమెక్కించారు. మీ అమాయకత్వాన్ని అలుసుగా తీసుకుని ఈ ఊళ్లో కట్టి పడేశారు" అని దాసుగారిని నిందించే వరకూ వెళ్లింది.

మాటకు మాట పెరిగితే ఈ విషయం వారికి ఎక్కడ వినిపిస్తుందోనని నేను నోరు మూసుకోక తప్పలేదు. కొడుకు తన ఊరిలో ప్రాక్టీసు పెట్టకుండా అమెరికా వెళ్లినందుకు ఆయనెంతగా బాధపడ్డారో నాకు తెలిసినట్లుగా సుధకు తెలియదు. కనీసం ఆ విషయం చెప్పినా ఆమె వినిపించుకోలేదు.



పెళ్లి పది రోజులుందనగా దాసుగారికి హైదరాబాదు నుండి ఫోను వచ్చింది. అను కోకుండా కొడుక్కి కూడా సంబంధం కుదిరిం దనీ రెండు పెళ్లిళ్లూ ఒకేసారి జరగాలని అనుకోవడంతో అమ్మాయి పెళ్లి నాలుగు రోజులు ముందుకి మార్చవలసి వచ్చిందనీ, అందుకని వెంటనే బయలుదేరి రమ్మనీ ఫోను. అయితే అన్నీ సర్దుకుని టికెట్స్ దొరి కేసరికి పెళ్లిరోజు రానే వచ్చింది. అందువల్ల అందరమూ కలిసే బయలుదేరాం.

కొడుకు పెళ్లి అన్నాడేకానీ పెళ్లికూతురి వివరాలు చెప్పనందుకు దారి పొడువునా రుక్మిణమ్మగారు విసుక్కుంటూనే వున్నారు.

"నీ సలహా కావలసి వస్తే అప్పుడు నీకు వివరాలు చెబుతారు. వాళ్లంత వాళ్లు నిర్ణ యించుకున్న సంబంధాలు. నీకు వివరాలు చెప్పవలసిన అవసరం వారికి లేదు. పెళ్లికి వెళ్లి నాలుగు అక్షింతలు వేసి రావడమే నీ బాధ్యత. అంతకుమించి నీ సహాయ సహ కారాలు వారికి అవసరంలేదు. ఆ విషయం మరచిపోకు" దాసుగారు గంభీరంగా అన్న మాటల్లోనే ఆయన మనసు గాయపడిన ట్లుగా అర్థమౌతూనే వుంది.

"ఒక్కగానొక్క కొడుకు. వాడి పిల్లల పెళ్లిళ్ల గురించి తెలుసుకోవాలని వుండదా?" కళ్లు ఒత్తుకున్నారు రుక్మిణమ్మగారు.

★ ★ ★

ఉదయం రైలు దిగేసరికి బోసు ఫ్లాట్ ఫారం మీద కనిపించారు. నేను మావా ళ్లను చూసి రాత్రి ముహూర్తం టైముకి వస్తానని అన్నాను. కానీ లంచ్ టైముకే రమ్మని బోసు పట్టుబట్టడంతో ఇంటికి వెళ్లి అందరినీ పలకరించి మళ్లీ కళ్యాణమం డపం దగ్గరకు వచ్చాం నేనూ, సుధా!

కళ్యాణ మండపం అప్పటికే కిక్కిరిసి పోయి వుంది. అవును మరి రెండు పెళ్లిళ్లు కదా! దాసుగారి గురించి ఎవరిని అడగాలా అని ఆలోచిస్తూ వుండగా వెనక నుండి మాట వినిపించింది.

"ఏమయ్యా పంతులూ! దాసుకి దత్తపు త్రుడివికదా! ఇంకా రాలేదేమిటా అని చూస్తున్నాను" వెనక్కి తిరిగాను. నన్ను పలకరిస్తున్న వ్యక్తి భుజంగరావుగారు. ఈ పెళ్లిలో భుజంగరావుగారు కనపడడం విచి త్రమే. బహుశా మగపెళ్లివారి తరఫున వచ్చారేమో? ఎవరి తరఫున వచ్చినా నన్ను అంత సాదరంగా పలకరించడం విచిత్రమే.

"ఊ! ఇంతకూ ఎలా సాగుతున్నాయి నీ సంక్షేమ కార్యక్రమాలు? ఈసారి ఎలక్ష న్స్‌లో నిలబడుతున్నావా? నువ్వు నిలబ డితే గెలవడం కష్టం కాదనుకో! అయినా రాజకీయాల్లోకి వచ్చే ఉద్దేశ్యం లేకపోతే అంత కష్టపడి ప్రయోజనమేమిటి? అవునూ ఇంతకీ ఈ అమ్మాయి ఎవరు?" సుధను భుజంగరావుగారికి పరిచయం చేశాను.

"మీ ఆయన చాలా అసాధ్యుడమ్మాయ్! అయినా ఆ విషయం ఇప్పటికే గ్రహించి వుంటావనుకో"

ఇంకా భుజంగరావుగారి దగ్గరే వుంటే ఆయనేం మాట్లాడతారోనని దాసుగారి గురించి ఆయననే అడిగాను.

"అప్పుడే దాసు గురించి బెంగ పెట్టుకు న్నావేమిటోయ్! చూశావా అమ్మాయ్! ఇదీ వరస. ఆ దాసుని ఒక్క క్షణం వదిలి పెట్ట డనుకో! ఇతనితో ఎలా వేగుతున్నావో ఏమిటో?" సుధ అపార్థం చేసుకుంటే నా గతి ఇక అంతే.

"సరేలే! దాసుకంటే ముందు నువ్వు కలు సుకోవలసిన వారు ఇంకా వున్నారు" నిజమే! ముందు బోసుగారినీ, ఆయన భార్యనూ పలకరించడం మర్యాద.

"ఇదిగో! ఈ అమ్మాయి తీసుకు వెడు తుంది వెళ్లండి" అంటూ అటుగా వచ్చిన యువతిని పిలిచి మమ్మల్ని లోపలకు తీసుకు వెళ్లమన్నారు.

తీరా ఆ అమ్మాయి తీసుకు వచ్చిన గదిలో పెళ్లికూతురి వేషంలో వున్నది




రంజని. అంటే దాసుగారి మనమడు రవికి కాబోయే భార్య రంజనే అన్నమాట. అందు కేనా పెళ్లికూతురి వివరాలు దాసుగారికి తెలియనీయలేదు? ఉత్తర దక్షిణ ధృవా ల్లాంటి దాసుగారికీ, భుజంగరావుగారికీ మధ్య ఈ బంధమేమిటో? దాసుగారి రియాక్షన్ ఎలా వుందో?

"ఏమిటి మాస్టారూ! ఆలోచిస్తున్నారు? నేను మీకు కృతజ్ఞతలు తెలియజేయాలనే ముందుగా ఇక్కడికి తీసుకు రమ్మన్నాను" అంటూ ఒక అమ్మాయిని పిలిచింది.

ఆ అమ్మాయి తీసుకు వచ్చిన ట్రేను అందుకుని నా దగ్గరకు వచ్చింది. ట్రేలో బట్టలతోపాటు పళ్లూ, తాంబూలంతో పాటుగా వంద రూపాయల నోట్ల కట్ట.

"నేను అమాయకత్వంతో మీ వెంటప డినా మీరు మీ స్థానమేమిటో గ్రహించుకుని నన్ను పెళ్లి చేసుకోవడానికి నిరాకరించి నాకు చాలా మేలు చేశారు మాస్టారూ! అందువల్లే ఈనాడు మా స్థాయికి తగిన రవిని పెళ్లి చేసుకుని అమెరికా వెళ్లే అవ కాశం వచ్చింది. అందుకు నేను కృతజ్ఞతా పూర్వకంగా మీకు సమర్పిస్తున్న గురుదక్షిణ మాస్టారూ! స్వీకరించండి"

"క్షమించు రంజనీ! అయాచితంగా లభించే వేటినీ నేను స్వీకరించననే విషయం నీకు తెలుసుగా రంజనీ! ఇదే నేను నీకు ఇస్తున్న కానుకగా స్వీకరించు. నా ఆశీస్సులు నీకు ఎప్పుడూ వుంటాయి"

"ఏమిటో మాస్టారూ! ఇప్పటికీ మీలో మార్పు రాలేదన్న మాట. అవునూ! ఈవిడ మీ భార్యా? ప్చ్ నన్ను కాదని మరో అమ్మాయి మెడలో మూడు ముళ్లూ వేశా రంటే ఎవరో మేనకో, తిలోత్తమో అయి వుంటుందనుకున్నాను. కానీ మీ టేస్టు ఏమంత గొప్పగా లేదు మాస్టారూ! సరే లెండి, తావలచింది రంభ. కనీసం మీ ఆవి డైనా కాస్త తెలివిగా వుంటారేమో చూద్దాం" అంటూ ఆ అమ్మాయి తీసుకు వచ్చిన మరో ట్రే తీసుకుని సుధ దగ్గరకు వెళ్లింది.

"మా మాస్టారు మిమ్మల్ని కానీ కట్నం లేకుండా పెళ్లాడారని విన్నాను. బహుశా ఏ పేద ఇంటి పిల్లను పెళ్లాడారో పెళ్లికి ఎక్కడ చవకబారు చీరతో వచ్చి మా పరు వును మంటగలుపుతారోననే భయంతో మీకు పదివేలు పెట్టి ఈ చీర తెప్పించాను. తీరా చూస్తే ఫరవాలేదు. మీరు కట్టుకున్న చీర కూడా బాగానే వుంది. అయినా డిన్న ర్‌కీ, పెళ్లికీ ఒకే చీర కట్టుకుంటే మావాళ్లల్లో నాకు చిన్నతనంగా వుంటుంది. అందువల్ల ఈ చీర పెళ్లి టైములో కట్టుకోండి"

"ముష్టి పదివేలేమిటి? నేను కట్టుకున్న చీర పదిహేను వేలు ఖరీదు చేసేది. బహుశా నువ్వు కట్టుకున్న చీర అంత ఖరీదు చేయదనుకుంటాను. పెళ్లికూతురు తక్కువ ఖరీదు చీర కట్టుకుంటే బాగుండదు. పోనీ నా చీర విప్పి ఇస్తాను కట్టుకో" వ్యంగ్యంగా నవ్వుతూ అంది సుధ.

ఇక అక్కడ వుండవలసిన అవసరం కని పించలేదు. సుధ రెచ్చిపోకపోవడం విచి త్రమే. రంజనికి శుభాకాంక్షలు తెలియజేసి సుధను తీసుకుని బయటకు వచ్చేశాను. ఒక గదిలో దాసుగారిని చూసి ఆ గదిలోకి నడిచాను. దాసుగారు చాలా గంభీరంగా వున్నారు. రుక్మిణమ్మగారి కళ్లు ఎర్రబడి వున్నాయి.

"ఏమిటి అలా వున్నారు? పెళ్లికూతురు ఎవరో తెలిసిందేమిటి? " పలకరించారు దాసుగారు.

"ఇప్పుడు అక్కడ నుండే వస్తున్నాం" అంటూ జరిగినదంతా చెప్పాను.

"ఏమిటో భుజంగరావు మనస్తత్వం ఏమిటో అర్థం కావడంలేదు. అందరమూ మరచిపోయిన దానిని అందులోనూ ఏమీ జరగని దానిని ఎందుకు కెలుకుతున్నాడో అర్థం కావడంలేదు. సరే! మీరు మాత్రం ఈ విషయాన్ని ఇంతటితో వదిలేయండి"

మేము వదిలేసినా భుజంగరావు వదిలే



టట్లు లేరు. ఏదో ఒక వంకతో దాసుగారి చుట్టూ తిరుగుతూనే వున్నారు. ఏవేవో సూటిపోటి మాటలు అంటూనే వున్నారు.

అయితే భుజంగరావు అంటే ఏమిటో ఊరికి తిరిగి వచ్చిన తరువాత కానీ అర్థం కాలేదు.

దాసుగారి కొడుకు తన వాటా అంతా అమ్మేశాడనీ, అది భుజంగరావు కొనుక్కున్నారని పిడుగులాంటి వార్త వచ్చింది. అసలు రిజిస్ట్రేషన్ ఎప్పుడు జరిగింది? పెళ్లి అయిన తరువాత దాసుగారు అక్కడ వుండగానే ఇద్దరూ ఇక్కడకు వచ్చి రిజిస్ట్రేషన్ చేయించుకున్నారట. ఆ విషయం కూడా దాసుగారికి తెలియదు.

"ఆస్తి అమ్ముకోవలసిన అవసరం ఏమొచ్చిందండీ" అంటూ కంటతడి పెట్టారు రుక్మిణమ్మగారు. సమాధానం చెప్పవలసిన కొడుకు అప్పటికే విమానంలో వున్నాడు.

"తన ఆస్తి తను అమ్ముకున్నాడు. నీకు ఆ ఆస్తి అవసరంలేదుగా! అయినా భుజంగరావుకి మాత్రం ఇంకెవరున్నారు? వాళ్ల ఇష్టం వచ్చినట్టు చేసుకోనియ్"

రాగానే తల్లిదండ్రులకు సకుటుంబంగా పాదాభివందనం చేసిన వ్యక్తి ఆస్తి అమ్మకం లాంటి ముఖ్యమైన విషయంలో తండ్రిని సంప్రదించకపోవడం ఏమిటో విచిత్రంగానే వుంది.

అయినా ఒక విషయం నాకు సంతోషాన్ని కలిగించింది. అంతవరకూ రంజని పేరు చెప్పి సూటిపోటి మాటలు అనే సుధ ఆ పెళ్లి తరువాత రంజని ప్రసక్తి తీసుకురావడం మానేసింది.

★ ★ ★

సిసింద్రీ ప్రాక్టీసు పెట్టిన తరువాత యువ రక్షా సమితి నిర్వహిస్తున్న ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించే బాధ్యతను తను తీసుకున్నాడు. సిసింద్రీ చదువుకుని ప్రయోజకుడు కావడంతో అతని గూడెంలో వాళ్లకు కూడా చదువు మీద శ్రద్ధ పెరిగింది. దాసుగారు కాలేజీలో వాళ్లకు స్కాలర్‌షిప్పులు ఏర్పాటు చేశారు. సుధ వచ్చిన దగ్గర నుండి దాసు గారు ప్రత్యేకంగా గదులు వేసి ఇచ్చినా ఎంత చెప్పినా అద్దె మాత్రం తీసుకోవడం లేదు. దానితో అప్పటి నుంచీ నెలకు అయిదు వందల చొప్పున బ్యాంకులో వేస్తూ వచ్చాను. ఆ డబ్బు కూడా కాలేజీకి డొనేట్ చేసి మరి కొంతమందికి స్కాలర్‌షిప్పులు ఏర్పాటు చేశాం. సిసింద్రీ కూడా తనకు వచ్చే ఆదాయంలో పది శాతం వేరే వుంచి, ఆ డబ్బుతో మందులు కొని తనకు వచ్చిన శాంపుల్స్‌తోపాటు ఉచిత వైద్య శిబిరానికి ఉపయోగించేవాడు.

సరస్వతి నర్స్‌కోర్సు పూర్తి చేసుకుని వచ్చిన తరువాత ఆమెను పెళ్లి చేసుకుని గూడెంలోనే కాపురం పెట్టాడు సిసింద్రీ. ఆమె కూడా అతనికి తగిన భార్య. భార్యాభర్తలిద్దరూ హాస్పిటల్ పని అయిన తరువాత గూడెంలో వారికి పరిశుభ్రత గురించీ పొదుపు ఉద్యమాల గురించీ తెలియజేసేవారు. సిసింద్రీ యువరక్షా సమితి యాక్టివిటీస్‌లో తల మునకలవుతుంటే, సరస్వతి గూడెంలోని పిల్లలకు చదువు చెప్పడంలో నిమగ్నమయ్యేది.

సిసింద్రీ అన్నదమ్ముల పిల్లలు హైస్కూలు చదువులలోకి వచ్చారు.

★ ★ ★

మానవ మనస్తత్వం విచిత్రమైంది. అకారణంగానే మనసు చివుక్కుమని ఎదుటివారి పట్ల కార్పణ్యాన్ని పెంచుకుంటాం. ఊరు మారింది, మనుషులు మారారని నేను అనుకుంటున్న సమయంలో జరిగిన రెండు సంఘటనలు నన్ను కలవరపరిచాయి.

ప్రిన్సిపాల్ సౌజన్యారావుగారు రిటైర్ అయిన తరువాత అప్పుడే కొత్తగా గవర్నమెంట్ కాలేజీలో రిటైర్ అయిన కులశేఖర రావుగారు ప్రిన్సిపాల్‌గా వచ్చారు. మనిషి చాలా సౌమ్యుడు. ఒక రకంగా చెప్పాలంటే కొంచెం మెతక మనిషి. ప్రతీ చిన్న విష



యానికీ కంగారుపడిపోయేవారు. నేను దాసుగారి ఇంటిలో అద్దెకు వుండడమూ, దాసుగారికి సన్నిహితంగా వుండడంవల్ల కాబోలు ఏ సమస్య వచ్చినా ముందు నాకు కబురు పెట్టేవారు.

యూనివర్శిటీ ఎగ్జామ్స్ జరుగుతున్నాయి. ఆ రోజు ఎగ్జామినేషన్ హాల్లో వున్న నన్ను అర్జంటుగా తన గదికి రమ్మని కబురు చేశారు ఆయన. సరే రెండో వాచర్‌కి చెప్పి బయలుదేరాను.

ఆయన గదిలో ఇద్దరు అమ్మాయిలు వకుళ, సరోజ ఆయన టేబుల్ దగ్గర నిల బడి వున్నారు. ఇద్దరూ బి.ఎ ఫైనలియర్ స్టూడెంట్స్. ఏం జరిగిందో తెలియదు కానీ సరోజ భోరుభోరుమని ఏడుస్తోంది. రెండో అమ్మాయి వకుళ నిర్లక్ష్యంగా నిలబడి చూస్తోంది.

"ప్లీజ్! ఏడవకమ్మా" అని బతిమాలుతు న్నారు ప్రిన్సిపాల్‌గారు.

"ఏం జరిగింది?" అని నేను అడిగిన దానికి ప్రిన్సిపాల్‌గారు చెప్పిన సమాధానం విని ఆశ్చర్యపోయాను.

"ఇదిగో ఈ అమ్మాయి పేపరులోంచి ఈ పిల్ల కాపీ చేస్తోందట. వాచర్ యాదగిరి చూసి ఇద్దరి పేపర్లూ తీసుకుని రిపోర్ట్ చేశాడు. రిపోర్ట్ వచ్చిన తరువాత యాక్షన్ తీసుకోక ఏం చేయనూ? ప్లీజ్! ఏడవ కమ్మా! మళ్లీ సెప్టెంబరుకి పంపిస్తానుగా" అన్నారు ప్రిన్సిపాల్‌గారు.

"అసలు అంత దూరానికి ఆ అమ్మాయి పేపరులో ఏం వుందో నాకెలా కనిపిస్తుంది సార్! పైగా మా ఇద్దరి పేపర్లూ సరి చూసి మేము రాసినవి ఒకే రకంగా వున్నాయేమో అని కూడా చూడకుండా ఇలా డిబార్ చేయడం అన్యాయం సార్" అంది వకుళ.

"అదేమిటమ్మా! వాచర్ చూసి కంప్లె యింట్ చేస్తేనేగా డిబార్ చేస్తున్నది?"

నిజానికి ఆ ఇద్దరు ఆడపిల్లలూ ఫస్టు క్లాసు తెచ్చుకుంటారని మేము అనుకుం టూనే వున్నాం. ఇప్పుడు డిబార్ అవుతు న్నారంటే! అయినా వకుళ చెప్పినట్టు ఆ ఇద్దరు రాసిన పేపర్లూ చూడాలికదా!

"అవును సార్! ఇద్దరి పేపర్లూ తెప్పించి చూడండి"

వాచర్ చెప్పాడుకదా! అంటారు ప్రిన్సిపా ల్‌గారు. కానీ ఆ వాచర్‌కి వీళ్ల మీదేమైనా ప్రెజుడీస్ వుంటే వీళ్ల భవిష్యత్తు ఏమిటి?

చివరికి ఆయన్ని ఒప్పించి ఆ అమ్మాయి లనిద్దరినీ అక్కడే వుండమని వాళ్ల ఎగ్జామి నేషన్ హాలులోకి ప్రిన్సిపాల్‌గారితో కలసి నడిచాను.

మమ్మల్ని చూడగానే మొహం మాడ్చుకు న్నాడు అక్కడి వాచర్ యాదగిరి.

"మాస్టారూ! ఒక్కసారి ఆ పేపర్లు రెండూ ఇవ్వండి" మర్యాదగానే అడిగాను.

"ఏమిటయ్యా ఇచ్చేది? అలా ఇవ్వవల సిన అవసరంలేదు" రాష్‌గా అన్నాడు యాదగిరి.

"అది కాదు సార్! నిజంగా వీళ్లు మంచి స్టూడెంట్సు. కాపీ కొట్టవలసిన అవసరం వీళ్లకు లేదు"

"ఏమిటి నీకంత ఇంటరెస్టు?" హేళనగా అడిగాడు.

"మిస్టర్ యాదగిరీ! సభ్యతగా మాట్లా డడం నేర్చుకోండి" కోపంగా అన్నాను. "ఏదైన యాక్షన్ తీసుకునేటప్పుడు అన్నీ చూడడం పద్ధతి" అంటూ ఒక రకంగా బల వంతంగానే ఆ ఇద్దరి పేపర్లూ తీసుకుని అతన్నికూడా తీసుకుని వచ్చాం.

రెండు పేపర్లూ చూస్తే నిజంగానే సంబంధం లేదు.

"చూడండి సార్! ఈ అమ్మాయి ఒక వరుసలో కాకుండా తనకు బాగా వచ్చిన ప్రశ్నలకు ముందు సమాధానం రాస్తోంది. కాపీ చేసిందని చెబుతున్న వకుళ మొదటి నుంచీ వరుసగా సమాధానాలు రాస్తోంది" చూపించాను.

"అవును సార్! ముందు బాగా వచ్చిన





ప్రశ్నలకు సమాధానం రాయమని మీరేగా చెప్పారు" అంది సరోజ.

"అన్నీ నేను చదివిన ప్రశ్నలే వచ్చాయి మాస్టారూ! అందుకని ఒక వరుసలో రాస్తు న్నాను" అంది వకుళ.

వాళ్ల మీద రిపోర్ట్ చేయాలనే ఉత్సా హంతో యాదగిరి మొదటి గంట కాకుం డానే పట్టుకున్నాడు. దానిలో వాళ్ల ఇద్దరి పేపర్లలోనూ ఏ ప్రశ్నా కలవలేదు.

"అదేమిటి మాస్టారూ! ఇందులో ఏ పేజీ ఈ అమ్మాయి కాపీ కొట్టిందంటారు? " ప్రిన్సిపాల్ గారు నిలదీసి అడిగేసరికి తడబ డ్డాడు.

"సిన్సియర్‌గా డ్యూటీ చేయాలనుకోవడం నాదీ బుద్ధి తక్కువ" విసురుగా బైటకు వెళ్ల బోయాడు.

"ఆగండి సార్" అంటూ ప్రిన్సిపాల్ గారి వైపు తిరిగింది వకుళ. "అసలు విషయం నేను చెబుతాను సార్! ఈ మాస్టారు ఎప్పుడూ ఆడపిల్లలను ఏదో రకంగా వేధిస్తూ వుంటారు సార్! మొన్నీమధ్య ఈ సరోజను స్టాఫ్ రూముకి పిలిచి అసభ్యంగా మాట్లా డితే నాతో చెప్పుకుని ఏడ్చింది. దాంతో నేను ఆయనకు వార్నింగ్ ఇచ్చాను. ఆ కక్ష మన సులో పెట్టుకుని ఈ రోజు మా మీద పగ తీర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారు"

"అయాం సారీ అమ్మా!" సారీ చెబుతున్న ప్రిన్సిపాల్ గారిని సూటిగా చూసింది వకుళ.

"సార్! మాకు కావలసింది సారీలు కాదు. మేము పరీక్షలు రాయగలగడం. మీరు అంటారు మళ్లీ సెప్టెంబరులో రాయ మని. కానీ సెప్టెంబరులో పాసైన వాళ్ల భవిష్యత్తు మీకు తెలియదా సార్! అయినా చేయని నేరానికి మేము ఎందుకు శిక్షను అనుభవించాలి? దయచేసి మా పేపర్లు ఇప్పటికైనా మాకు ఇచ్చి మేము పరీక్ష రాసే అవకాశాన్నివ్వండి. ఇప్పటికే ఒక గంట కాలం వేస్టు చేశారు. మిగిలిన విషయాలు తరువాత మాట్లాడుకోవచ్చు ముందు ఆ గంట సమయమూ మాకివ్వండి"

నిజమే, ఆమె కోరికా సమంజసమైనదే. రూల్సు అంటూ పట్టుబట్టకుండా ఆ గంట సమయమూ వాళ్లకు ఇవ్వడం న్యాయం. చివరకు ప్రిన్సిపాల్ గారు కూడా ఎగ్జామినే షన్ హాలులో కూర్చున్నారు.

వకుళ సీరియస్‌గా తన పేపరు తీసుకుని చివరి వరుసలోకి వెళ్లింది. "మాస్టారూ! ఈ చుట్టుపక్కల ఎవరూ లేరు. అనవసరంగా మా టైము వేస్టు చేయకండి" అంటూ సరోజ వైపు తిరిగి "ముందు ఎగ్జామ్స్ రాయడం గురించి ఆలోచించు. తరువాత తీరిగ్గా ఏడవవచ్చు" అంటూనే సీరియస్‌గా తల వంచుకుని రాయడం ప్రారంభించింది.

అందరూ వెళ్లిపోయినా వాళ్లిద్దరి కోసం హాల్లో వుండిపోయాం నేనూ, ప్రిన్సిపాల్ గారూ! మాతోపాటు ఒకరిద్దరు లెక్చరర్స్.

పేపరు వాచర్‌కి ఇచ్చిన తరువాత అప్పుడు సరోజ చేయి పట్టుకుని నా దగ్గ రకు వచ్చింది వకుళ.

"చాలా థాంక్స్ మాస్టారూ! మీ మేలు మరచిపోలేం. ఏయ్ మొద్దూ! మాస్టారికి థాంక్స్ చెప్పవేం? " అంటూ ప్రిన్సిపాల్ గారి వైపు తిరిగింది.

"క్షమించండి సార్! మీతో రాష్‌గా మాట్లాడాను" అంటూ సరోజతో కలిసి చర చరా నడుచుకుంటూ వెళ్లిపోయింది.

నిజంగా వకుళ ధైర్యంగల పిల్ల కాబట్టి వీళ్లకు ఏ అన్యాయమూ జరగలేదు. లేక పోతే ఏమైవుండేది? బాధ్యతగల లెక్చరర్ అయివుండి యాదగిరికి ఇదేం శాడిజమో తెలియదు.

"ఏదో ఘనకార్యం చేశానని మురిసిపోకు. నా సంగతి నీకు పూర్తిగా తెలియదు" కాలేజీ గేటు దగ్గర ఎదురు పడిన యాద గిరి నన్ను చూస్తూనే కోపంగా అంటూ వెళ్లి పోయాడు.

నిజంగా యాదగిరి అంటే ఏమిటో కొన్ని

రోజుల తరువాత బాగానే తెలిసింది. స్టూడెంట్స్‌లో కాస్ట్ ఫీలింగుని రెచ్చగొట్టాడు. ఒక్క త్రాటిపై నడిచే కాలేజీలో గ్రూపులు బయలుదేరాయి. ఏదైనా విధ్వంసం చేయడం తెలికే. కానీ మళ్లీ ఆర్డరులో పెట్టాలంటే ఎంత కష్టం? స్టూడెంట్సుని ఒక్క త్రాటికి తీసుకు రావడానికి కొన్ని నెలలు, సంవత్సరాలూ పట్టింది. యాదగిరి పుణ్యమా అని ఒక్క రోజులో నాశనం చేశాడు. మళ్లీ మామూలు స్థితికి రావడానికి చాలా కాలమే పట్టింది.

. ఆ తరువాత కొంతకాలానికి సిసింద్రీ హాస్పిటల్‌లో మరొక సంఘటన జరిగింది.

ఈ ఊరిలోని కృష్ణమూర్తి అనే రైతు కొడుక్కి అపెండిసైటిస్ వస్తే క్షణాల మీద ఆపరేషన్ చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. సిసింద్రీ ఆపరేషన్ చేసి డబ్బు గురించి ఆలోచించవద్దనీ, మందులకు కూడా తను ఏర్పాటు చేస్తాననీ ధైర్యం చెప్పాడు. అయితే ఆ మాటలు కృష్ణమూర్తికి అహంభావంగా తోచాయి. నలుగురిలోనూ సిసింద్రీ మీద విరుచుకు పడ్డాడు. ఒకప్పుడు తన వద్ద పాలేర్లుగా తన మోచేతి నీళ్ల తాగి, ఇప్పుడు పరిస్థితులు తారుమారు కావడంతో తన గొప్ప చూపించడం కోసమే సహాయం చేస్తున్నాడని దుమ్మెత్తి పోశాడు. పంతంకొద్దీ భార్య మెడలో బంగారాన్ని తెగనమ్మి సిసింద్రీకి బిల్లు చెల్లించాడు. బయటకు వెళ్లి సిసింద్రీ గురించి చెడుగా చెప్పడం ప్రారంభించాడు. ఆవేశంలో అగ్రకులానికి చెందిన కారణంగా తన పిల్లలకు సీట్లు రాలేదనీ, అంటరాని కులంలో పుట్టిన కారణంగా రిజర్వేషన్‌లో సీటు సంపాదించుకుని డాక్టరై ఇప్పుడు పోజు కొడుతున్నాడనీ అనడం ప్రారంభించాడు.

విషయం విన్న దాసుగారు కలతచెందారు. సహజంగానే ఆయన భావాలను నాతో పంచుకున్నారు.

"నిజానికి సిసింద్రీ ఉన్నత స్థానంలోకి వచ్చినందుకు ఎవరూ అసూయ పడవలసిన అవసరంలేదు. అతగాడు మెరిట్‌లోనే వచ్చాడు. అతను కులాన్ని అడ్డుపెట్టుకుని రిజర్వేషన్‌లో సీటుని సంపాదించుకోలేదు.

"ఇదివరకు కాలంలో నిజమే, వారిని అంటరానివారిగా చూసేవారు. ఇళ్లల్లోకి రానిచ్చేవారు కాదు. అగ్రజాతి వారు నివసించే వీధుల్లోకి నడిచే అర్హత వుండేది కాదు. ఇంకా పూర్వకాలంలో పరిస్థితులు ఇంకా దారుణంగా వుండేవి. మహాత్మాగాంధీ వారికి హరిజనులని పేరు పెట్టి వారూ హిందూ మతంలోని వారేనని చెప్పి వారికి మనోధైర్యాన్ని కలిగించారు. రాజ్యాంగం వారికి రిజర్వేషన్స్ కల్పించి చదువుకోవడానికి అవకాశం కలిగించింది. అయితే రానురానూ ఆ అవకాశం మొదటి తరంలో ఉన్నత స్థానంలోకి వెళ్లిన వారే తన్నుకు పోతున్నారు. అట్టడుగున బతుకుతున్న వారు అక్కడే వుండిపోతున్నారు. అయినా మనవాళ్ల సమయం వచ్చినప్పుడల్లా వారిని కులం పేరుతో ఎత్తిపొడుస్తుంటే వారు మాత్రం ఎంత కాలమని సహించగలరు? ఏమిటో అందరినీ సమానులను చేయాలనీ, తరతరాల నుంచి అణగదొక్కబడిన వారిని పైకి తీసుకు రావాలనే ఉద్దేశ్యంతో ప్రారంభించిన ఈ రిజర్వేషన్లు మన వారి అసూయా ద్వేషాలతో వారిని మరింత దూరం చేసుకోవడానికే ఉపయోగపడుతున్నాయి"

ఊళ్లో కార్యక్రమాలు, సజావుగానే సాగుతున్నాయి. కానీ ఆనాటి అతని మాటలు సిసింద్రీ మనసులో మెదులుతూనే వున్నాయనుకుంటాను. గూడెం యాక్టివిటీస్‌లోనే కానీ యువరక్షా సమితి కార్యక్రమాల్లో మునుపటిలా కల్పించుకోవడంలేదు.

ఒకరోజు దాసుగారే సిసింద్రీని పిలిచి మందలించారు.

"అసూయాగ్రస్తుల మాటలకు ఎందుకు విలువనిస్తున్నావో నాకు అర్థం కావడం లేదు. చిన్నతనం నుంచి ఈ ఇంటి బిడ్డగా





పెరిగావనే అనుకుంటూ వచ్చాను. ఇప్పుడింత చిన్న విషయానికి మనసు పాడు చేసుకుంటున్నావంటే నా గైడెన్సులోనే ఎక్కడో పొరపాటు జరిగిందన్నమాట"

"నన్ను క్షమించండి బాబుగారూ! మీ ఇంట్లో నా కులమేమిటో తెలుసుకోకుండానే పెరిగాను. కానీ ఆ రోజు ఆ కృష్ణమూర్తి గారికి మనస్ఫూర్తిగా సహాయ పడదామనుకున్నాను కానీ"

"అతనెందుకలా మాట్లాడి వుంటాడు? అన్న దృష్టితో ఆలోచించి చూడు. మానవ మనస్తత్వాన్ని తెలుసుకోగలిగిన ఒక డాక్టరుగా అతనిని ఎనలైజ్ చేయడానికి ప్రయత్నించు. అతని మీద నీకు సానుభూతే కలుగుతుంది. ఏదిఏమైనా మన ఎమోషన్సు మన కార్యక్రమాలకు అడ్డు రాకూడదు. ఇలా కొంతకాలం సాగితే మన ఊరు రెండు ముక్కలవుతుంది. పేపర్లలో చూస్తూనే వున్నావుగా. ఎవరో అంబేద్కర్ విగ్రహాన్ని అవమానిస్తాడు. దానితో దళితులందరూ ప్రతీకారం తీర్చుకుంటున్నామనుకుని మహాత్మాగాంధీ విగ్రహానికి బ్రాందీ సీసాలు తగిలిస్తారు. అసలు అంబేద్కర్ కానీ గాంధీ కాని ఒక కులానికో, లేక ఒక మతానికో చెందిన వారని భావించడంలోనే మన సంకుచిత మనస్తత్వం బయటపడుతోంది. మన ఊరిని ఒక్కతాటి మీద నడిపిస్తున్నాం. మధ్యలో ఇంత చిన్న విషయాన్ని అనవసరంగా పెంచడం మంచిది కాదు. పెంచుకుని ఊరిని ముక్కలు చేయడం అసలే మంచిది కాదు. నువ్వు కూడా ఆలోచించి చూడు"

"క్షమించండి బాబుగారూ!" తల వంచుకున్నాడు.

★ ★ ★

వేసవి సెలవులకు హైదరాబాదు వెళ్లినప్పుడు కిశోర్ పెళ్లిరోజు అని భోజనానికి పిలిస్తే అమ్మానాన్నలతోపాటు నేనూ మా అత్తవారింటికి వెళ్లాను. వారం రోజుల క్రితమే సుధ అక్కడకు వెళ్లింది. సుధకు ఎందుకో ముందు నుంచీ కిశోర్ భార్య రేఖ చదువుకోలేదనీ పల్లెటూరు నుండి వచ్చిందనీ కొంత చిన్న చూపు వుంది. అందరిలోనూ వాళ్లను చిన్నబుచ్చకూడదనే ఆలోచన కూడా ఆమెకు వుండదు. భోజనాల సమయంలో అందరూ వుండగా "ఎంతైనా రేఖ అదృష్టవంతురాలు. పల్లెటూరిలో పుట్టి పెరిగినా హాయిగా నగర జీవితానికి అలవాటుపడింది" అనేసింది.

రేఖ తనూ ఏమీ తక్కువ తినలేదన్నట్లుగా "సిటీ లైఫ్‌కి అలవాటు పడుతున్నానని మీరంటున్నారు. కానీ విశాలమైన భవంతిలో వుండి ఈ ఇరుకు అపార్ట్‌మెంటులోకి వచ్చానని నేననుకుంటున్నాను" అనేసింది. అక్కడితో ఊరుకోకుండా "ఏమిటో వదినగారూ! సిటీ లైఫని మీరు ఊరికే మోజు పడుతున్నారుకానీ ఇక్కడ ఏం సుఖముందండీ! ఏ చిన్న వస్తువు కావాలన్నా చచ్చినట్టు మనం వెళ్లి తెచ్చుకోవలసిందే. అక్కడ కాలు కింద పెట్టకుండా ఏది కావలసినా తీసుకు రావడానికి మనుషులు వుంటారు. విశాలమైన భవంతులు, స్వచ్ఛమైన గాలి, పాడి పంటలతో వుండే పల్లెటూళ్లు ఎంత సుఖమో పల్లెటూరిలో వున్నా మీరు గ్రహించక పోవడం విచిత్రంగానే వుంది" అనేసింది.

"అవునులే, చదువు సంధ్యలు లేని వారికి ఆ మట్టిలో బతకడంలోనే సుఖముంటుందిలే"

రేఖ లోపలకు వెళ్లి ఏదో సర్టిఫికెట్‌తో బయటకు వచ్చి సుధ చేతికి అందించింది. తీసి చూసిన సుధ మొహం మాడిపోయింది.

అందుకుని చూసిన నేను ఆశ్చర్యపోయాను. రేఖ ఓపెన్ యూనివర్శిటీ నుంచి అందుకున్న బి.ఎ డిగ్రీ సర్టిఫికెట్

"అదేమిటమ్మా! డిగ్రీ చేస్తున్నట్టు ఎప్పుడూ చెప్పనైనా లేదేం?" అడిగాను.

"ఏముంది అన్నయ్యగారూ! చదువుకోవాలనే కోరిక నాకు చిన్నప్పటి నుండీ వుండేది. కానీ అవకాశాలు లేక పల్లెటూరి మొద్దులా వుండిపోయాను. ఇక్కడకు వచ్చిన తరువాత నా కోరిక ఈయనకు చెప్పడం, ఈయన ఓపెన్ యూనివర్శిటీలో డైరెక్టుగా బి.ఎ చేయవచ్చని చెప్పారు. అత్తయ్యగారూ, మామయ్యగారూ కూడా ఒప్పుకున్నారు. కానీ ఇంత ఆలస్యంగా చదువు ప్రారంభించడంతో పాసవుతానా, అనే అనుమానం. అందరికీ తెలిసిన తరువాత పాసు కాకపోతే చిన్నతనంగా వుంటుందనే భయం. దానితో ఎవరికీ చెప్పలేదు"

"మహా చేశావులే బోడి బి.యే" ఉక్రోషంగా అంది సుధ.

"మీరు ఆ బోడి కూడా పూర్తి చేయలేదనుకుంటాను" హేళనగా చూసి లోపలికి నడిచింది రేఖ.

నిజమే సుధ బి.ఎ ఫైనలియర్‌లో వుండగానే వాళ్లు హైదరాబాదు రావడంతో చదువు మధ్యలో ఆగిపోయింది. పోనీ ప్రయివేటుగా కట్టిద్దామన్నా తను ఇంట రెస్టు చూపించలేదు.

"ఏమిటిది సుధా! నీ మంకుతనాన్ని మేము భరించినట్టుగా మీ వదిన ఎందుకు భరిస్తుంది. ఇంత వయసు వచ్చినా ఆమాత్రం ఆలోచన లేకపోతే ఎలా? " మందలించారు అత్తగారు.

"ఛీ, ఛీ! ఇక్కడకు రావడం నా బుద్ధి తక్కువ" ప్లేట్లో చెయ్యి కడిగేసి విసురుగా లోపలకు నడిచింది.

అందరూ చూస్తూ కూర్చుండి పోయారు.

దానితో పట్టుబట్టి మాతో వచ్చేసింది సుధ. ఆ కారణంగానైనా కోడలు తన దగ్గరికి వచ్చినందుకు సంతోషించింది అమ్మ.

కానీ ఆ కారణంగా చాలాకాలం ఆ ఇంటి ముఖం చూడలేదు. చివరికి తల్లి బతిమాలడమూ, వదినగారి క్షమార్పణలూ, అన్నగారి అనునయమూ, తండ్రి నచ్చజెప్పడమూ జరిగిన తరువాత సంవత్సరం తరువాత ఆ ఇంట కాలుపెట్టింది. అత్తగారు నచ్చజెప్పిన వెంటనే క్షమార్పణ చెప్పిన రేఖ పట్ల అందరికీ అభిమానం కలుగుతుందనే ఆలోచన సుధకు లేదు. దానితో తన వారి దృష్టిలో మరింత చులకన అవుతాననే ఆలోచనా ఆమెకులేదు.



వేసవి సెలవులు ఇవ్వడంతో నేనూ, సుధా హైదరాబాదు వచ్చాం.

రోజురోజుకీ సుధ ధోరణి మరీ విపరీతంగా మారుతోంది. అమ్మానాన్నలను అసలు లక్ష్యపెట్టడమే మానేసింది. మాట్లాడితే కొడుకుని అంత నిర్లక్ష్యంగా పల్లెటూళ్లో వదిలేసి ఆయనకి భవిష్యత్తు లేకుండా చేస్తున్న మీరేం తల్లిదండ్రులని విరుచుకుపడిందట. పట్నంలో ఉద్యోగంచూపించలేని అసమర్థులని ఆడిపోసుకుందట. దానితో భోజనం ముందు కూర్చున్న నాన్నగారు కంచంలో చెయ్యి కడిగేసుకుని లేచిపోయారు. 'అదేమిటమ్మా' అని మందలించిన అమ్మను ఈసడించి పారేసిందట. అమ్మ గట్టిగా మందలించేసరికి అలిగి కూర్చుంది.

బయట నుండి వచ్చిన నాకు అంతా





చెప్పి అమ్మ కళ్ల నీళ్లు పెట్టుకుంది.

నిజానికి నాకూ చాలా విసుగ్గానే వుంది. కానీ తెంపుకుంటే తెగే బంధమా మూడు ముళ్ల బంధం? కానీ ఆమెను మార్చడం ఎలా?

ఏం చెయ్యాలి? ఆమెను ఎలా మార్చాలి?

"ఏమిటో మనసులో దాచుకోలేక చెప్పాను. కానీ నువ్వు మాత్రం తొందర పడకు సుమా! దాని కడుపున ఒక కాయ కాస్తే అదే మారుతుంది" అమ్మ మాట ఓదార్పుగా వినిపించింది. వచ్చిన ప్రతిసారీ అమ్మ నోట ఆ మాట ఎప్పుడూ వినిపించేదే.

ఆ రోజు సుధ మరీ నలతగా వుంటే వాళ్ల అమ్మగారి ఇంట దింపి వచ్చాను.

"కంగ్రాట్స్ బావగారూ!" కిశోర్ హడావుడిగా వచ్చాడు నాలుగు రోజుల తరువాత.

"ఏమిటోయ్ విశేషం? " నాన్నగారు అడిగారు.

"ఆ విషయం బావగారే చెప్పాలి మావయ్యగారూ! చాలా థాంక్స్ బావగారూ! మా అబ్బాయికి స్నేహితురాలిని సంపాదించి పెడుతున్నందుకు" నవ్వాడు కిశోర్.

మూడేళ్ల క్రితం పెళ్లి అయిన కిశోర్‌కి అప్పుడే ఏడాదిన్నర బిడ్డ.

"అదేమిటోయ్? . మీ వాడికి స్నేహితురాల్ని సంపాదించి పెట్టడమేమిటి? " అర్థం కానట్లే చూశారు నాన్నగారు.

"ఇదేనోయ్ కిశోర్! మీ మామయ్యగారి వరస. అదే వాళ్ల ఆఫీసు వ్యవహారాల గురించి అడుగు, నిద్రలో లేపి అడిగినా చెప్పేస్తారు" లోపల నుంచి కాఫీ కప్పుతో వచ్చి కిశోర్‌కి అందిస్తూ అంది అమ్మ.

"నీకు అర్థమైందేమిటో చెప్పకూడదూ? " ఉక్రోషంగా అన్నారు నాన్న.

"చెబుతాను మీరు మాత్రం పార్టీ ఇవ్వడానికి సిద్ధంగా వుండండి. అన్నట్టు అంతకుముందే మీకు పుట్టబోయే మనుమడో, మనుమరాలో ఊగడానికి వీలుగా మీరు మీసాలు పెంచుకోవాలి సుమా!" నవ్వింది అమ్మ.

"అంటే, యూ మీన్!"

"అవును మావయ్యగారూ అమ్మ ఈవేళ సుధను డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళింది. డాక్టరు కన్ఫర్మ్ చేసింది. మీకు ఈ శుభ వార్త చెప్పి మీ అందరినీ రేపు అక్కడికే భోజనానికి రమ్మంది"

"అంటే అప్పటిదాకా రావద్దనా? అదేం వీల్లేదోయ్. మా కోడలిని ఇప్పుడే చూడాలి. పార్టీ ఇవ్వాలి" అంటూ అప్పటికప్పుడు టాక్సీ తెప్పించి సుధను చూడడానికి వెళ్లాం. వెళ్ళి అక్కడనుంచి అందరినీ తీసుకుని కృష్ణా ఓబరాయ్‌కి తీసుకెళ్ళి పార్టీ ఇచ్చారు.

అమ్మా నాన్నా సంతోషానికి అంతులేదు. నిజమే, పెళ్లి అయిన ఏడేళ్లకు ఇంటికి వారసుడు రాబోతున్నాడంటే ఎవరికైనా సంతోషమే. కానీ ఇంతటి సంతోష వార్త తనే స్వయంగా నాకు చెప్పి వుంటే ఎంత బాగుండేది?

రెండు కుటుంబాలూ సంతోషంగా వున్నాయి. ప్రతి సంవత్సరం ఇద్దరం కలసి వచ్చి పదిహేను రోజులు అయిన తరువాత నేను తిరిగి వచ్చేవాడిని. ఒక నెలరోజులు వుండి సుధ వచ్చేది. కానీ ఇప్పుడు పదిహేను రోజుల్లో తిరిగి వస్తానంటే అందరూ మూకుమ్మడిగా వీల్లేదు పొమ్మన్నారు.

కాలేజీ రీఓపెనింగు రోజుకి నాలుగు రోజులముందు బయలుదేరుతూ సుధను మరో నెల వుండి రమ్మని అన్నాను.

"రిటైరయ్యేంతవరకూ ఆ ఊళ్లోనే పడి వుండవలసిన దానిని. ఇక్కడో నెల వుండి మళ్లీ సిటీ లైఫ్‌కి అలవాటుపడడం ఎందుకులెండి" నిష్ఠూరంగా అంది.

"ఏమిటో ఇంకో నెల వుండి కాస్త నీరసం తగ్గిన తరువాత వెళ్ళమంటే వినిపించుకోవు" అంటున్నా సుధ నన్ను విడిచి వుండలేక వచ్చేస్తోందని సంతోషపడ్డారు మా అత్తగారు.

సరే, ప్రయాణానికి ముందు మరోసారి



చెకప్ చేయించుకుని వెళ్ళమంటే వినిపించు కోలేదు.

★ ★ ★

ఊరు వచ్చి నెలరోజులైంది. ఒక్కసారి జ్ఞానేశ్వర్‌చేత పరీక్ష చేయించుకోమంటే కస్సుమంది. పోనీ, రాజమండ్రి తీసుకువెళ్ళి చూపిస్తానన్నాను. అంతదూరం ప్రయాణం చేసే ఓపిక తనకు లేదంది. పోనీ హైదరాబాదు తీసుకువెళ్ళి దింపి వస్తానంటే వీల్లేదంది. అసలు మందులు వాడకపోతే ప్రమాదమని హెచ్చరిస్తే, పల్లెటూరిలో వుండడంవల్ల వచ్చే ప్రమాదమేమిటో అప్పటికి కాని మీకు తెలిసిరాదంది. మందులు వాడకపోతే ప్రమాదమంటే, హైదరాబాదులో డాక్టరుగారు రాసి ఇచ్చిన మందులు వాడుతున్నానంది. ఇక చేయగలిగింది లేక ఆ ప్రిస్క్రిప్షన్‌బట్టి మందులు తీసుకువచ్చి ఇవ్వడం ప్రారంభించాను.

ఆరోజు కాలేజీ నుంచి వచ్చేసరికి సరస్వతి గేటు దగ్గరే ఎదురుపడింది.

"నమస్కారం మాస్టారూ! బాగున్నారా? అమ్మగారికి బీపీ చూద్దామని వచ్చాను. వెళ్లేటప్పుడు సుధగారిని చూడడానికి మీ ఇంటికి వస్తాను" చిరునవ్వుతో రెండు చేతులూ జోడించింది.

"తప్పకుండా రామ్మా! జ్ఞానేశ్వర్ ఎలా వున్నాడు?" అంటూ లోపలకు వచ్చాను.

సరస్వతి వచ్చిన తరువాత ఆమెకు కూర్చోవడానికి కుర్చీ చూపించి సుధను పిలిచాను.

ఆమెను చూస్తూనే ఉలిక్కిపడినట్లు అయింది సరస్వతి.

"అదేమిటి సుధగారూ మీకు నాలుగో మాసం అయివుండాలి కదూ? అదేమిటి కాళ్లకు నీరు పట్టినట్లుగా వుంది"

"అవును" ముభావంగా అంది సుధ.

"మరి అదేమిటి? మిమ్మల్ని చూస్తుంటే ఏ ఏడవ మాసమో అన్నట్లుగా వున్నారు. అసలు మీరు రెగ్యులర్‌గా 'యాంటీనేటల్ చెకప్స్' చేయించుకుంటున్నట్లుగా లేరు. ఒకసారి నర్సింగుహోంకి రండి" ఆదరంగా అంది.

సుధ మాట్లాడలేదు.

"ఒకవేళ మీకు మేల్ డాక్టరని చూపించుకోవడానికి ఇష్టం లేకపోతే పోనీ నేను టెస్టు చేస్తాను. ఎటూ వచ్చాను కదా ఒక్కసారి మంచంమీద పడుకోండి. చూస్తాను" సుధ మొహంలోని అయిష్టతను గ్రహించి అంది.

"ఇప్పుడు నీ చేత పరీక్షచేయించుకుని ఈ చలిలో తలస్నానం ఎక్కడ చేయనూ? ఇక మంచం...!" సుధ మాటలు పూర్తి కాకుండానే సరస్వతి చటుక్కున లేచింది.

"క్షమించండి. మీ మంచి కోసమే చెకప్ చేయించుకోమన్నాను. ఇక మీ ఇష్టం" ఎర్రబడిన మొహంతో చటుక్కున లేచింది. సుధ మొహంలో మెదిలే భావం నన్ను భయపెట్టింది. ఆమెను అవమానించడానికి ఛాన్స్ దొరికింది కదా అని ఆనందం. ఎదుటివారిని అవమానించడంలో మనవారికి ఏదో పైశాచిక ఆనందం లభిస్తుంది. తన సంగతి తెలిసీ పరిస్థితిని ఇంతవరకూ తీసుకురావడం నాదీ తెలివితక్కువ.

సరస్వతిని వెంబడించి గేటుదాకా వచ్చాను. "అయాం సారీ" నా మాటలకు వెనక్కి తిరిగి చూసింది.

"దానిదేముంది మాస్టారూ ఈ అవమానాలు మాకేమీ కొత్తకాదు. దాసుగారి ఇంటిలో ఇంతకాలంనుంచి వుంటున్నారు. అయినా ఆమెలో ఈ సంకుచిత భావాలు ఇంకా పోలేదేమిటా? అనేదే బాధ"

"ప్లీజ్, సరస్వతీ! ఆమెను మార్చలేకపోతున్న నా అయోగ్యతను మన్నించు. ఇప్పటికే నా చేతకానితనానికి కుమిలిపోతున్నాను. ఇంకా ఈ విషయం జ్ఞానేశ్వర్‌కి తెలిస్తే, ఇక అతనికి నా మొహం చూపించలేను"

"ఆయన ఎంత సెన్సిటివో నాకు తెలుసు మాస్టారూ! కృష్ణమూర్తిగారి సంఘటన ఆయన్ని ఎన్ని రోజులు బాధపెట్టిందో నాకు




తెలుసు. అందులోనూ మీపై ఆయనకు వున్న అభిమానం నాకు తెలియంది కాదు. ఇప్పుడే కాదు, ఆయన మనస్సుని బాధపెట్టే పని నేను ఎప్పుడూ చేయను, చేయలేను మాస్టారూ!"

"జ్ఞానేశ్వర్ చాలా అదృష్టవంతుడు సరస్వతీ!" మనస్ఫూర్తిగా అన్నాను.

"కానీ, ఆమెను ఒకసారి ఎవరికైనా చూపించాలి మాస్టారూ! ఆవిడ పరిస్థితి బాగుండలేదు" అంటూనే సెలవుతీసుకుంది సరస్వతి.

రాజమండ్రి తీసుకువెళ్ళి చెకప్ చేయిస్తానని. ఎంత చెప్పినా వినిపించుకోలేదు. పైగా "ఈ పల్లెటూరిలో వైద్య సదుపాయం లేక నాకు ప్రాణాలమీదకు వస్తే తప్ప మీకు బుద్ధిరాదు" అనేసింది.

జ్ఞానేశ్వర్ తరచు హెచ్చరిస్తూనే వున్నాడు. అయిదో మాసంలోనే నీరు పట్టకూడదనీ, బహుశా బీపీ కూడా పెరిగి వుంటుందనీ, చేతులారా ప్రమాదాన్ని కోరితెచ్చుకోవద్దని ఆమెకు ఇక్కడ చూపించుకోవడం ఇష్టం లేకపోతే, హైదరాబాదు తీసుకువెళ్ళి దింపి రమ్మనీ చెబుతూనే వున్నాడు. పోనీ వాళ్ళ అమ్మగారిని పిలిపిస్తానంటే కూడా వినిపించుకోలేదు. ఇక నేను చేయగలిగిందేముందీ, దేముడిపై భారం వేయడం తప్ప. ఒకరోజు సీతతో అంటున్న మాటలు మధ్యాహ్నం కాలేజీ నుంచి వచ్చి ఇంట్లో అడుగుపెడుతున్న నా చెవిని పడ్డాయి.

"అవును, నాకు ఇక్కడ చూపించుకోవడం ఇష్టంలేదు సీతా! పల్లెటూరిలో వుండడంవల్ల వచ్చే అనర్థాలేంటో ఆయనకు తెలిసిరావాలి. నా ప్రాణాలను కాపాడుకోవడం కోసమైనా ఆయన హైదరాబాదులో ఏదో ఒక ఉద్యోగం చూసుకోవాలి. మరోసారి నాకిలాంటి అవకాశం రాదు" కసిగా అంటోంది సుధ.

మైగాడ్! మరీ ఇంత దారుణంగా ఆలోచిస్తోందా సుధ. అయినా నా మీద కసితో తన ప్రాణాలమీదకు తెచ్చుకోవడమేమిటి? నచ్చజెప్పినా ప్రయోజనం లేదన్న విషయం పెళ్ళి అయిన కొత్తలోనే తెలిసిపోయింది. ఇప్పుడేం చేయాలి? నిజంగా తనకేదైనా ప్రమాదం జరిగితే సుధ తల్లిదండ్రుల మొహం ఎలా చూడగలను? ఇక ఆలస్యం చేసి ప్రయోజనంలేదు. పరిస్థితి విషమిస్తోందన్న విషయం అర్థమైంది. ఇంట్లోకి అడుగు పెట్టకుండా మళ్ళీ కాలేజీకి వెళ్ళిపోయాను. కాలేజీ అయిన తరువాత కనీసం కిషోరుకైనా ఫోను చేసి పరిస్థితి చెబితే మంచిదన్న ఉద్దేశ్యంతో కాలేజీనుండి పోస్ట్ ఆఫీసుకి వెళ్లాను. కానీ ఎంతసేపటికీ లైన్ దొరకలేదు. సరే ఉదయం మళ్ళీ వచ్చి ప్రయత్నం చేద్దామని ఇంటికి తిరిగివచ్చాను.

ఇంటిదగ్గర చాలా హడావుడిగా వుంది. జ్ఞానేశ్వర్, సరస్వతీ ఇద్దరూ సుధ మంచందగ్గర వున్నారు. సుధకు సెలైన్ ఎక్కిస్తున్నారు. పక్కనే కుర్చీలో కూర్చుని ఆందోళనగా చూస్తున్నారు రుక్మిణమ్మగారు. దాసుగారు గంభీరంగా ఆ గదిలోనే పచార్లు చేస్తున్నారు. నన్ను చూడగానే ఒక్కసారి చిరాకుపడ్డారు.

"ఏమిటిది సాగర్! ఎప్పుడూ చెప్పకుండా ఎక్కడకూ వెళ్లేవాడవు కాదు, నీ కోసం గంటనుంచీ ఊరంతా వెదుకుతున్నాం"

దాసుగారి మాటలు పూర్తికాకుండానే వీధిలో యాంబులెన్స్ ఆగింది.

"అమ్మాయిని యాంబులెన్స్ ఎక్కించండి. బాబూ! నువ్వూ సరస్వతీ యాంబులెన్స్‌లో రండి. మేము సాగర్‌ని తీసుకుని కారులో వస్తాం" అని జ్ఞానేశ్వర్‌తో అన్నారు దాసుగారు.

నాకు అంతా అయోమయంగా వుంది. సుధను యాంబులెన్స్‌లో ఎక్కించడం, నేను కారులో ఎక్కడం నాకు జ్ఞాపకం లేదు. కీ ఇస్తే నడిచే బొమ్మలా దాసుగారు చెప్పగానే కారు ఎక్కి కూర్చున్నాను. దారిమధ్యలో చెప్పారు.

"బాబూ! సాగర్! నీ పద్ధతి ఏమీ బాగుండలేదయ్యా! నీ భార్యకు వైద్యం చేయించడా

నికి కూడా నీకు తీరిక దొరకలేదా? తనవాళ్ళనందరినీ వదిలి మన ఇంటికి లక్ష్మిలా వచ్చిన భార్యను ఎంత జాగ్రత్తగా చూసుకోవాలి? మన ఇంట్లో మనదే పెత్తనం, భార్య మనకు బానిసలా పడివుండాలి అనే ఆలోచన అంత ఆరోగ్యకరం కాదయ్యా! నీ భార్యకు ఇష్టంలేకుండా ఆమెను ఇక్కడ బంధించి వుంచే అధికారం నీకు లేదు. దేముని దయవల్ల నీ భార్య ఈ ప్రమాదం నుంచి బయటపడితే, నువ్వు సిటీలో ఏదో ఒక ఉద్యోగం చూసుకుని అక్కడకు వెళ్ళిపో! ఇంతకాలం నువ్వు చేసిన సమాజసేవ చాలు, ఇక నీ భార్యను కష్టపెట్టకుండా చూసుకో. ఆడవాళ్లు ఆరోగ్యంగా వున్నన్నాళ్లూ వాళ్ళ విలువ మనకు తెలియదయ్యా"

"అసలే అబ్బాయి దిగులుగా వుంటే మధ్యలో మీ ఉపన్యాసమేమిటండీ! ఇంతకూ ఏం జరిగిందో అతనికి తెలిసినట్లు లేదు" అంటూ జరిగినదంతా ఆమె చెప్పారు.

మధ్యాహ్నం నుండి సుధ నలతగానే వుందట. అందులోనూ మధ్యాహ్నం సుధ తనతో అన్న మాటలు రుక్మిణమ్మగారితో చెప్పిందట సీత. దానితో ఆమె కంగారుపడి నేను వచ్చేవరకూ సుధకు సాయంగా అక్కడే వుండమని పంపించారట. తీరా సీత వచ్చేసరికే సుధ రక్తపు మడుగులో స్పృహలో లేనిస్థితిలో పడి వుందట. సీత కంగారుపడి ఆమెకు చెబితే, ఆవిడ దాసుగారికి చెప్పారట. ఆయన వెంటనే జ్ఞానేశ్వర్‌కి కబురు చేస్తే అతను సరస్వతితోసహా వచ్చాడట. షాక్‌లో వున్న సుధకు ముందు సెలైన్ ప్రారంభించి పక్క ఊరిలోని యాంబులెన్స్‌కి ఫోను చేశారట. దాసుగారు మనుష్యులను నా కోసం పంపించారట. ముత్యాల గర్భిణీలా వుంది అన్నాడట. ముందునుంచీ రెగ్యులర్‌గా చెకప్స్ చేయించుకుని వుంటే ఈ పరిస్థితి వచ్చి వుండేది కాదు అన్నాడట.

నేను ఎన్నిసార్లు ఎన్ని విధాలుగా ఆమెను బతిమాలానో ఎవరికి తెలుసు?

అసలు ఈరోజే కిశోర్‌కి ఫోను చేయాలనుకోవడం ఏమిటి? కనెక్షన్ దొరకక అంతసేపు పోస్ట్ ఆఫీసులో వుండిపోవడమేమిటి? ఇంటి దగ్గర ఇలా ప్రమాదం ముంచుకురావడమేమిటి? వీళ్ళందరూ సమయానికి చూశారు కాబట్టి కానీ, లేకపోతే సుధ ఈపాటికి...? ఆ ఆలోచనతో గుండె దడదడలాడింది. నిజంగా జరగరానిది ఏమైనా జరిగితే సుధ తల్లిదండ్రులకు నా మొహం ఎలా చూపించగలను?

కానీ నాకంటూ కొన్ని ఆదర్శాలు వుండాలనుకోవడం నా తప్పా? పెళ్ళినాటికే నేను ఇక్కడ ప్రారంభించిన యాక్టివిటీస్ ఆవిడకు తెలుసే? తెలిసీ చేసుకుని పెళ్ళి అయిన మరునాటినుండీ మరో ఉద్యోగం చూసుకోమంటే వినిపించుకోకపోవడం నా తప్పా? నిజమే, ఆవిడకూ కొన్ని కోరికలు వుండడంలో తప్పేమీలేదు. అలాంటప్పుడు తన కోరికలకు అనువైన వ్యక్తిని చేసుకుని వుంటే నాకీ అవస్థ తప్పేది కదా? కానీ, మన సమాజంలో యువతీ యువకులకు తమ ఆశయాలకు అనుగుణంగా జీవిత భాగస్వామిని ఎన్నుకునే హక్కు వుందా? నేను మాత్రం ఏం చేశాను? అమ్మ కోరగానే ఆర్థికంగా చితికిపోయిన ఆ కుటుంబాన్ని ఆదుకున్న ఆదర్శ యువకుడిననుకున్నాను కానీ, ఆమె మనసుని అర్థం చేసుకోవడానికి ఏ రోజూ ప్రయత్నం చేయలేదు.

కనీసం ఆమెతో పెళ్ళికి ముందు మాట్లాడి ఆమెతో నా భావాలు పంచుకోవాలనే ఆలోచన కూడా నాకు రాలేదు. ఆమెకంటూ స్వంత ఆలోచనలు వుంటాయనే దృష్టి కూడా రాలేదు. అసలు మేమిద్దరమూ కలుసుకుని మాట్లాడుకుంటే బాగుంటుందనే ఆలోచన పెద్దలకూ లేదు.

అయినా తనకు ఇష్టంలేనప్పుడు తన అభిప్రాయాన్ని తన తల్లిదండ్రులకు చెప్పాలి కానీ, ఆనాడు మౌనంగా తల వంచుకుని నా చేత మూడుముళ్లూ వేయించుకుని నా




భవిష్యత్తుని తన ఇష్టంవచ్చినట్టు మార్చుకో మంటే ఎలా?

బహుశా ఎక్కడా ఉద్యోగం దొరకక ఇక్కడ ఉద్యోగంలో చేరాననీ, పెళ్లి తరువాత సిటీలో ఉద్యోగం చూసుకుంటాననీ తను భావిస్తే అది నా తప్పు ఎలా అవుతుంది? ఏది ఎలా వున్నా తను ప్రాణాపాయ స్థితిని చేరుకుని నన్ను పదిమంది లోనూ దోషిగా నిలబెట్టింది.

అలసిపోయిన మనసుతో భవిష్యత్తు అంధకారం కాగా తల వెనక్కి వాల్చుకుని కూర్చుండిపోయాను.

కారు నర్సింగ్‌హోం ముందు ఆగేసరికి కళ్లు విప్పి చూశాను. రాత్రి పది గంటల ప్రాంతంలో కూడా హాస్పిటల్ జనంతో కిట కిటలాడుతోంది.

కారు ఆగేసరికి కారు దగ్గరకు పరిగెత్తు కువచ్చాడు మురళి. 'అమ్మగారిని రూము నెంబరు టూనాట్ నైన్‌లో అడ్మిట్ చేశారు' అన్నాడు. అందరం ఆత్రుతగా రూములోకి వెళ్లాం. బయట వరండాలో చాలామంది మా యువరక్షా సమితి సభ్యులు, మా స్టూడెంట్సూ నిలబడి వున్నారు.

"ఇదేమిటి, మీరిక్కడ? " ఆశ్చర్యంగా అడిగాను.

"అమ్మగారికి రక్తం ఇవ్వవలసి వస్తుందని మన డాక్టరుగారు చెప్పారు. అందుకని మేమంతా మీకంటే ముందే స్కూటర్ల మీదా, కొంతమంది బస్సుల్లోనూ మీ అందరికంటే ముందే బయలుదేరి వచ్చేశాం" అన్నాడు మురళి.

"ఇంతకూ జ్ఞానేశ్వర్ ఎక్కడ? " అడిగారు దాసుగారు.

"నా గ్రూపు సూటవలేదట. జ్ఞానేశ్వర్‌గారిదే కలసిందట, బ్లడ్ ఇస్తున్నారు" మురళి మాటలకు నా మనసు చిత్రంగా స్పందించింది.

రూములోకి వెళ్లాం. విశాలమైన ఆ హాస్పిటల్ బెడ్‌మీద స్పృహలేని స్థితిలో పడి వుంది సుధ. ఆక్సిజన్ పెట్టారు, ఒక చేతికి సెలైన్, మరో చేతికి బ్లడ్ వెడుతోంది. ఆమె చేతిని పట్టుకుని కూర్చుని వుంది సరస్వతి.

"మరేమీ కంగారులేదు మాస్టారూ! ప్రమాదస్థితి దాటినట్లే. డాక్టరుగారు చూసి వెళ్లారు. మరో రెండు సీసాలు బ్లడ్ ఎక్కిస్తే సరిపోతుంది" ధైర్యం చెప్పింది సరస్వతి.

సుధ చేతిమీద చెయ్యివేసేసరికి ఒళ్లు జలదరించింది. అంతవరకూ అణచిపెట్టుకున్న ఆవేదన ఒక్కసారిగా బయటకు వచ్చింది. దాసుగారు నన్ను బలవంతంగా బయట బాల్కనీలోకి తీసుకువచ్చారు. ఎన్నో విధాల ధైర్యం చెబుతూ పక్కనే కూర్చున్నారు.

నిజంగా ఆ రాత్రి నాకు కాళరాత్రే. ఎలా తెల్లవారిందో తెలియదు. ఆ అర్ధరాత్రి సుధను ఆపరేషన్ థియేటర్‌కి తీసుకుని వెళ్ళడం, ఆపరేషన్ చేసి తిరిగి రూములోకి తీసుకురావడం, నాకు తెలియనే తెలియదు. బాల్కనీలో అలా ఈజీ ఛైయిర్‌లో నిస్సహాయంగా కూర్చుండిపోయాను.

"మాస్టారూ!" జ్ఞానేశ్వర్ భుజంమీద చెయ్యి వేసేసరికి ఈ లోకంలోకి వచ్చాను. చీకట్లు తొలగి వెలుగు రేకలు బాల్కనీ అంతా పరచుకున్నాయి.

"అమ్మగారికి ప్రమాద స్థితి దాటింది సార్! వచ్చి ఒకసారి చూడండి" అంటున్న అతని రెండు చేతులలోనూ మొహాన్ని దాచుకున్నాను.

"అదేమిటి మాస్టారూ! ఇప్పుడే మీరు ధైర్యంగా వుండాలి. అయినా ఇప్పుడేమైందని? నాలుగు రోజులలో మన ఊరు వెళ్ళిపోవచ్చు" అతని వెంట గదిలోకి వచ్చాను. మత్తులో వుందో లేక నిద్రపోతోందో కానీ సుధ కళ్లు మూసుకుని వుంది. ఆమె చేతిని పట్టుకుని పక్కనున్న స్టూలుమీద కూర్చుండి పోయాను.

పెద్ద వయసులో దాసుగారు రాత్రంతా మెలుకువగా కూర్చునే వున్నారు. రుక్మిణ

మ్మగారు సుధ చెయ్యి పట్టుకుని మంచంపక్కన స్టూలుమీద కూర్చుని వున్నారు. నేను మాత్రం నిద్రో, మగతో తెలియని స్థితిలో బాధ్యతకు దూరంగా వుండిపోయాను.

"అమ్మగారూ! మీరూ, బాబుగారూ ఇప్పటికైనా హోటల్‌కి వెళ్ళి విశ్రాంతి తీసుకోవాలి లేకపోతే పక్కరూములో మిమ్మల్ని అడ్మిట్ చేయవలసి వస్తుంది" అని బలవంతంగా మురళిని ఇచ్చి వారిద్దరినీ హోటల్‌కి పంపించాడు జ్ఞానేశ్వర్.

"బాబూ!" నాన్న మాట వినిపించేసరికి సంభ్రమంగా తల ఎత్తి చూశాను. ఎదురుగా అమ్మా నాన్నా, ఆ వెనకాల అత్తగారూ, మామగారూ, వారి వెనక కిశోర్. అంతా కలసి వచ్చేశారన్నమాట. అసలింతకూ వారికి కబురు ఎలా తెలిసింది?

"నిన్న సాయంత్రమే దాసుగారు ఫోను చేసి చెప్పారు ఈ నర్సింగ్ హోమ్‌కి తీసుకు వస్తున్నామని. వెంటనే బయలుదేరి వచ్చేశాం" చెప్పింది అమ్మ.

ఎంత విచిత్రం? నేను గంటలతరబడి పోస్టాఫీసులో కూర్చుని ప్రయత్నిస్తే నాకు కనెక్షన్ దొరకలేదు. కనీసం ఇక్కడికి వచ్చిన తరువాత అయినా వాళ్లకి ఫోను చేసి విషయం చెప్పాలన్న ఆలోచన కూడా కలగలేదు. నిజంగా వీరంతా ఆదుకుని వుండకపోతే నేనేమై వుండేవాడిని? సుధ అసలు ప్రాణాలతో దక్కేదా? ఏం చేసి వీరి రుణం తీర్చుకోగలను? కానీ వీరి మంచితనాన్ని సుధ ఎందుకు అర్థంచేసుకోలేకపోయింది? అయినా ఈ పరిస్థితిలో కూడా ఇలా ఆలోచించడం సమంజసం కాదేమో?

అత్తగారు సుధ మంచం దగ్గరికి రాబోయారు.

"ప్లీజ్! ఇలా ప్రయాణం చేసి పేషెంటు దగ్గరకు రావడం మంచిది కాదు. హోటల్లో రూమ్ము తీసుకున్నాం. ముందు అక్కడికి వెడదాం రండి. స్నానం చేసి వద్దురుగానీ, మీరూ రండి మాస్టారూ!" అంటున్న సిసింద్రీని బతిమాలి నేను అక్కడే వుండిపోయాను. మిగిలిన అందరూ హోటల్‌కి వెళ్లారు.

మరునాడు తన కన్సల్టేషన్ రూములోకి పిలిచారు డాక్టర్ రాజేశ్వరి.

"చదువుకున్న మీరు కూడా భార్య ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయడం ఏమీ బాగా లేదు మాస్టారూ!" అంటూంటే అవమాన భారంతో తల వంచుకున్నాను.

"అయాం సారీ! మిమ్మల్ని చిన్నబుచ్చాలని నా ఉద్దేశ్యం కాదు మాస్టారూ! నెల తప్పిన దగ్గరనుంచీ రెగ్యులర్‌గా చెకప్స్ చేయించుకుని వుంటే ఈ పరిస్థితి వచ్చి వుండేది కాదు. ఆవిడకు కాళ్లు నీరుపట్టి బిపీ పెరిగి ప్రమాదం అంతగా కళ్లకు కట్టినట్టు కనిపిస్తూ వుంటే, మీరంత నిర్లక్ష్యంగా ఎలా వున్నారో నాకు అర్థంకావడం లేదు"

నేనేం చెప్పను? నేనేం మాట్లాడినా ఎవరూ ఏమీ నమ్మరు. ఈ విధంగా సుధ తన పంతం నెగ్గించుకుందా? తన పంతం నెగ్గించుకోవడం కోసం తన ప్రాణాన్నే పణంగా పెట్టింది. చెమ్మగిల్లిన కళ్లతో డాక్టరుగారివైపు చూశాను.

"ఇప్పుడు పరవాలేదు. ప్రమాద పరిస్థితి నుండి బయట పడినట్లే. కానీ, ముత్యాల గర్భిణీ చాలా ప్రమాదకరమైంది. ఈరోజు ప్రమాద పరిస్థితి నుండి బయట పడ్డామని సంతోషపడితే సరిపోదు. నిర్లక్ష్యం చేస్తే కోరియానిక్ ఎపిథీలియోమా అనే ఒక రకమైన కాన్సర్ వచ్చే అవకాశం వుంది"

'మైగాడ్' ఉలిక్కిపడ్డాను. ఏదో గండం గడిచింది అనుకుంటూ వుంటే మళ్లీ ఇదేమిటి?

"కానీ, తగిన జాగ్రత్తలు తీసుకుంటే ఏమీ ప్రమాదం లేదు. ఏమైనా దగ్గర దగ్గర సంవత్సరం పాటు డాక్టర్ల పర్యవేక్షణలో వుండాలి. అసలు నెల తప్పిన తరువాత చెకప్స్ చేయించుకోవడానికే అశ్రద్ధ చేసిన మీరు అంత కాలం మేము చెప్పిన జాగ్ర





త్తలు తీసుకోగలరా? అప్పటికైనా జాగ్ర త్తగా వుండకపోతే మీ భార్య ప్రాణాలు మీరే చేతులారా తీసినవారవుతారు. అదే జరిగితే అది హత్యే అవుతుంది" తీవ్రంగా వుంది ఆమె స్వరం.

అవమానభారంతో ఆమెవద్ద సెలవు తీసుకుని బయటకు వచ్చాను. ఆలోచనలతో బయట పడిన నేను కోటిలింగాల రేవు చేరు కున్నాను. గోదావరివైపు నుండి వస్తున్న పిల్ల వాయువులు మనసుని కాస్త సేదతీర్చాయి. డాక్టరుగారి మాటలే మనసులో మెదులుతు న్నాయి. భవిష్యత్తు అగమ్యగోచరంగా వుంది. నిజంగా మా ఊరు వెళ్ళిన తరువాత డాక్టరుగారు చెప్పినట్టు రెగ్యులర్‌గా చెకప్‌కి వస్తుందా సుధ? నిస్సందేహంగా రాదు. ఇక చేయగలిగిందేముంది? ఆమె కోరుకున్నట్టు హైదరాబాదుకే మకాం మార్చక తప్పదేమో? కానీ, మా ఊరు, మేము ప్రారంభించిన యాక్టివిటీస్? అవన్నీ వుంటాయి. కానీ ఆ ఆనందాన్ని పంచుకోవడానికి నేను మాత్రమే వుండను. సిటీ చేరి ఆ యాంత్రిక జీవితానికి అలవాటుపడక తప్పదు. ఉద్యోగానికి రిజైన్‌చే యడానికే స్థిరంగా నిర్ణయించుకున్నాను.

ఆలోచనలనుండి బయటపడి ఈ లోకం లోకి వచ్చిన నేను ఉలిక్కిపడ్డాను. చుట్టూ చీకట్లు ముసురుకుని వున్నాయి. తెలియ కుండానే చాలాసేపు అలా కూర్చుండి పోయానన్నమాట. నేనేమైపోయానో తెలి యక అందరూ కంగారు పడుతున్నా రేమో? ఒక్కక్షణం ఇక్కడకు వచ్చే రోజు నేనేమైపోయానో తెలియక కంగారుపడిన సంఘటన గుర్తుకు వచ్చి హాస్పిటల్‌కి బయలుదేరాను. ఏమైనా ఒక నిర్ణయానికి వచ్చిన నా మనసు తేలికపడింది.

నాలుగు రోజులు కాస్త టెన్షన్‌తోనే గడి చాయి. మొదటి రెండురోజులూ, గడచిన తరువాత సరస్వతితోపాటు దాసుగారినీ, రుక్మిణమ్మగారినీ మా ఊరు పంపించి తను మాత్రం హాస్పిటల్‌లోనే వుండిపోయాడు జ్ఞానేశ్వర్.

పది గంటలకు డాక్టర్ రాజేశ్వరి రౌండ్స్‌కి వచ్చారు. "మొత్తానికి అదృష్టవంతురాలివి. ఇంతకాలం నిర్లక్ష్యం చేసినా బతికి బయట పడ్డావు" సుధతో అంటూ నా వైపు తిరి గారు.

"మీ ఊరివారు చాలా గొప్పవాళ్ళయ్యా! బ్లడ్ ఇవ్వడానికి పాతికమంది వచ్చారంటే, అందులో ఇద్దరిదే ఆమెకు సూట్ అయింది. అందులో ఒక కుర్రాడు మరో బాటిల్ ఇస్తానని కూర్చున్నాడు. మీ ఆవి డది చాలా రేర్ గ్రూప్"

అవును మరి ఆవిడది రేర్ పర్సనాలిటీ కదా!

సుధ మనసులో ఏం వుందో కానీ, పైకి ఏమీ మాట్లాడడంలేదు. ఇదివరకటి చిరా కులు లేవు కానీ, ఇంకా తనలో ఏమైనా మార్పు వచ్చిందా అన్నది తెలియడంలేదు. చివరకు సుధను డిశ్చార్జ్ చేసేరోజు కూడా దగ్గరపడింది. దాసుగారు మాత్రం ఖచ్చి తంగా చెప్పేశారు హైదరాబాదు వెళ్ళి ఇక అక్కడ ఉద్యోగ ప్రయత్నాలు చేసుకోమని. సరే నేను నిర్ణయించుకున్నదీ అదే కదా! ఆ ప్రయత్నాలలో పడ్డాను.

ఆ రోజు అందరూ బయటకు వెళ్లారు. సుధకు నేను హైదరాబాదులో ఉద్యోగప్ర యత్నాలు చేస్తున్న విషయం చెప్పాను. అంతే కాదు ఒక వారం రోజుల్లో హైదరా బాదు వెడుతున్న విషయం కూడా చెప్పాను. సుధ నా చెయ్యి పట్టుకుని ఏదో చెప్పబోయింది. అంతలో జ్ఞానేశ్వర్ లోప లకు వచ్చాడు.

సుధ పల్స్ చూడడానికి ఆమె చేతిని పట్టుకోబోయి చటుక్కున చేతిని వెనక్కి తీసుకున్నాడు.

సుధ అతని చేతిని గట్టిగా పట్టుకుని 'తమ్ముడూ' అనగానే మేమిద్దరం సంభ్ర మంగా చూశాం.

"నేను నీ రక్తాన్ని పంచుకున్న నీ అక్కని

కదూ!" సుధ మనస్తత్వం తెలిసిన జ్ఞానేశ్వర్ తను బ్లడ్ డొనేట్‌చేసిన విషయం ఆమెకు తెలియకూడదనుకున్నాడు.

"అక్కయ్యగారూ!" సంభ్రమంగా అన్నాడు.

"ఇన్నాళ్లూ నీ మనసుకి కష్టం కలిగించినందుకు నన్ను క్షమించు తమ్ముడూ!" సుధ కంటిలో సన్నని నీటితెర.

"ఎంత మాట అక్కయ్యగారూ! ఇన్నాళ్లకు మీరూ మాలో ఒకరౌతున్నారంటే, మాకెంత సంతోషంగా వుందో తెలుసా! కానీ, మాస్టారు చూడండి, ఊరు విడిచి వెళ్ళిపోవడానికి ఏర్పాట్లు చేసుకుంటున్నారు" నిష్ఠూరంగా అన్నాడు.

"నాకు పునర్జన్మనిచ్చింది మీ ఊరివారు. మిమ్మల్ని వదలి నేను ఎక్కడకు వెడతాను తమ్ముడూ! మీ మాస్టారు, వెడితే ఆయన వెడతారులే, నేను మాత్రం మీ ఊరిలోనే వుండబోతున్నాను" జ్ఞానేశ్వర్ సంతోషంగా బయటకు వెళ్లాడు.

తెల్లబోయి చూస్తున్న నా చేతిని తన చేతిలోకి తీసుకుంది.

"నన్ను క్షమించండి. ఇన్నాళ్లూ నా అహంభావంతో మీ మనసుని బాధ పెట్టాను. మీ మంచితనాన్నీ, ఊరివారి మంచితనాన్నీ అర్థంచేసుకోలేకపోయాను. డాక్టరుగారు జరిగినదంతా చెప్పి నా కళ్లు తెరిపించారు"

నాకు జ్ఞాపకం వచ్చింది. నాలుగు రోజుల క్రితం బయటనుంచి వచ్చి గదిలోకి వెళ్ళబోతుండగా గదిలోంచి డాక్టరుగారి మాటలు వినిపించి గుమ్మం బయటే వుండిపోయాను.

"నువ్వు ఈ రోజు బతికి బయటపడ్డావంటే, అది మీ ఊరివారి, ముఖ్యంగా డాక్టర్ జ్ఞానేశ్వర్ చలవ. నువ్వు నిజంగా కృతజ్ఞతలు చెప్పుకోవలసింది అతనికే. నిన్ను ఇక్కడకు తీసుకు వచ్చి ఎడ్మిట్ చేయడమే కాదు, అతను బ్లడ్ ఇచ్చి వుండకపోతే నువ్వు అసలు బతికి వుండేదానివి కాదు"

ఒక్క క్షణం ఉలిక్కిపడ్డాను. సిసింద్రీ రక్తం ఎక్కించారంటే ఏం గొడవ చేస్తుందోనని ఆమెకు తెలియకుండా వుంచాలని నిర్ణయించుకున్నాం. ఇప్పుడిక తుఫానే? లోపల నుంచి డాక్టరుగారి మాటలు వినిపిస్తున్నాయి.

"ఒక్క జ్ఞానేశ్వర్ అన్న మాటేమిటి? మిగిలిన కుర్రాళ్లు...? మా టెక్నీషియన్ చెప్పాడు. అందరూ మా రక్తం తీసుకో, మా రక్తం తీసుకో అని ఒకటే గొడవట. అరె! నేను ప్రాక్టీసు పెట్టి పాతికేళ్లు అయింది. ఇంతవరకూ ఒక్క పేషంటుకి రక్తం ఇవ్వడానికి ఇంతమంది పోటీపడడం నేను చూడలేదు. నీకోసం వాళ్లు ఎంత శ్రమపడ్డారో నీకు తెలియదు. దాసుగారు మాత్రం? ఎనభైయేళ్ల వయసులో నీకోసం రాత్రంతా మెలుకువగా ఇక్కడే కూర్చుండిపోయారంటే ఆలోచించు. నువ్వంటే వారికెంత అభిమానమో? ఆయన భార్య సెలైన్ పెడుతున్న నీ చేతిని పట్టుకుని తెల్లవార్లూ అలా కూర్చునేవున్నారు. నిజంగా వాళ్ల రుణం నువ్వు తీర్చుకోలేవమ్మా! ఒక దశలో నీకేమైనా అయితే మీ కుర్రాళ్లు మా నర్సింగ్ హోంను ఏం చేస్తారోనని భయపడ్డాను. అప్పుడు జ్ఞానేశ్వర్ చెప్పాడు నీ భర్త గురించి. నిజంగా అటువంటి భర్తను పొందగలిగిన నువ్వు అదృష్టవంతురాలివి"

"తన అదృష్టమేదో తను తెలుసుకోగలిగిన స్థితిలో మా అమ్మాయి లేదు లెండి డాక్టరుగారూ!" నిష్ఠూరంగా అంటున్నారు మా అత్తగారు.

"మీ అమ్మాయికిది పునర్జన్మ. ఇప్పుడు అన్నీ సవ్యంగా తెలుసుకుంటుంది లెండి" డాక్టరుగారి అడుగుల చప్పుడు వినిపిస్తుంటే మెల్లిగా పక్కకు తప్పుకున్నాను. సుధకు ఎదురుపడే సాహసంలేక ఆ రోజంతా బయటే గడిపాను. తరువాత కూడా సుధ ఇంకా ముభావంగా వుండడంతో నేనూ మౌనం వహించాను.





డాక్టరుగారి మాటలు సుధమీద బాగానే పనిచేశాయి, గత ఏడేళ్లుగా నేను మార్చలేని సుధను ఆమె మాటలు మార్చాయన్న మాట. అవును మరి శంఖంలో పోస్తే కానీ తీర్థంకాదు.

అందరం సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చాం.

ఆరోజు అమ్మా, నాన్నగారూ హైదరాబాదు బయలుదేరుతున్నారు. ఈ పది రోజులుగా సుధ ప్రవర్తన పెద్దవాళ్ళనందరినీ సంతోషపెట్టింది.

జరిగిన సంఘటనతో నాన్నగారి ఆలోచనల్లోనూ మార్పు వచ్చింది.

"మొన్న హాస్పిటల్లో మీ ఊరి కుర్రాళ్లను చూశాకా అర్థమైంది బాబూ! నీ నిర్ణయం సరియైందని. కంగ్రాట్యులేషన్స్. ఈ పదిరోజులూ ఇక్కడ గడిపిన తరువాత అర్థమైంది అసలైన అభిమానాలెలా వుంటాయో? నాకు కూడా రిటైరయిన తరువాత ఇక్కడకు వచ్చి సెటిలవ్వాలనే కోరిక పుడుతోందయ్యా! నాకు కూడా మీ యాక్టివిటీస్‌లో పాలుపంచుకోవాలని వుంది. వీలయితే నాలుగెకరాలు కొబ్బరితోట కొనడానికి అవకాశం వుంటుందేమో చూడు. రిటైరయిన తరువాత నేనూ, మీ అమ్మా కూడా ఇక్కడకు వచ్చేస్తాం"

"దేముడు నిన్ను చల్లగా చూడాలి బాబూ" నా తలమీద చెయ్యి వేసి అంది అమ్మ. నా మనసు సంతోషంతో ఎక్కడికో వెళ్ళిపోయింది.

నా జీవితం ఇప్పుడు అక్షరాలా నందనవనంలాగే వుంది. సుధ ప్రయివేటుగా బి.ఏ.కి కట్టింది. తన స్నేహితురాళ్లతో కలసి మహిళాసంఘం ప్రారంభించింది. ఇప్పుడు నన్ను సతాయించడానికే కాదు, సినిమాలు చూడడానికి కూడా క్షణం తీరిక వుండడంలేదు. కాలం ప్రశాంతంగా గడచిపోతోంది.

నేను కన్న కల పంచరంగుల కలలా మారి, పంచకల్యాణిలా పరుగులు తీస్తోంది.

★ ★ ★

ఆ రోజు నవంబరు ఆరవ తేదీ

ఆ రోజు రాత్రి కోనసీమ వాసుల పాలిట కాళ రాత్రి. సాయంత్రం మామూలుగానే లైబ్రరీకి వెళ్ళాం. సాయంత్రం నుండే వర్షం ప్రారంభమైంది. రాత్రి ఎనిమిది గంటలకు గాలీ, వానా ప్రారంభం కావడంతో వాతావరణం బాగులేదని ఇళ్లకు బయలుదేరాం. సరిగ్గా ఇల్లు చేరేసరికి కరెంటు కట్. కిటికీ తలుపులు అన్నీ బిగించుకుని పడుకున్నాం. కానీ ఈదురు గాలులు, కుంభవృష్టితోపాటు మిన్ను విరిగి మీద పడుతున్నట్లు భయంకరమైన శబ్దాలు. దడదడలాడే గుండెలతో నేనూ సుధా అలా కూర్చునే వున్నాం ఒకరికొకరు ధైర్యం చెప్పుకుంటూ. ఆ చీకట్లో బయటకు వచ్చి మాత్రం ఏం చేయగలం? తెల్లవారుఝాముకు కాస్త కళ్లు మూతలుపడ్డాయి.

తెల్లవారి తలుపు తట్టిన శబ్దం కావడంతో బద్ధకంగాలేచి బయటకు వచ్చాను. ఎదురుగా దాసుగారు చాలా ఆందోళనగా వున్నారు.

రాత్రి గాలివానకు దాసుగారి ఇంటి ఆవరణలోని మొక్కలన్నీ నేలకు వాలిపోయి వున్నాయి. పారిజాతం చెట్టు సగానికి విరిగిపోయి గేటుకి అడ్డంగా పడి వుంది. రోడ్డుకి రెండువైపులా వున్న వృక్షాలు నేలమీదకు ఒరిగిపోయి వున్నాయి.

"సాగర్! పద, డాబా మీదకు వెళ్ళి చూద్దాం. రాత్రి గాలివానకు చాలా నష్టం కలిగినట్లుంది"

మౌనంగా దాసుగారిని అనుసరించి డాబామీదకు వెళ్లాను. తీరా పైకి వచ్చి చూస్తే ఏముందీ? అంతా భీభత్సమే. ఏదో మామూలు గాలివాన అనుకున్నాను కానీ, మరీ ఇంత దారుణంగా వుందనుకోలేదు.

ఇంకా మిగిలిన పరిసరాలు చూసేటప్పటికి మనసంతా కలచివేసినట్లు అయింది. కనిపించినంత మేరా దట్టమైన కొబ్బరి

చెట్లతో కళకళలాడే కొబ్బరి తోటలు నేలవాలిపోయాయి. అక్కడక్కడా వున్న కొబ్బరి చెట్లు సహితం యుద్ధభూమిలో, తలలు వాల్చిన క్షతగాత్రులల్లా వున్నాయి. దూరంగా కొన్ని పెంకుటిళ్లు కూలిపోయి వున్నాయి.

"మైగాడ్! పద, ఒక్కసారి అలా ఊళ్లోకి వెళ్లివద్దాం. మీ యువరక్షా సమితివారికి కబురుచెయ్యి. ఊళ్లో ఎంత దారుణంగా వుందో పరిస్థితి చూడాలి"

రాత్రి గాలివానకు రోడ్లన్నీ బురదగా వుంటాయి. రోడ్డుకి అడ్డంగా పడిపోయి వున్న వృక్షాలు. ఈ వయసులో దాసుగారు ఎలా నడవగలరు?

"ఎందుకు సార్! నేను వెళ్ళి చూసివస్తాను" అంటున్న నన్ను చూసి మెల్లిగా నవ్వారు.

"ఏమిటీ, ఈ ముసలాయన ఏం నడవగలడులే అనుకుంటున్నావా? పద, కబుర్లతో కాలక్షేపం చేసే టైము కాదు" అంటూ ముందుకు దారితీశారు. మౌనంగా అనుసరించాను.

నాలుగు అడుగులు వేసేసరికి హరినారాయణగారూ, మరి నలుగురు సంపన్న రైతులూ ఎదురు వచ్చారు. ఎవరో సన్నిహితుణ్ణి శ్మశానంలో దహనం చేసి వచ్చినవారిలా దిగాలు పడివున్నారు.

అందరం కలసి రెండుమూడు వీధులు తిరిగేసరికి హృదయవిదారకమైన దృశ్యాలు కళ్లబడ్డాయి. కూలిపోయిన వృక్షాల కింద చిక్కుకుపోయి ప్రాణాలను పోగొట్టుకున్నవారు ఎందరో? చాలా పెంకుటిళ్లు నేలమట్టమయ్యాయి. పూరిపాక అన్నది మిగలలేదు.

"దారుణం జరిగిపోయింది దాసుగారూ! ఇంతటి దారుణం మనం ఎప్పుడూ కళ్ళ చూడలేదు" హరినారాయణగారి గొంతు వణికింది. ఆయన మాట పూర్తికాకుండానే జ్ఞానేశ్వర్, సరస్వతీ కంగారుగా వస్తూ కనిపించారు.

"బాబుగారూ!" అంటూ మేం కనిపించగానే దాసుగారిని పట్టుకుని ఒక్కసారిగా గొల్లుమన్నాడు జ్ఞానేశ్వర్.

"ఏమిటి? ఏమైంది? " ఆత్రుతగా అడిగారు దాసుగారు.

"మా వాళ్లు...! మా వాళ్ళు!" అతనికి నోటివెంట మాట రావడంలేదు.

సరస్వతి కల్పించుకుంది. "మా వాడలోని ఇళ్లన్నీ నేలమట్టమయ్యాయని ఇప్పుడే ఎవరో వచ్చి చెప్పారు. మా వాళ్లంతా ఎలా వున్నారోనని ఆందోళనగా వుంది బాబుగారూ!"

"ముందు అక్కడకే వెడదాం పదండి" అంటూ జ్ఞానేశ్వర్‌ని దగ్గరకు తీసుకున్నారు. "బాబూ! ధైర్యంగా నిలబడి ముందు కార్యక్రమం గురించి ఆలోచించవలసిన ఈ సమయంలో ఇలా డీలా పడిపోతే ఎలా? మీ వాళ్ళకు ఏ ప్రమాదమూ జరగదు. నువ్వు నమ్ముకున్న ఆ దేవుడు నీకెప్పుడూ అన్యాయం చేయడు"

అందరమూ ఆత్రుతగా ముందుకు నడిచాం. అడ్డంవచ్చిన చెట్లను దాటుకుంటూ, కొమ్మలను తప్పించుకుంటూ బయలుదేరాం. వాటిమధ్య చిక్కుకున్న శవాలవైపు కన్నెత్తి కూడా చూడలేదు.

హరిజనవాడలోకి అడుగు పెడుతూనే ఎదురుగా కనిపించిన దృశ్యాలకు నిశ్చేష్టులమయ్యాం. మొత్తం ఇళ్లన్నీ నేలమట్టమయ్యాయి. తీర్చిదిద్దిన కాలనీలా వుండే వాడకు ఇప్పుడు రూపురేఖలు లేవు. కూలిపోయిన ఆ ఇళ్ళకింద ఎవరైనా సజీవంగా వుంటారనే ఆశ లేదు.

"హరినారాయణగారూ! నడుం బిగించండి. మనవాళ్ళనందరినీ ఇక్కడకు రమ్మని కబురుచేయండి. ఈ శిథిలాల కింద కొంతమందైనా ప్రాణాలతో వుండకపోరు" అంటూ దాసుగారు ముందుకు నడిచారు.

జ్ఞానేశ్వర్ డాక్టరైన తరువాత అప్పటివరకూ వున్న తాటాకు యింటిని తీసివేసి




పెంకుటిల్లు కట్టించాడు. అతని ప్రయోజకత్వానికి తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ ఎంతగానో సంతోషపడ్డారు. ఆ కాలనీలో అది ఒక్కటే పెంకుటిల్లు. ఆ పెంకుటింటితోపాటు అన్నీ నేలమట్టమయ్యాయి.

ముందురోజు రాత్రి గూడెంలోని ఒక అమ్మాయికి సిజేరియన్ ఆపరేషన్ చేయవలసి రావడంతో రాత్రంతా జ్ఞానేశ్వర్ దంపతులు నర్సింగ్‌హోంలోనే వుండిపోవలసి వచ్చింది. పేషెంటుతోపాటు సహాయంగా వచ్చిన వారు కూడా హాస్పిటల్‌లో వుండిపో. వడంతో వారంతా బతికి బయటపడ్డారు.

"ముందు కూలిపోయిన ఇళ్ల కింద ఎవరైనా ప్రాణాలతో వున్నారేమో, పని ప్రారంభించండి" అంటూ దాసుగారు జ్ఞానేశ్వర్ ఇంటిదగ్గర ప్రారంభించారు. అప్పుడు వినిపించాయి పక్క ఇంటి నుంచి సన్నగా మూలుగులు. దానితో హరినారాయణగారు కొంతమంది యువకులను తీసుకుని అక్కడ పని ప్రారంభించారు.

జ్ఞానేశ్వర్ ఇంటి శిథిలాలను తొలగిస్తూ వుండగా హృదయవిదారకమైన దృశ్యం కంటబడింది. మొత్తం కుటుంబమంతా ఆ శిథిలాల మధ్య చిక్కుకుని ప్రాణాలు విడిచారు. ఒక గదిలో సిసింద్రీ వదినగారు ఒక ఎత్తయిన కర్రపెట్టి మీద తలను వాల్చుకుని రెండుమోచేతులనూ నేలకు ఆనించి బోర్లాపడుకుని వుంది. తలలు చితిగిపోయి, నడుం విరిగిపోయి పడివున్న తన వాళ్ళను చూసి సిసింద్రీ ఒకటే ఏడుపు.

"వీళ్ళ ప్రాణాలు తీయడానికే ఈ ఇల్లు కట్టానేమో? తాటాకు ఇల్లు అయితే కనీసం కొంతమందైనా ప్రాణాలతో వుండేవారేమో? వీళ్ళ ప్రాణాలను తీసి నేను మాత్రం హాయిగా హాస్పిటల్‌లో వుండిపోయి నా ప్రాణాలను రక్షించుకున్నాను" అంటూ ఒకటే ఏడుపు. అతనికి ధైర్యం చెప్పే సాహసంలేక అలా నిస్సహాయంగా చూస్తూ వుండిపోయాం.

అప్పుడు వినిపించింది తల్లి శవం కింద నుండి పసిబిడ్డ ఏడుపు. చటుక్కున ఆమె శవాన్ని పక్కకు తొలగించి చూస్తే అక్కడ ఆరునెలల పసిబిడ్డ సజీవంగా వుంది. దాసుగారు రెండడుగులు ముందుకు వేసి ఆ పసిబిడ్డను ఎత్తుకుని గుండెలకు హత్తుకున్నారు.

"అంటే...! తామంతా చనిపోతామని తెలిసి ఆ తల్లి తన బిడ్డను కాపాడుకోవడానికి ఆ కర్రపెట్టెను ఆసరా చేసుకుందన్నమాట. మాతృప్రేమ అంటే ఇదే" ఏనాడూ ధైర్యాన్ని కోల్పోని దాసుగారు ఆ మాటలు అంటుంటే అందరికీ కళ్లనీళ్ళు తిరిగాయి. దాసుగారి కళ్ళనుండి ఏకధాటిగా కన్నీరు కారి ఆ పసిబిడ్డపై పడుతోంది.

"అయ్యో! నా బిడ్డా! ఎంతలో ఎంత అన్యాయం జరిగిపోయిందే? నా బిడ్డ పెద్ద ఇల్లు కట్టాడు. ఇలాంటి గాలివానలు ఎన్ని వచ్చినా చెక్కుచెదరదు. మీ అందరూ వచ్చి మా ఇంట్లో తల దాచుకోమని చెప్పావు కదే! నీ కుటుంబమే అన్యాయం అయిపోయింది కదే!" ఎనభై యేళ్ల వృద్ధురాలు గుండెలు బాదుకుంటూ వచ్చింది.

జ్ఞానేశ్వర్ నేలమీద పడి ఒకటే ఏడుపు.

మరుక్షణంలోనే తేరుకున్నారు దాసుగారు. "క్విక్! అలా ఏడుస్తూ కూర్చుంటే లాభంలేదు జ్ఞానేశ్వర్! ఈ పసిబిడ్డ ప్రాణాలు కాపాడడానికి ఆ తల్లి చేసిన త్యాగం గుర్తుంచుకో. ఇక్కడ పని చేయడం కోసం మేము వున్నాం. నువ్వు హాస్పిటల్‌కి వెళ్లు. వెళ్లేటప్పుడే హాస్పిటల్‌లో సాయం చేయడానికి సుధనూ, ఆమె స్నేహితురాళ్లనూ తీసుకు వెళ్లు, దెబ్బలు తగిలిన వారిని అక్కడకు పంపిస్తాం. అక్కడ వున్న మగవారిని ఇక్కడకు పంపించు. హరినారాయణగారూ! అందరమూ ఇక్కడే వుంటే లాభం లేదు. కొంతమందిని ఊళ్లోకి పంపించి అక్కడి వారి పరిస్థితి ఎలావుందో తెలుసుకోండి. ఇళ్లు పోగొట్టుకున్నవారినందరినీ,

కాలేజీ దగ్గరకు చేర్చుదాం. దెబ్బలు తగిలిన వారినందరినీ హాస్పిటల్‌కి చేర్చుదాం. ఇక శవాలను ఎప్పటికప్పుడు డైరెక్టుగా శ్మశానానికి చేర్చండి. ఫార్మాలిటీస్‌కి ఇది సమయం కాదు" అంటూ ఆ పసిబిడ్డను రుక్మిణమ్మ గారి దగ్గరకు పంపించారు.

శిథిలాలమధ్య చిక్కుకుని కొనప్రాణాలతో వున్నవారిని బయటకు తీసి మంచాలమీదుగానే వారిని హాస్పిటల్‌కు తీసుకువెడుతున్నారు. శవాలను ఎప్పటికప్పుడు శ్మశానానికి చేరుస్తున్నారు.

ఆ రోజంతా నిర్విరామంగా పనిచేస్తే అప్పుడు పరిస్థితి అర్థమైంది. గాయాలు తగిలిన వాళ్లను సిసింద్రీ హాస్పిటల్‌కి పంపించి, ప్రాణాలతో మిగిలిన వారిని కాలేజీకి చేర్చాం. వారికి భోజనాలు ఊళ్లోంచి వచ్చే ఏర్పాటు చేశారు.

తరువాత కార్యక్రమం నిర్ణయించడానికి దాసుగారు అందరినీ కాలేజీ దగ్గరకు రమ్మన్నారు. అందరూ వచ్చేసరికి రాత్రి తొమ్మిది గంటలు అయింది. ఒక్కరి మొహంలోనూ జీవకళ లేదు.

నిజమే కోనసీమలో పదెకరాల కొబ్బరి తోట వున్న ఆసామి శ్రీమంతుడి కిందే లెక్క. ఇప్పుడదంతా నాశనమైపోయింది. నెలనెలా వచ్చే వేలాది రూపాయల ఆదాయం తుఫాను పాలైంది. ధాన్యం పండే భూమి అయితే మళ్లీ పంటలకు ఆదాయం వస్తుందనే ఆశ వుంటుంది. కానీ, కొబ్బరి తోట నేలమట్టమైతే, తిరిగి మామూలు స్థితికి రావడానికి పదేళ్లకాలం పడుతుంది.

కరెంటు లేదు. న్యూస్‌పేపర్లు వచ్చే అవకాశం లేదు. న్యూస్‌కోసం ట్రాన్సిస్టరే ఆధారం. పెట్రోమాక్స్ లైట్ల వెలుగులో మీటింగు ప్రారంభమైంది.

దాసుగారు ఒక్కటే చెప్పారు. "మనకు చేతనైన పనులు మనమే చేసుకుందాం. రేపు రోడ్లన్నీ శుభ్రంచేయాలి. మన ఊరివారికి ఆపద వచ్చినప్పుడు వారిని ఆదుకోవలసిన బాధ్యత మనది. ప్రభుత్వ సహాయం కోసం ఎదురుచూస్తూ చేతులు ముడుచుకుని కూర్చోవలసిన అవసరంలేదు. అందుకు స్వచ్ఛందంగా సేవ చేయడానికి ముందుకు వచ్చే వారెవరో చెప్పండి. ఒక్క విషయంలో మాత్రం మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. సహాయం చేయడానికి వచ్చిన ప్రతి వారి దగ్గరా మనం చేతులు చాపకూడదు. మన కాళ్ళమీద మనం నిలబడదాం"

"అదేమిటి బాబుగారూ! ప్రభుత్వంవారు స్వయంగా వచ్చి సహాయం చేస్తామంటే కాదనడం ఎందుకు? " హరినారాయణగారి పాలేరు ప్రశ్నించాడు. అతడు ఆరోజు ఏదో పని వుండడంతో వారి యింటి వద్దనే వుండిపోయాడు. అతని భార్య పిల్లలను తీసుకుని పుట్టింటికి వెళ్లింది. దానితో ఆ కుటుంబానికి ప్రమాదం తప్పింది.

దాసుగారు నవ్వారు. "ప్రభుత్వం అది చేసే సహాయం ఎటూ చేస్తుంది. రోడ్లు వేయడం మనం చేయలేం. ఆ పని ప్రభుత్వం చేత చేయిద్దాం"

"అది ఎటూ ప్రభుత్వం చేయవలసిన పనేగా బాబుగారూ! అలా కాకుండా ఇలాంటి సందర్భాలలో ప్రభుత్వం ధన సహాయం కూడా చేస్తుందిగా! వచ్చేదాన్ని వదులుకోవడం ఎందుకు? " మళ్ళీ రెట్టించాడు ఆ యువకుడు.

"అంటే, ప్రభుత్వం వారు వచ్చి విచారణ చేసి, నష్టాన్ని అంచనా వేసి సహాయం అందించేవరకూ మన ఊరిని శ్మశానంలాగే వుంచుకుందామంటారా? అలాగైతే ఇక మీ ఇష్టం. మన ఊరిని శుభ్రపరచుకోవాలని మేమంతా కష్టపడుతున్నాం. కానీ మీరు మట్టిలోనే పొర్లుతామంటే మాకేం పట్టింది? " తీవ్రంగా అన్నారు హరినారాయణగారు.

"అలా కోపగించకండి బాబూ! అందరం ఒకటేనని మీరు అంటున్నారు. మీ





మాటను కాదని మేమెలా అంటాం" ఒక వృద్ధుడు కల్పించుకున్నాడు.

"చిన్నతనం, వాడేదో తెలియక అంటే అన్నాడులే బాబూ! మేమేం చేయాలో మీరు చెప్పండి" మరొకతను ముందుకువచ్చాడు.

దాసుగారు మాట్లాడడం ప్రారంభించారు. "ముందుగా రేపు శవదహనాలు జరిగిపోవాలి. ఆ పని మాధవరావుగారి ఆధ్వర్యంలో యువరక్షా సమితి సభ్యుల సహకారంతో జరుగుతుంది. తరువాత మన గ్రామానికి జరిగిన నష్టాన్ని అంచనా వేయాలి. ఆ పనిని జగన్మోహనరావుగారు వీడివోగారి సహాయంతో చేస్తారు. రోడ్లపై పడి వున్న చెట్లను తొలగించాలి. ఆ పని హరినారాయణగారి ఆధ్వర్యంలో జరుగుతుంది. ప్రిన్సిపాల్‌గారు కాలేజీకి పదిరోజులు సెలవులు ప్రకటిస్తారు. ఈ లోగా ఈ పడిపోయిన వాసాలతోటే తాత్కాలికంగా షెడ్లు నిర్మిద్దాం. దానికి సాగర్ బాధ్యత తీసుకుంటాడు. అంతవరకూ మీ బస ఇక్కడే. మీకు భోజనాలు సప్లయ్ చేసే బాధ్యత మాది. ఆ పని జగదీష్ చూసుకుంటాడు. మీరు షెడ్లలో వుంటూ ఇళ్లు నిర్మించుకోవచ్చు. మరోసారి ఇలాంటి ప్రమాదం రాకుండా ఈసారి పక్కా ఇళ్లు కట్టిదాం. ఆ పని నేను చూసుకుంటాను"

"తరుఫాత కొబ్బరి దింపుల వారు మొవ్వ విరిగిన కొబ్బరి చెట్లకు మొవ్వులు కోసేయాలి. మీ ఇళ్లే కాదు. ఊళ్లో పెంకుటిళ్లు కూడా మొండి గోడలతో మిగిలాయి. వారికీ ఇదే సహాయం అందజేయాలి. పెంకువేసేవారు రేపటి నుంచే వాళ్ళ పనులు ప్రారంభించాలి. మనమంతా ఒక ఊరి వాళ్ళమే కాదు, ఒక కుటుంబం వాళ్లం. పరిస్థితులు చక్కబడేవరకూ అందరికీ ఇక్కడే వంట, ఇక్కడే భోజనం మాతో సహా" దాసుగారి మాటలకు అందరూ అంగీకారం తెలియజేశారు. అప్పటికే అర్ధరాత్రి కావడంతో అందరూ ఇళ్లకు బయలుదేరారు. పెద్దలంతా ఇల్లు చేరినా మాకు ఇంకా ఏదో చేయాలని వుంది.

"ఈ పెద్దాళ్లంతా ఇలాగే కబుర్లు చెబుతారురా! వాళ్లు మేడల్లో హాయిగా వుండాలి మనం మాత్రం ఇలా నేలబారునే వుండాలి" కసిగా అంటున్న మాటలు వినిపించి చటుక్కున ఆ మూలకు చూశాను.

హరినారాయణగారి పాలేరు మరో నలుగురిని ఒక మూలకు తీసుకు వెళ్ళి మంతనాలు జరుపుతున్నాడు.

"అవునురా! లేకపోతే ప్రభుత్వం వారిచ్చిన సహాయాన్ని తీసుకోవద్దనడమేమిటి? ప్రభుత్వం వారు డబ్బులిస్తారు. ఉచితంగా బియ్యం ఇస్తారు. తరువాత ఎవరెవరో వస్తారు, పాతబట్టలు, బియ్యం ఇలాంటి వన్నీ ఇస్తారు. నిజంగా మనం అవన్నీ తీసుకుంటే కొన్నాళ్లవరకూ హాయిగా కాలు మీద కాలువేసుకుని కాలం గడిపేయవచ్చు అవన్నీ తీసుకోవడానికి వీల్లేదంటే, మన బతుకులు ఎప్పటిలాగే గొర్రెతోకలే" మరో యువకుడు అందుకున్నాడు.

"అది కాదురా! పాపం, ఆ పెద్దాళ్లంతా మనతోపాటే పాటుపడుతున్నారు కదరా! వాళ్ల పాటికి వాళ్ళు ఇంట్లో కూర్చుంటే వాళ్లకి గడవదా? పైగా మన బాధ్యత వాళ్లు తీసుకుంటున్నారు. ఉచితంగా ఇళ్లు కట్టిస్తామంటున్నారు"

"చాల్లే అవన్నీ గవర్నమెంటు వాళ్లొచ్చి వీళ్లను మెచ్చుకుని మేకతోలు కప్పేవరకే. పేపర్లలో వాళ్ళ ఫొటోలు వచ్చిన మర్నాడు అందరూ మొహం చాటేసేవారే" మరో యువకుడు కసిగా అంటున్నాడు.

"చూశారా, మాస్టారూ! వీళ్ల కోసం మన మందరం తిండీ తిప్పలు లేకుండా పనిచేస్తుంటే ఎలా మాట్లాడుతున్నారో? వుండండి. వాళ్ళ విషయమేమిటో తేల్చుకుని వస్తాను" ఆవేశంగా వెళ్ళబోయిన రమేష్‌ని చెయ్యిపట్టుకుని ఆపేశాను.

"రమేష్! దీన్నొక పెద్ద ఇష్యూ చేయకు.

ఈనాటి పరిస్థితుల్లో వారికి మనుషుల్లో నమ్మకం పోయింది అంతే. అందుకు వారిని చూసి జాలిపడు. పైగా మనమంతా పెద్ద వాళ్ల గైడెన్సులో పనిచేస్తున్నాం. మనం స్వతంత్రంగా ఏ యాక్షనూ తీసుకోకూడదు. దీనివల్ల మరిన్ని గొడవలు పెరుగుతాయి. చూద్దాం, వాళ్లు ఎంత వరకూ వెడతారో? అవసరమైనప్పుడు ఈ విషయాన్ని దాసుగారి దృష్టికి తీసుకువెడదాం. అంతవరకూ ఈ మాటలు మనం విననట్టుగానే వుండాలి"

"అవును మాస్టారూ! ఆదిలోనే హంస పాదు అన్నట్లుగా మొదటి రోజునే గొడవ ల్లోకి వెళ్లడమేమిటి? " భరత్ అందుకు న్నాడు.

రమేష్ మొహం చిన్నబుచ్చుకున్నా సర్దు కున్నాడు.

"ఏమిట్రా వాగుతున్నారు? ఆ మారాజు లంతా మనతో సమంగా పాటు పడుతుంటే మీరిలా మంచీ చెడ్డా లేకుండా మాట్లాడు తారా? ఇదిగో! ఇప్పుడే చెబుతున్నాను. పెద్దల కట్టుబాటు కాదని మీరేమైనా పిచ్చి వేషాలేస్తే, ఆ బాబుగార్లు కాదురా! మేమే మిమ్మల్ని వెలివేస్తాం. పిచ్చివేషాలేమీ వేయ కండి" గూడెం పెద్ద నరసయ్య వాళ్ళ మాటలు ఎప్పటినుంచి వింటున్నాడో వాళ్ల దగ్గరకు వెళ్ళి చివాట్లు పెట్టాడు.

"పోరా ముసలీ! పుట్టినప్పటి నుండీ మీవి బానిస బతుకులే. అందుకే వాళ్ళంటే హడ లిపోతూ వాళ్ళ అడుగులకు మడుగులు వత్తుతున్నారు" నిర్లక్ష్యంగా అన్నాడు హరి నారాయణగారి పాలేరు.

"సరే! అలాగే అనుకో. నా తడాకా ఏమిటో చూద్దువుగాని"

"ఊరుకో మామా! వాళ్లతో నీకేమిటి? అందరినీ కాదని వాళ్లు మాత్రం ఏం చేస్తారు? మాటకు మాట తెగులు నీటికి నాచు తెగులు అన్నారు. అనవసరంగా వాళ్లని రెచ్చగొట్టకు. వచ్చి పడుకో. ఒరేయ్! మీరు కూడా పోయి పడుకోండి. తెల్లారు తూనే పనిలో పడాలి"

"పోతాంలే, నువ్వు చెప్పలేదనే ఇంతవ రకూ కూర్చున్నాం" మరో యువకుడు నిర్ల క్ష్యంగా అంటూ తన వాళ్లని తీసుకుని వరం డాలోకి వెళ్లాడు.

"చూశారా! అదే మనం కల్పించుకుంటే అనవసరమైన రభస జరిగేది. వాళ్ళ పెద్దలు కల్పించుకున్నారు కాబట్టి వాళ్లూ శాంతించారు. సరే! పదండి"

"ఇప్పుడే ఇళ్లకు వెళ్ళిపోదామా మాస్టారూ!" అయిష్టంగా అన్నాడు సుధా కర్!

"మరి ఏం చేద్దాం? " మాకు పురమాయిం చిన పనులు తెల్లవారిన తరువాత కానీ, చేయడానికి లేదు.

"ముందు మనం హాస్పిటల్‌కి వెడదాం. అక్కడేమైనా పని వుండవచ్చు" అన్నాడు సుధాకర్.

"పని మాట ఎలా వున్నా జ్ఞానేశ్వర్‌కి ధైర్యం చెప్పడమూ అవసరమే" అన్నాడు రమేష్.

"ఒక పని చేద్దాం మాస్టారూ! అందరమూ ఒకేచోట వుండిపోతే ప్రయోజనమేముంది? అందుకని మేము రేపు నలుగురం కలసి రెండు స్కూటర్లలో బయలుదేరి చుట్టుప్ర క్కల ఊళ్లు తిరిగివస్తాం. మిగిలిన ఊళ్లు ఏమైపోయాయో? " అన్నాడు సత్యం.

"అవును అదీ నిజమే, అనవసరంగా అందరూ ఒకేచోట వుండి చేసేదేమిటి? కానీ, ఇప్పటికే అర్థరాత్రి అయింది. ఇప్పుడు హాస్పిటల్‌కి వెళ్లి అక్కడ పనిచేసి తెల్లవా రాకా మిగిలిన ఊళ్లు సర్వేచేయడానికి వెళ్లడం కుదరదు. అందుకని రేపు వెళ్లదల చుకున్న నలుగురూ ఇప్పుడు ఇళ్లకు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. మనమైనా మనుష లమే కానీ, యంత్రాలం కాదుగా. నిర్విరా మంగా పనిచేయిస్తే యంత్రాలైనా మొరా యిస్తాయి. మేము హాస్పిటల్‌కి వెడతాం" నా మాటతో సత్యం, సుధాకర్ రమేష్,





సాగర్ ఇళ్లకు బయలుదేరగా మిగిలిన వారం హాస్పిటల్‌కు బయలుదేరాం.



సిసింద్రీ హాస్పిటల్ జనంతో కిక్కిరిసి పోయి వుంది. అప్పటికీ ప్రమాదకర పరిస్థితిలో వున్న వారిని యాంబులెన్సులో కాకినాడ జనరల్ హాస్పిటల్‌కి పంపిద్దామని ప్రయత్నించాడు కానీ రోడ్లకు అడ్డంగా చెట్లు పడడంతో యాంబులెన్సు వచ్చే దారి కూడా లేకుండా పోయింది. ఇక అన్ని కేసులనూ అతనే చూడక తప్పలేదు.

పేషెంట్ల మూలుగులతో, వారి బంధువుల రోదనలతో హాస్పిటల్‌లో వాతావరణం హృదయవిదారకంగా వుంది. పేషంట్లను నేలమీదే పడుకోబెట్టారు. ఎముకలు విరిగిన వారికి సిమెంటు కట్లు కట్టడానికి అవసరమైనన్ని ప్లాస్టర్ ఆఫ్ పారిస్ బాండేజెస్ కూడా దొరకలేదు. ఇద్దరు కుర్రాళ్లు రవి, కిశోర్ ముందుకు వచ్చి మామూలు సైకిళ్ల మీదనైతే ప్రయాణం చేయడం సాధ్యమౌతుందని ఎక్కడ దొరుకుతాయో చెబుతే తాము వెళ్ళి తీసుకువస్తామనీ ముందుకు వచ్చారు. జ్ఞానేశ్వర్ మండపేటలో ప్రాక్టీసు చేస్తున్న అతని క్లాసుమేటు ఆర్థోపెడిక్ సర్జన్‌కి ఫోనుచేసి పరిస్థితి చెప్పడంతో అతను తన దగ్గర వున్నవికాక వీళ్లువచ్చే సమయానికి తను కాకినాడ నుండి తెప్పించి వుంచుతానని మాట ఇచ్చాడట.

ఉదయం పన్నెండు గంటలకు బయలుదేరిన వాళ్లు అర్థరాత్రి తిరిగివచ్చారు. అక్కడ నుండి ఇక ఒకటే హడావుడి. మేమెంత మంది సహాయంగా నిలచినా డాక్టరు జ్ఞానేశ్వర్ ఒక్కడే. మామూలు దెబ్బలు తగిలిన వాళ్లకు, కుట్లు పడిన వారికీ మేము కట్లు కట్టడం చేసినా ఎముకలు విరిగిన వారికి మేమేమీ చేయలేం. కనీసం సిమెంటు కట్టు కడుతున్నప్పుడు పేషంటు కాళ్లూ చేతులూ అవసరమైన పొజిషన్‌లో పట్టుకోవడం కూడా మాకు చేతకాలేదు. చివరికి ఆ పని సరస్వతీ, జ్ఞానేశ్వర్లే చేయక తప్పలేదు. పేషంట్లతో సతమతమౌతున్న అతనికిక తన వాళ్ళ గురించి విచారించే తీరిక ఎక్కడ వుంటుంది?

అంత విచారకరమైన పరిస్థితిలోనూ సుధ ప్రవర్తన ఎంతో సంతోషాన్ని కలిగించింది. సిసింద్రీని అంటరానివాడని సమయం వచ్చినప్పుడల్లా అందరిలోనూ చిన్నబుచ్చే ఆమె ఇప్పుడు 'తమ్ముడూ!' అంటూ ఎన్నో విధాల ధైర్యం చెబుతోంది. హాస్పిటల్‌లోని రోగులకు ఎన్నో విధాల సేవలు చేస్తోంది. లేవలేని ముసలివాళ్లకు అన్నం తినిపించడం, దెబ్బలు తగిలిన వాళ్లకు డ్రెస్సింగ్ చేయడం నిజంగా చూసి నమ్మలేకపోతున్నాను.

"నీలో ఇంత మార్పు నమ్మలేకపోతున్నాను సుధా!" అంటున్న నావైపు చూసి నవ్వింది.

"ఆ పాత సుధ రాజమండ్రిలోనే వుండిపోయింది. ఎదుటి వారికి సర్వీస్ చేయడంలోని ఆనందాన్ని తెలుసుకున్న నాకిది పునర్జన్మ"

ఆరోజు సాయంత్రానికే తిరిగి వచ్చారు రమేష్ వాళ్ళందరూ. రావడమే తిన్నగా ఇంటికి వచ్చారు. మొహాలు పీక్కుపోయి

నీరసించి వున్నారు. అవును మరి, రెండు రోజులుగా నిర్విరామంగా పని చేస్తున్నారు. వారిని మాట్లాడనీయకుండానే దాసుగారు లోపలనుంచి కొబ్బరి బొండాలు తెప్పించి ఇచ్చారు. తుపాను పుణ్యమా అని ఇప్పుడు కోనసీమలో కొబ్బరి బొండాలకు లోటులేదు.

"ఎలా వున్నాయి మిగిలిన ఊళ్లు?" వాళ్లు కొంత సేద తీరిన తరువాత మెల్లిగా అడిగారు దాసుగారు.

"ఏం చెప్పమంటారు సార్! మనం చాలా అదృష్టవంతులం. మనకు జరిగిన నష్టం ఒక నష్టం కాదు. సముద్ర తీరాన ఊళ్లకు ఊళ్లు కొట్టుకుపోయాయి. భర్తకు దూరమైన దిక్కు లేని ఆడవాళ్ల ఏడుపులు ఇంకా చెవులో గింగురు మంటున్నట్లే వుంది బాబుగారూ!" కళ్లనీళ్ల పర్యంతం అయ్యాడు రమేష్.

"తల్లిదండ్రులను పోగొట్టుకున్న పసివాళ్లు ఆ విషయం తెలియక నీటిలో ఆటలాడుకుంటుంటే మనసంతా కలచివేసినట్లయింది" సాగర్ కళ్లు తుడుచుకున్నాడు.

"ఇక కొబ్బరి తోటల సంగతి చెప్పేదేముంది? ఎకరాలకు ఎకరాలు తుడిచిపెట్టుకుపోయాయి"

"ఏమిటో సార్! ఇప్పుడు కూడా ప్రభుత్వం వారు వచ్చి ఏమైనా చేయాలి కానీ అసలే తుఫాను బాధితులం. మేమేం చేయగలమని కనీసం శవ దహనాలను కూడా చేయకుండా కూర్చున్నారు. ఆ వాసనా అబ్బ భరించలేకపోయాం"

"కనీసం శవ దహనాలైనా మీరు చేసుకుంటే అంటు వ్యాధులు రాకుండా వుంటాయిగా! అని సలహా ఇస్తే ఒక ముసలతను మండిపడ్డాడు. 'మీకేం తెలుసయ్యా! కూరకుంకలు. గవర్నమెంటోళ్లొచ్చినప్పుడు ఇవన్నీ కనిపించాలి. అప్పుడే ఎక్కువ నష్టపరిహారం ఇస్తారు. మంచి సలహా ఇచ్చారు కానీ ఇక వెళ్లండి వెళ్లండి' అని తరిమికొట్టాడు"

"మన ప్రభుత్వం వారు జనాలను ఈజీమనీకి అలవాటు చేశారు. దాని ఫలితమే ఇది" దాసుగారు చివాలున లేచి లోపలకు వెళ్లిపోయారు.

★ ★ ★

ఒక పదిహేను రోజులు రాత్రీపగలూ అన్న భేదం లేకుండా గడిచాయి. ఊరి రూపురేఖలే మారిపోయాయి. రోడ్లన్నీ శుభ్రపడ్డాయి. హరిజనవాడలో కూలిపోయిన ఇళ్లకు బదులుగా సిమెంట్ ఇటుకలతో కడుతున్న ఇళ్లు ప్రారంభమయ్యాయి. దాసుగారు పక్క ఊరు నుండి సిమెంటు, ఇటుకలు తెప్పించారు. హరినారాయణగారి అల్లుడు హైదరాబాదులో ఒక సిమెంటు ఫ్యాక్టరీకి మేనేజింగ్ డైరెక్టర్. వారి కంపెనీ తరఫున విరాళంగా ఏభై ఇళ్లకు సరిపడిన సిమెంటుని పంపించారు. మిగిలిన ఏభై ఇళ్లకూ సిమెంటు తక్కువ రేటుకి ఇచ్చారు. మరో శ్రీమంతుడు కేశవరావు కొడుక్కి హైదరాబాదులో గుమ్మాలూ, కిటికీలు తయారు చేసే ఫ్యాక్టరీ వుంది. అతను కూడా తన వంతు విరాళంగా వంద ఇళ్లకు సరిపడిన కిటికీలూ, గుమ్మాలూ పంపించాడు. తలుపులకు కొబ్బరి చెక్కలు వాడవచ్చని ఎవరో చెప్పడంతో పడిపోయిన చెట్లను అడితికి తరలించారు. కొబ్బరి వాసాలతో, కొబ్బరి ఆకులతో కట్టిన ఇళ్లల్లో వుండే వారు వారి కోసం నిర్మాణమౌతున్న ఇళ్లను కుతూహలంగా గమనిస్తూ వుండేవారు. ఉత్సాహంతో రాత్రి పదిగంటల వరకూ పని చేసేవారు. మళ్లీ తెల్లవారుతూనే పని ప్రారంభించేవారు. దానితో రెండు నెలలు గడిచేసరికి ఆ కాలనీకి కొత్త రూపు వచ్చింది.

ఒక గది, వంటిల్లు రెండింటినీ కలుపుతూ వరండా, పైన స్లాబు. ప్రతి ఇంటి వెనుకా ఖాళీ స్థలం. వంద ఇళ్లు నాలుగు వరుసలలో కట్టిస్తున్నారు. జరిగిన నష్టాన్ని అంచనా వేయడానికి అధికార్లు మా ఊరు వచ్చేనాటికే మా ఊరును మేము శుభ్రం చేసుకున్నాం. దానితో నష్టం జరగలేదని అధికార్లు రిపోర్ట్ రాయబోతుంటే దాసుగారు తీవ్రంగా వ్యతిరేకించారు. మేము తయారు చేసిన రిపోర్ట్ని





వారికి చూపించాం. కాలనీ నిర్మాణాన్ని చూడడానికి వచ్చిన కలెక్టర్ ప్రభుత్వం తర పున సహాయం అందజేస్తామని అన్నారు. అయితే దాసుగారు దెబ్బతిన్న రోడ్లను బాగు చేస్తే చాలని చెప్పారు. కలెక్టరూ అందుకు సమ్మతించాడు.

ఇళ్ల నిర్మాణం పూర్తి అయిన రోజున ఊరంతా పండుగే. మంచి ముహూర్తం చూసి గృహ ప్రవేశాలు కూడా చేసుకున్నారు. అంతవరకూ షెడ్స్‌లో వున్న వారు ఇళ్లల్లోకి ప్రవేశించారు.

ప్రకృతి వదిలిన భీభత్సపు ఛాయలు ఊళ్లో ఎక్కడా కనిపించడంలేదు. పొలాలలోకి వెడితే మాత్రం మనసంతా కలచివేస్తోంది. అందరిలోనూ ఆత్మ విశ్వాసం తొంగి చూస్తోంది. ఒకరి సహాయాన్ని అర్థించే కంటే స్వశక్తితో మనం చేసుకున్న పనులు ఎంతటి ఆనందాన్ని ఇస్తాయో అందరికీ అను భవంలోకి వచ్చింది.

మళ్లీ మా కార్యక్రమాలు యథావిధిగా సాగిపోతున్నాయి.

★ ★ ★

జరిగిన ప్రకృతి విలయ తాండవంలో చిక్కుకున్న వారిని ఆదుకోవడం కోసం ఎన్నో ప్రజాహిత సంస్థలు ముందుకు వచ్చాయి. ప్రభుత్వం కూడా చొరవ తీసుకుని అవసరం అయిన వారికీ, లేని వారికీ కూడా ఉచితంగా బియ్యం పంపిణీ ప్రారంభించింది. దాసు గారు మాత్రం సహాయపడడానికి వచ్చిన వారికందరికీ చేతులు జోడించి ఒక్కటే విషయం చెప్పేవారు.

"మీరు సహాయ పడడానికి వచ్చారు. సంతోషం కానీ మీ సహాయాన్ని అందుకో వలసినవారు మిగిలిన గ్రామాలలో చాలా మంది వున్నారు. వారికి సహాయం అందజే యండి. అవసరంలేని మా గ్రామ వాసులకు సహాయం చేసి ఉచితంగా లభించే వాటి కోసం ఆశపడే మనస్తత్వాన్ని మా వాళ్లకు అలవాటు చేయకండి"

క్రమంగా చుట్టుపక్కల గ్రామాలలో జరి గిన నష్టాన్ని అంచనా వేయడం జరిగింది. చుట్టుపక్కల గ్రామాలకు సేవా సమితులు వస్తున్నాయి. తాము పనులకు వెడితే వారు అందించే సహాయం తమకు ఎక్కడ అందదో అనే భయంతో సహాయ శిబిరాలను విడిచి వెళ్లడానికి తుఫాను బాధితులు నిరాకరిస్తు న్నారు. రెండు పూటలా భోజనం, కాఫీ టిఫి న్లకు అలవాటు పడిన బాధితులు నిర్వాహకు లను వారి కోరికలను తీర్చవలసిందిగా డిమాండ్ చేస్తున్నారు. రోడ్డుపక్క శిబిరాలు ఏర్పాటు చేసుకుని. వచ్చిన సేవా సమితుల వారి వద్దనుండి అవసరం లేని సహాయా లను అందుకుంటున్న వారు ఎందరో?

ఆ రోజు ఎదిరించి మాట్లాడిన నలుగురు యువకులూ మా ఊళ్లో పనులు అయిపో యిన తరువాత మిగిలిన వారు పనులకు వెడుతుంటే వీరు మాత్రం రోడ్డు పక్క శిబిరా లలోని వారితో కలసి అవకాశం వున్నంత వరకూ ఉచితంగా అందుకున్నారు.

నరసయ్యా మరో నలుగురు గూడెం పెద్దలూ వాళ్లను దాసుగారి ఇంటికి లాక్కుని వచ్చారు. సంగతి విన్న దాసుగారి కళ్లు ఎర్ర బడ్డాయి. కానీ మరుక్షణంలోనే సంభాళించు కున్నారు.

"సరే! మన ఊరివారికి ఆత్మాభిమానం వుండాలని నాకు మంచి అనిపించింది నేను చెప్పాను. సరే! ఎవరి ఇష్టం వచ్చినట్లు వారిని చేసుకోనియ్! నాకు వచ్చి చెప్పాల్సిన అవసరం ఏముంది? లోపలకు వెళ్లడానికి కుర్చీలోంచి లేచారు దాసుగారు.

"మీరలా కోపగిస్తే ఎలా బాబుగారూ! మన ఊరికొక కట్టుబాటు వుండాలన్నారు. మేమంతా ఇప్పటి వరకూ దానికి కట్టుబడే వున్నాం. ఈ కట్టు దాటిన వారిని మీ కాళ్ల దగ్గర పడేస్తున్నాం. ఏం చేసినా మీ ఇష్టం"

"నేనేమీ కోపగించి వెళ్లడం లేదు నర సయ్యా! చెప్పడం వరకే నా పని. కానీ వీళ్లను దండించే అధికారం నాకు లేదు. మీ

ఇష్టం వచ్చినట్టు మీరు చేసుకోండి"

"అదేమిటి బాబుగారూ! మేమేమీ ఇక్కడ పని ఎగ్గొట్టి అక్కడకు వెళ్ళలేదే? ఈమాత్రం దానికి ఈ ముసలివాళ్లంతా ఎందుకింత అల్లరి చేస్తున్నారో మాకు అర్థం కావడం లేదు" ఒక యువకుడు ముందుకు వచ్చి అన్నాడు.

"నువ్వు చేసింది తప్పని నేను అనలేదే? ఎవరి నీతి నియమాలు వారికి వుండాలి. ఇక వెళ్లి రండి" దాసుగారి మాటలతో నమస్కారాలు పెడుతూ వెళ్లిపోయారు.

వారం పదిరోజుల తరువాత ఆ నలుగురు యువకులూ తాము సంపాదించుకున్న మూటలతో వచ్చి దాసుగారి ఎదుట చేతులు కట్టుకుని నిలబడ్డారు.

"క్షమించండి బాబుగారూ! ఏదో తెలియక కక్కుర్తిపడ్డాం. మా గూడెం వాళ్లంతా వెలివేశారు బాబూ! ఎవరూ మా ఇంటికి రావడం లేదు. మాతో మాట్లాడడం లేదు. ఆఖరికి చిల్లర కొట్టులో మాకు సామాను కూడా ఇవ్వడంలేదు. ఆఖరికి మా ఆవిడకు కడుపునొప్పి వస్తే ఏ అమ్మా దయదలచలేదు. మేమెలా బతకాలి బాబుగారూ"

"అది మీ గూడెం వారి వ్యవహారం. ఈ విషయంలో నేనేం చేయగలను?"

"అలా అనకండి బాబూ! మేము తెలియక చేసిన పొరపాటుకి క్షమించండి. వీటిని మీరేం చేయమంటే అది చేస్తాం. చెప్పండి. అగ్గెట్టి తగలబెట్టమంటారా? లేకపోతే గోదాట్లో కలిపేసి రమ్మంటారా? మాకు కాలసింది పదిమందీ మాతో కలసి వుండాలేకానీ ఇవన్నీ మాకు అక్ఖరలేదు. మీ మాటను మా వాళ్లు కాదనరు. దయచేసి చెప్పండిబాబూ! మేం ఇప్పుడే గోదాట్లో కలిపేసి వస్తాం" మూటలు భుజానికి ఎత్తుకోబోయారు.

"అరె! మీ తొందర మీదేనా? పదిమందికీ ఉపయోగపడే వాటిని నీటిపాలు చేస్తానంటారేమిటి? ఇప్పుడే వెళ్లి రిలీఫ్ సెంటర్లో వాటిని అప్పగించి రండి. నేను మీ వాళ్లతో మాట్లాడుతాను. ఇంకెప్పుడూ ఇలా ఉచితంగా వచ్చేవాటికి ఆశ పడకండి" దాసుగారికి నమస్కారాలు చేస్తూ మూటలతో సహా బయలుదేరి వెళ్లిపోయారు. దాసుగారు ఏమీ మాట్లాడకుండానే లోపలకు నడిచారు.



ఆరెస్సెస్, జన సంక్షేమ సమితి రంగంలోకి దిగాయి. అమలాపురాన్ని హెడ్క్వార్టర్సుగా చేసుకుని తమ కార్యక్రమాలను ప్రారంభించారు. నవంబరు ఏడవ తేదీన వారి కార్యకర్తలు, తుఫాను తాకిడికి గురియైన ప్రాంతాలన్నీ పరిశీలించారు. ఎక్కడెక్కడి నుంచో కార్యకర్తలు వచ్చారు. మగ్గాలను కోల్పోయిన చేనేత కార్మికులకు ముందుగా మగ్గాలను అందించి వారి ఉపాధిని కోల్పోకుండా సహాయపడ్డారు. ఆరోగ్య శిబిరాలను ఏర్పాటు చేశారు. ప్రభుత్వం వారు కూడా ఆరోగ్య శిబిరాలను ఏర్పాటు చేశారు.

జన సంక్షేమ సమితి ఇళ్లు కోల్పోయిన వారికి ఇళ్లు కట్టించి ఇవ్వడానికి ప్రణాళికను తయారుచేసుకుంది. మా ఊరికి సమీపంలోని చెయ్యేరు గ్రామంలో చేనేత పనివారికీ, బలహీన వర్గాల వారికి గృహనిర్మాణ పనులను చేపట్టింది. అలాగే యానాం దగ్గర, కోటిపల్లి దగ్గరలోనూ గృహనిర్మాణ పథకాన్ని

చేపట్టింది.

కోనసీమలోని అన్ని గ్రామాల వారూ దానిలో భాగస్వాములు అయ్యారు. ఆ సందర్భంలోనే వారు మా ఊరికి కూడా రావడం, దాసుగారిని తమకు సలహాలను ఇవ్వవలసిందిగా కోరడం జరిగింది. దాసుగారు మా ఊరిలో జరిగిన కార్యక్రమాలను వివరించారు. జన సంక్షేమ సమితి కార్యకర్తలు ఆశ్చర్యపోయారు.

"నవంబరులో విపత్తు వచ్చింది. అయిదు వారాలు పూర్తి కాకుండానే మేము ఇళ్లు కట్టడం ప్రారంభించాము. మూడు మాసాలలో పూర్తి చేయగలుగుతామని అనుకుంటున్నాము. కానీ ఇంకా మూడు మాసాలు పూర్తి అయ్యాయో లేదో మీరు మొత్తం పనులన్నీ పూర్తి చేసుకుని కూర్చున్నారు. ఇది ఎలా సాధ్యమైంది?" వచ్చిన సభ్యులలో ఒకరు ఆశ్చర్యంగా ప్రశ్నించారు.

"ఇందులో ఆశ్చర్యపోవడానికి ఏముంది? మీరు బయట నుంచి వచ్చారు. జరిగిన నష్టాన్ని అంచనా వేయడానికే మీకు కొంత కాలం పడుతుంది. అంతే కాకుండా మీరు మిగిలిన ప్రాజెక్టులు, చేనేత పనివారికి మగ్గాలను ఇవ్వడం మొదలైనవి చేశారు. పైగా మీ ప్రాజెక్టు పెద్దది. ఇక మా విషయానికి వస్తే మా ఊరికి జరిగిన నష్టాన్ని అంచనా వేయడానికి మాకు రెండు రోజులు సమయం చాలు. మా ఊరికే మా యాక్టివిటీ పరిమితం కావడం, బాధితులు ఎవరో వచ్చి చేసే సహాయానికి ఎదురుచూడకుండా తమ పని తాము పూర్తి చేసుకుంటే వ్యవసాయపు పనులకు లేదా కూలి పనులకు మిగిలిన ఊళ్లకు వెళ్లి డబ్బు సంపాదించవచ్చునని ఆలోచించడం, ఈ పని త్వరగా పూర్తి కావడానికి దోహదపడ్డాయి. బహుశా మీకు తెలిసి వుండదు. మా చుట్టుపక్కల గ్రామాల వారు సహాయ శిబిరాలలో కూర్చుని సేవా సంస్థలు అందించే సహాయం కోసం రోడ్డు పక్కన పడిగాపులు పడుతూ వుంటే మా ఊరు నుండి కూలీలు ఆ ఊళ్లకు వెళ్లి కూలి పని చేసి ఎక్కువ డబ్బులు సంపాదించుకుని వస్తున్నారు"

వారి కార్యక్రమాల్లో పాల్గొనడానికి దాసుగారితో పాటు మా ఊరు నుండి మరో పది మంది కూడా వెళ్లాం. చెయ్యేరు గ్రామంలో ఇళ్ల నిర్మాణం పూర్తి అయిన తరువాత జన సంక్షేమ సమితి ఆ కాలనీ ఓపెనింగుకి పెద్ద ఎత్తున ఏర్పాటు చేసింది.

కార్యక్రమానికి ఆరెస్సెస్ పెద్దలంతా వస్తున్నారు. ఆరెస్సెస్ చీఫ్ అతిథిగా వస్తున్నారు. రాష్ట్ర గవర్నర్ ఆ కార్యక్రమానికి అధ్యక్షత వహిస్తున్నారు. కొన్ని వేల మంది కార్యక్రమంలో పాల్గొనడానికి వీలుగా ఏర్పాటు చేస్తున్నారు.

★ ★ ★

అందరమూ ఎదురు చూసిన ఆ రోజు వచ్చింది.

నిర్వాహకులు సూచించిన మేరకు కార్యక్రమానికి ఒక గంట ముందుగానే ఆ స్థలానికి చేరుకున్నాము. ఒక పద్ధతి ప్రకారం పనులు చేయడం ఆరెస్సెస్ వారికి మొదటినుంచీ అలవాటు కాబోలు. ఎక్కడా ఏమీ హడవుడి లేకుండానే వచ్చిన వారి నందరినీ ఒక పద్ధతి ప్రకారం కూర్చోబెడుతున్నారు. మా ఊరు నుంచి వెళ్లిన వారిలో దాసుగారితోపాటు నన్ను కూడా రిసెప్షన్ కమిటీ మెంబర్సుగా వేదిక ముందు కూర్చునే అవకాశాన్ని కల్పించారు.

సరిగా అనుకున్న సమయానికే అతిథులందరూ వచ్చారు. వారిని వేదిక మీదకు ఆహ్వానించి కార్యక్రమం ప్రారంభించారు. ఆరెస్సెస్ చీఫ్ హిందీలో ఇచ్చిన ఉపన్యాసాన్నీ, గవర్నర్ ఇంగ్లీషులో ఇచ్చిన ఉపన్యాసాన్నీ, ఆరెస్సెస్ ప్రాంత ప్రచారక్ తెలుగులోకి తర్జుమా చేశారు. నిజానికి వారంతా కాషాయ వస్త్రాలు ధరించని మహర్షులుగా కనిపించారు.

గవర్నరుగారు తమ ఉపన్యాసంలో గతాన్ని గుర్తు చేసుకున్నారు. "ఇదివరలో



పాకిస్తాను నుంచి హిందువులు భారతదేశానికి కట్టుబట్టలతో వచ్చినప్పుడు వారికి సహాయం చేయడానికి వెళ్లిన కార్యకర్తలకు చేతులు జోడించి వారు ఒకటే మాట అన్నారు. 'దయచేసి మా స్వశక్తి మీద మమ్మల్ని ఆధారపడనివ్వండి. అనవసరంగా మాకు సహాయపడి మమ్మల్ని శక్తి హీనులను చేయకండి' అని. కానీ ఈనాటి స్వతంత్ర భారతదేశంలో ఆ స్వాభిమానం ఏమైంది? ఎక్కడికైనా మంత్రులు కానీ రాజకీయ నాయకులు కానీ వస్తున్నారంటే చాలు, మన ప్రజలు రెండు చేతులూ చాపి సహాయాన్ని అర్థిస్తున్నారు. ముష్టివాళ్ల కంటే హీనంగా చేతులు చాపుతున్నారు.

"అయినా ఈ రోజుల్లో కూడా ఒక గ్రామం ప్రభుత్వ సహాయాన్నిగానీ ఇతర స్వచ్ఛంద సంస్థల సహాయాన్ని కానీ కోరకుండా తన గ్రామాన్ని తీర్చి దిద్దుకుంది. ఆ విషయం బహుశా మీలో చాలా మందికి తెలిసి వుంటుంది. తన గ్రామవాసుల్లో ఆ స్వాభిమానాన్ని కలిగించిన కృష్ణమోహన దాసుని అభినందిస్తూ వారిని ఒక్కసారి స్టేజి మీదకు రావలసిందిగా ఆహ్వానించమని నిర్వాహకులను కోరుతున్నాను" గవర్నరుగారి మాటలకు అందరూ ఒక్క క్షణం నిశ్చేష్టులయ్యారు. నిర్వాహకులు తేరుకుని మైకులో దాసుగారిని వేదిక మీదకు రమ్మని ఆహ్వానించారు. చివరకు దాసుగారి చేతిని పట్టుకుని నేను స్టేజి వద్దకు తీసుకు వెళ్లాను.

గవర్నరుగారు తమ ప్రోటకాల్‌ను పక్కకు పెట్టి రెండు చేతులూ చాచి దాసుగారిని ఆహ్వానించారు. వేదిక మీద దాసుగారిని తన పక్క కుర్చీలో కూర్చోబెట్టారు.

"దాసూ! మనం రాయవెల్లూరు జైలులో గడిపిన రోజులు జ్ఞాపకం వున్నాయా? పాకిస్తాన్ శరణార్థులకు సహాయపడడానికి మనం కార్యకర్తలుగా వెళ్లినప్పుడు వాళ్లు అన్న మాటలు గుర్తు వున్నాయా? దేశ విభజన సమయంలో జరిగిన ఆ సంఘటనను మనం ఆ తరువాత కలుసుకున్నప్పుడు కూడా చర్చించుకున్నాం. మన వారిలో ఆ స్వాభిమానం ఎప్పుడూ అలాగే వుండాలని నువ్వు అన్నావ్. మీ ఊరి ప్రజల్లో ఆ స్వాభిమానాన్ని అలాగే నిలిపినందుకు చాలా ఆనందంగా వుంది దాసూ!" అంటూ పక్కనున్న పూల మాల తీసి దాసుగారి మెడలో వేశారు.

గవర్నరుగారి మాటలను విన్న నాకు సంభ్రమంతో నోటి మాట రాలేదు. దాసుగారు జాతీయోద్యమంలో జైలుకి వెళ్లారన్న విషయం నాకు తెలియదు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నా పాల్గొనకపోయినా స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వాటి ఫలాలను అందుకోవడానికి ముందు వరసలో నిలుచున్న వారు ఎందరో? ఆ అవకాశాలను నిచ్చెన మెట్లుగా చేసుకుని రాజకీయ వైకుంఠపాళిలో పెద్ద నిచ్చెన ఎక్కి అక్కడ నుండి కిందకు దిగమని మొరాయించిన వారు ఎందరో? రాజకీయాలను తమ స్వలాభం కోసం తమ కుటుంబ సంక్షేమం కోసం ఉపయోగించుకున్న వారు మరెందరో? కానీ దాసుగారు తానొక స్వాతంత్ర్య సమర యోధుడనని కూడా ఎప్పుడూ మాకు చెప్ప లేదు. ఆయన చెప్పిన మాటలన్నీ ఆయన స్వానుభవాలేనన్న మాట. పుస్తకాలలో చదివి చెప్పినవి కాదు. గవర్నరు గారు తనకు అంత సన్నిహితులై వుండి కూడా రిలీఫ్ కార్యక్రమాలకు ప్రభుత్వ సహాయాన్ని కోరలేదు. ఒక కార్యకర్త భుజం మీద చెయ్యి వేసే సరికి ఈ లోకంలోకి వచ్చి మెల్లిగా అక్కడ నుంచి తప్పుకున్నాను. నిజంగా దాసుగారితో ఇంత సన్నిహితంగా మెలిగే అవకాశం రావడం నా అదృష్టం.

గవర్నరుగారు తమ ప్రసంగాన్ని కొనసాగించారు.

"ఈ ప్రాంతంలో ఒక గ్రామం వారు ప్రభుత్వ సహకారాన్నిగానీ స్వచ్ఛంద సంస్థల సహకారాన్ని కానీ తీసుకోవడం లేదని తెలిసిన తరువాత ఆ ఊరు గురించిన వివరా





లను సేకరించాను. దానికి కారణం ఆ ఊరి పెద్ద కృష్ణమోహన్ దాసు అనీ, ఈ విపత్తు రాక ముందు నుంచీ ఆ గ్రామంలో సేవా కార్యక్రమాలు జరుగుతున్నాయనీ, రెండు నెలలు పూర్తి కాకుండానే ఈ తుఫానులో ఇళ్లు కోల్పోయిన పేదవారికి కేవలం ఊరి వారి సహకారంతో వంద పక్కా ఇళ్లు కట్టించి ఇచ్చారని తెలుసుకున్నాను. తీరా విచారిస్తే అతను నాకు ఒకనాటి మిత్రుడు. స్వతంత్రం వచ్చిన తరువాత అతని గురించి నాకు తెలియలేదు. అంతేకాదు, స్వాతంత్ర్య సమరయోధుల లిస్టులో కూడా అతని పేరు లేకపోవడం విచిత్రమే. ప్రభుత్వం తరపు నుంచి అతను ఏవిధమైన సహాయాన్నీ అందుకోలేదు. ఆ స్వాభిమానాన్ని మీరందరూ అలవర్చుకోవాలని కోరుతున్నాను"

కార్యక్రమ నిర్వాహకులు దాసుగారిని కూడా సందేశం ఇమ్మని అడిగారు.

దాసుగారు చాలా ముక్తసరిగా మాట్లాడారు. "ప్రభుత్వ సహాయాన్ని నేను అందుకోక పోవడానికి కారణం ఒకటే. మా పెద్దలు సంపాదించిన ఆస్తి నాకు సరిపోతుంది. గాంధీగారు దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత అసలు కాంగ్రెస్ పార్టీనే అబాలిష్ చేయమని చెప్పారు. వారి మాటను పార్టీ పాటించలేదు. ఫలితం ఈనాడు మనం చూస్తూనే వున్నాం. వారి సలహా వ్యక్తులకు కూడా వర్తిస్తుందని నేను భావించాను. అందుకనే దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జాతీయోద్యమంలో నేనూ ఒక కార్యకర్తగా పాల్గొన్నాననే విషయమే మరచిపోయాను. కేవలం విద్య కోసం ఇతర సామాజిక కార్యక్రమాలతో నా శేష జీవితాన్ని గడపాలని ఆశించాను. కానీ తరాల అంతరాలతో నా భావాలు ఈ తరానికి నచ్చకపోవడంతో కేవలం ఇంటి పట్టున వుండిపోయాను. కానీ చిరంజీవి విద్యాసాగర్ పట్టుదలతో మళ్లీ సామాజిక కార్యాలలో పాల్గొనక తప్పలేదు. ఈ జీవిత చరమదశలో ఆ రోజులను గుర్తు చేసిన గౌరవనీయులైన గవర్నరు గారికి నా కృతజ్ఞతలను తెలియజేస్తూ వారు అందించిన స్వాభిమాన్ నినాదం ప్రజల మనసుల్లో శాశ్వత స్థానం సంపాదించుకోవాలని కోరుతూ సెలవు తీసుకుంటున్నాను"

వెంటనే గవర్నరుగారు రెండు చేతులూ ఎత్తి 'స్వాభిమాన్ స్వాభిమాన్' అని రెండు సార్లు రిపీట్ చేశారు,

సభలో వున్న అందరి నోటి వెంటా మంత్రోచ్చారణలా వెలువడింది. స్వాభిమాన్ అన్నమాట. వేల గొంతుకల నుంచి వెలవడిన ఆ మాట అక్కడి గాలిలో మెల్లిగా వ్యాపిస్తోంది.

తుపానుకి నేలకూలకుండా మిగిలిన కొబ్బరి చెట్లు జీవాన్ని పుంజుకుని మెల్లిగా తలలూపుతున్నాయి. స్వాభిమాన్, స్వాభిమాన్ అంటూ మెల్లిగా గుసగుస లాడుతున్నట్లుగా ఆ ఆవరణ అంతా వ్యాపిస్తోంది ఆ మాట.

నిజం. కోనసీమ మళ్లీ జీవం పుంజుకుంటుంది. పూర్వపు ప్రకృతి సౌందర్యాన్ని మళ్లీ మనం చూడగలుగుతాం. అలాగే మనవారు మళ్లీ స్వాభిమానంతో పూర్వపు ఔన్నత్యాన్ని పొందుతారు. రాజా రామ్మోహన రాయ్, కందుకూరి వీరేశలింగం పంతులు గారి లాంటి సంఘ సంస్కర్తలూ, గాంధీ, నెహ్రూ, ప్రకాశంపంతులుగారి వంటి దేశభక్తులూ, మదనమోహనమాలవ్యా, ఈశ్వరచంద్రవిద్యాసాగర్ వంటి విద్యావేత్తలు, సుభాష్‌చంద్ర బోస్, అల్లూరి సీతారామరాజు వంటి విప్లవ వీరులూ రామకృష్ణ పరమహంస, వివేకానందా, అరవిందఘోష్ లాంటి ఆధ్యాత్మిక వాదులూ ఇంకా ఎందరో మేధావులు ఈ కర్మభూమిలో మళ్లీ మళ్లీ జన్మిస్తారు. స్వాభిమానంతో ప్రపంచ దేశాల్లో మనదేశం తల ఎత్తుకుని నిలబడుతుంది.

నిజం నిజం అంటున్నట్లుగా ఆవరణలో నిలిపిన మువ్వన్నెల జండా రెపరెపలాడుతూ ఆకాశానికి తన సందేశాన్ని అందిస్తోంది.





# చతుర కతలు

## మాడ్రన్ మెయిడ్

ఊరు మారినప్పుడల్లా పనిమనుషులు సమస్య అయిపోతారు పార్వతికి.

ఒక ఊళ్లో అయిదు సంవత్సరాలు నమ్మకంగా, తనకు నచ్చినట్లుగా చేసినవాళ్లున్నారు.

ఇదిగో ఇప్పుడు తలనెప్పిగా తయారయ్యింది కొత్తగా వచ్చిన విజయవాడలో.

ఇక్కడ పనిమనిషి వేరు. బట్టలు ఉతికే వాళ్లు వేరు. బట్టలుతికే మనిషితో సమస్య లేదు. వాళ్లపని వాళ్లు చేసుకునిపోయేవాళ్లు. పనిమనిషి మాత్రం ప్రాణం తీస్తోంది.

పనివాళ్లను మిషన్‌లా చూసి క్షణం కూచోకుండా వేపుకు తినే యజమానురాళ్లూ ఉంటారు. యజమానురాల్ని చేతనైనంతవరకూ వేపుకుతినే పనిమనుషులూ ఉంటారు.

ప్రతీ వర్గంలో మంచీ చెడూ రెండూ ఉంటాయి. ప్రత్యేకించి ఈ వర్గం ఇటువంటిదీ, ఈ వర్గం ఇటువంటిదీ అని నిర్ధారించలేం. ఇరువైపులా సర్దుకుపోవడం అన్నది తప్పనిసరి. ఏమైనా మంచి సదుపాయం గల ఇల్లు దొరకడం కన్నా పనిమనిషి అన్నివిధాలా మంచిగా ఉండేది లభించడం అదృష్టమే అనుకునేది.

ఈసారి పేపర్‌లో ప్రకటన ఇచ్చింది. కొన్ని పాయింట్లను ముందుగానే తెలియ







చేసి అందుకు సమ్మతమైన మనిషే రావా లని ఆ ప్రకటనలో తెలియచేసింది. పూర్వం పనిమనుషులు తరచుగా పర్వదినాలనీ, అమ్మవారి జాతరలనీ, నోములూ వ్రతాలనీ పని ఎగ్గొట్టేవారు. అదీ కొందరు మాత్రమే.

ఇప్పుడు నూటికి తొంభైమంది ఎడతెరిపి లేకుండా ఆర్థికపరిస్థితి ఎటువంటిదైనా భక్తి పారవశ్యంలో మునిగి తేలుతున్నారు. విరి విగా 'ఖర్చు చేస్తున్నారు. అంటే దేముడికి పబ్లిసిటీ పెరిగిందో.. మనుషులకు ఈ చర్యల పట్ల నమ్మకం కుదిరిందో.. తెలి యదు కానీ...

పార్వతికి ముఖ్యమైన సమస్య పనివాళ్ల తోనే... అదీ భక్తి పేరుతో పని ఎగవే యడం. అందుకే ప్రకటనలో 'నాస్తికురాలైన పనిమనిషి' అని ప్రత్యేకించి పేర్కొనడం జరిగింది.

ఏ విషయంలో అయినా అబద్ధం చెప్పి పనిలో చేరవచ్చు కానీ దేముడు, భక్తి విష యంలో ఆపని చేయలేరు కనుక 'నాస్తి కత్వం' అనే మాట పార్వతికి బాగానే పని కివచ్చింది. అయితే అలా వచ్చిన పనిమను షులు ఇద్దరే. ఇప్పుడు ఇద్దరిలో ఎవరిని సెలెక్ట్ చేసుకోవాలీ అని ఆలోచిస్తే 'మంగ' అనే అమ్మాయి బెటర్‌గా తోచింది. ఈ మంగ కుగ్రామం నుంచి రావడంతో మాయామర్మాలు తెలియవు. ఒక్కరోజు కూడా మానకుండా చక్కగా పని చేయ డంతో పార్వతి మెచ్చుకుని మంచి బట్టలూ, ఫ్యాన్సీ సామాన్లూ ఇవ్వడం జరిగింది.

నాలుగు నెలలపాటు హాయిగా ఉంది పార్వతికి. ఆతర్వాత ఎవరి చెప్పుడు మాట లవలన నేర్చుకుందో, లేక తన మనసే మారిందో మంగలో మార్పు కనపడసా గింది. యథాప్రకారం అందరి మార్గం లోనూ పని మానేయడం మొదలెట్టింది.

"మంగా! ఏమిటీ ఇదివరకులా పని చేయ డంలేదూ? " అనడిగింది పార్వతి ఓరోజు.

"సినిమాకి పోయానమ్మా" అంది కారణం చెబుతూ.

"టీవీలో సినిమాలు చూస్తావుగా? " అని పార్వతి అంటే....

"ఇంత చిన్న టీవీలో సినిమా బాగో దమ్మా" అని సమాధానం చెప్పడంతో....

"సరే! ఈసారి మనిద్దరం వెడదాం. నేను వెళ్లే సినిమాకి నిన్నూ తీసుకువెడతాను సరేనా? " అని రాజీ చేసుకుంది.

మరోసారి ఎగ్జిబిషన్ అనీ పెళ్లి చూపు లనీ కారణాలు చెబుతుంటే పార్వతికి ఏం పాలుపోలేదు. ఈసారి కూడా తనకు మంచి పనిమనిషి లభించే అదృష్టం లేదన్న మాట. ఏంచేస్తాం. నోరు మూసుకుని సరి పెట్టుకోవలసిందే అనుకుని ఊరుకుంది.

ఈమధ్య మంగ మరీ తరచూ మానే స్తోంది. జీతంలో కట్ చేస్తే పెద్దగా అరిచి వాదనలు మొదలెట్టింది. పైగా ఇకనుంచి తనగురించి ఇతరులకు చెప్పేటప్పుడు 'పని మనిషి' అనొద్దట. 'మెయిడ్' అని ఇంగ్లీ ష్‌లో చెప్పాలట. ప్రతీవారం ఠంచన్‌గా బ్యూటీపార్లర్ కోసం శలవు. నెలకి వారం రోజులు తన ఎంటర్‌టైన్‌మెంట్ కోసం శలవు. మధ్యలో ఏవైనా ఫంక్షన్స్ ఉంటే శలవివ్వాలట.

"మరి నువ్వు పనిలోకి వచ్చేది నెలలో ఇరవై రోజులు కూడా లేదుకదా? "

"అంతేమరి" అంది.

"సరే. నెలలో ఇన్ని రోజులు మానేస్తు న్నావు కదా? అసలు నీ ఎంటర్‌టైన్‌మెంట్ ఏమిటో చెబుతావా? "

"అది పర్సనల్ మాటర్. మంచిగుంట న్నంటే చెబుతా"

'మంచిగుంటననడం అంటే ఏమిటో జ్వరం, అనారోగ్యం అంటే టాబ్లెట్స్ ఇవ్వచ్చు. సినిమా, బ్యూటీ పార్లర్ అంటే నాతో రమ్మనచ్చు. మరి పర్సనల్ మాటర్ అంటే ఏమిటబ్బా! పైగా ఇంకా మంచిగుం డాలట. ఓర్నాయనో. వీళ్లని పనిమనుషుల



నడం నిజంగా తప్పే. దీనికోసం కొత్తమాట కనిపెట్టాల్సిందే.

"ఇంతకీ మంగా! నీ వారం రోజుల ఎంట ర్టైన్‌మెంట్ ఏంటో చెప్పావు కాదు" అంది పార్వతి.

"ఏంటమ్మా! ఆమాత్రం తెలుసుకోలేవా? నాతో చెప్పిస్తవ్. 'బాయ్‌ఫ్రెండ్' అని ఎరిక లేదా? ..."

ఇప్పుడు పార్వతికి పనిమనిషి లేదు. తన పని తాను చేసుకోవడం కంటే ఉత్తమం లేదని తెలుసుకుంది.

– ఎ. అన్నపూర్ణ

---

## డాంబికం

ప్రమోషన్ మీద నాకు జయపురం ట్రాన్స్‌ఫర్ అయింది. అక్కడ నాకోసం ఒక గది ప్రత్యేకంగా కేటాయించడం జరిగింది. మొదటిసారిగా జీవితంలో రివాల్వింగ్ ఛెయిర్‌లో కూచొని కాలింగ్‌బెల్ నొక్కగానే ప్యూన్ రావడం... ఆ థ్రిల్ మర్చిపోలేం. ఎవరైనా వచ్చేముందు 'మే ఐ కమిన్' అని పర్మిషన్ అడిగి లోపలికి రావాలని, కొత్తవా ళ్లెవరయినా వస్తే స్లిప్ పంపనిదే లోనికి వచ్చే ప్రశ్న లేదని స్ట్రిక్ట్‌గా చెప్పాను. ఎప్పు డయితే నేను అలా తాఖీదు జారీ చేశానో ఆరోజునుంచి మిగతా స్టాఫ్ నా గదిలోకి రావడం మానేశారు.

అఫ్‌కోర్స్! ఆఫీసరయిన తన తోటి వ్యక్తంటే ఈ గుమాస్తా రాయుళ్లకి ఈర్ష్యా సూయలు.

రోజులు గడుస్తున్నాయి. నా గదిలో నేనొక్కణ్ణీ ఒంటిపిల్లి రాకాసిలా కూచునే వాణ్ణి. ఒంటరితనం నన్ను బాధించేది. అయినా మనిషిలోని ఇగోయిజం దానిని నొక్కి ఉంచేసింది. ఒకరోజు ప్యూను ఒక స్లిప్ తీసుకొచ్చి ఇచ్చాడు. ఫలానా పట్నా యక్, రిటైర్డ్ అసిస్టెంటు, ఫలానా డిపార్ట్ మెంట్ అనుంది. నాకు బోల్డెంత సరదా వేసింది. ఇన్నాళ్ల తర్వాత నా దగ్గరకు ఒక విజిటర్ వస్తున్నాడు. శభాష్! రెచ్చిపో అని నాలోని ఆత్మారాముణ్ణి ఉసికొల్పాను.

ఆ వ్యక్తి వచ్చాడు. అతనికి ఎదురుగా ఉన్న సీటు చూపించాను. అంతకు మునుపే డిస్పోజ్ చేసిన ఫైల్‌ను మళ్లీ చూస్తున్నట్లు నటించి ఏమిటీ అన్నట్లు చూశాను. ఆ పట్నాయక్ నాకేదో దూరపు చుట్టం అవుతాడట. ఎక్కడో ఏదో పెళ్లిలో నాన్నగారు ఆయన్ని కలిసి జయపురంలో నేనున్నట్లు, యోగక్షేమాలు కాస్త వాకబు చెయ్యమన్నారట. అంతలో నేకూచున్న కుర్చీ రివాల్వింగ్‌ది అని గుర్తొచ్చి కాస్త తిరిగి ఆయన వచ్చినందుకు నా సంతో షాన్ని ప్రకటించాను. బెల్ కొట్టి ప్యూన్‌ను పిలిచి టీ తెమ్మని చెప్పాను. ఇరవైరూపా యల నోటిచ్చాను.

రిటైర్మెంట్ అయిన ఆ వ్యక్తి తన అను భవాలు ఆగకుండా చెప్తున్నాడు. బోరని అనిపించినా వింటున్నాను. అటువంటి పార్టీలని పంపించిన నాన్నగారి మీద కాస్త కోపం వచ్చింది కూడా. చాదస్తపు మను షులు, చాదస్తపు ధోరణి. కనీసం టీ వచ్చినా అది తాగేసి పోతాడనుకున్నాను.

అంతలో ఒక ట్రేనిండా కప్పులు పెట్టు కుని ప్యూను వచ్చాడు. మిగతా కప్పులు గలగల్లాడించుకుంటూ వెళిపోయాడు. చుట్టం వెళ్లిపోయాడు. అమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నాను. సాయంత్రం అయి దయింది. ప్యూను మిగతా చిల్లర ఇస్తాడే మోనని చూశాను. పోనీ అడుగుదామంటే అహంకారం అడ్డొచ్చింది.

రెండ్రోజులు గడిచాయో లేదో మరొకా యన వచ్చాడు. ఆయనకి పెళ్లికాబోయే కూతుళ్లున్నారు. సంబంధం కలుపుకుందా మని తాపత్రయం అతనిది. ఈసారి కూడా





ఇరవైరూపాయల నోటు ఆహుతయింది. ఖర్మకాలి ఇరవై రూపాయలనోటుంచుకోవడం పొరబాటయింది. మర్నాటినుండీ పదిరూపాయల నోట్లు మార్చుకుని జేబులో పెట్టుకున్నాను. ఒకరోజు సాహితీమిత్రుడొకడు వచ్చాడు. ప్యూనుని పిలిచి పదిరూపాయల నోటిచ్చి కాఫీ తెమ్మన్నాను. టీతప్ప పరిసరాల్లో కాఫీ దొరకదని చెప్పాడు. టీతో రాజీ పడక తప్పలేదు. ఈసారీ అదే తంతు. ట్రేనిండా కప్పులు తేవడం జరిగింది. అంటే నేనిచ్చిన డబ్బుతో మొత్తం సంతర్పణ చేస్తున్నాడన్నమాట. ఒళ్లు మండుకొచ్చింది. కానీ వేరే మార్గం లేదు.

ఆయనకో టీ ఇమ్మని ప్యూనుకి చెప్పాను.

"టీయా? " తత్తరపడ్డాడు వాడు.

"అవును. ఆ ట్రేలోనిదే మరో కప్పు ఆయనకు ఇయ్యి" అని గద్దించాను. నీళ్లు నమలడం ఆ బంట్రోతు పనయింది.

"ఇందులో టీలెక్కడివి సార్? అన్నీ ఖాళీ కప్పులే" అన్నాడు ఆడిటర్. ఆయన అమితాబ్ బచ్చన్‌లా పొడుగ్గా ఉండడం, ఆయన కళ్లు ట్రే మీద పడడం జరిగింది.

తెల్లబోవడం నావంతయింది. అంటే ఇన్నాళ్లూ నా దర్పం, డాంబికం ప్యూను పాలిట కల్పతరువయిందన్నమాట. నా గదిలో కంప్యూటర్ ఏర్పాటు చేసి, నేను




మరీ చీపుగా రెండ్రూపాయలివ్వడం నామోషీ. కానీ వేరే మార్గం లేదు.

ఆఫీసులో ఆడిట్ జరుగుతోంది. ఆడిట్ ఆఫీసరు నాతో చర్చిస్తున్నాడు. కర్టెసీకోసం టీ తాగుతారా? అని అడిగాను. సరేనన్నాడు. పదిరూపాయల నోటుకి కాళ్లొచ్చాయి. మాకు టీ సర్వ్ చేస్తున్నప్పుడు ఆడిటర్ ఒకాయన ఆ గదిలోకి వచ్చాడు.

హాల్లో అందరి మధ్యకూ వచ్చేశాను. నావాళ్లూ, నాకుటుంబం అన్న ఫీలింగ్ అప్పుడుగానీ నాకేర్పడలేదు.

**- ఆనందరావ్ పట్నాయక్**





# పరిణముత్యాలు

* నిన్నెవరూ ప్రేమించకుండా ఉన్నట్లయితే, అది తప్పకుండా నీ తప్పే అని తెలుసుకో.

– డాడ్రిడ్జ్

* నిద్రపోయి కలగన్నాను బతుకంతా సుందరమని, మేలుకొని కనుగొన్నాను బతుకు పెద్ద బాధ్యతని.

– ఇ.ఎస్. హూవర్

* ఒక విషయం మనకు క్షుణ్ణంగా తెలిసినప్పుడే దాన్ని ఇతరులకు బోధ చెయ్యాలి.

–ట్రియోన్ ఎడ్వర్డ్స్

* తన తప్పుకు ప్రతివాడూ పెట్టుకునే అందమైన పేరు 'అనుభవం'.

– ఆస్కార్ వైల్డ్

* నిన్ను నువ్వు మోసగించుకున్నంతగా ఇంకొకరు నిన్ను మోసగించరు.

– గోథే

* విధి నిర్వహణకు మించిన దేశసేవ లేదు.

– మహాత్మాగాంధీ

* కృతజ్ఞత అనేది మానవజాతికి అంత సులభంగా వచ్చే గుణం కాదు.

– సోమర్‌సెట్ మామ్

* ఒక పుస్తకం నుంచి కాపీ కొడితే తప్పవుతుంది, అదే పెక్కు పుస్తకాలనుంచి కాపీ చేస్తే పరిశోధన అవుతుంది.

– వి.మెజ్నెర్

* పొగడ్త స్నేహితులను తీసుకొస్తుంది, నిజం చెప్పడం శత్రువులను పట్టుకొస్తుంది.

– జార్జి హెర్బర్ట్

* ప్రశాంతమైన మనసు విలువైన మూలధనం.

– స్వామి శివానంద

* ఒక డజనుమంది వివేకవంతులు ఒక గంటలో అడిగే ప్రశ్నలకన్నా మూర్ఖుడు ఒక్క నిముషంలో ఎక్కువ ప్రశ్నలు వేయగలడు.

– లెనిన్

* రాత్రివేళ సూర్యుడు కనిపించలేదని కన్నీరు కారుస్తూంటే ఆఖరికి నక్షత్రాలు కూడా నీకు కనిపించకుండా పోతాయి.

– రవీంద్రనాథ్ ఠాగూర్

* ఒక వ్యక్తి రోజులో ఒక్కసారయినా నవ్వకుంటే అతను ఆత్మహత్య చేసుకోవడం మంచిది.

– లింకన్

సేకరణ: ఆదిమూలం వెంకట కృష్ణమూర్తి

# 'స్పందన' పై సమీక్షలు

నవంబర్ చతురలో ప్రచురితమైన షేక్‌రఫీ నవల 'స్పందన' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## ఆలోచనామృతం

(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)

'సాహిత్యం ఆలోచనామృతం' అన్న నానుడికి నిలువుటద్దం 'స్పందన' నవల. ఆధునిక సమాజంలో ఫెమినిజంను గురించి ఉపన్యాసాలివ్వడం చాలామందికి సర్వసాధారణమయిన విషయం. అయితే అందరూ సమస్యను గురించి లోతుగా చర్చించకుండా కేవలం పురుషద్వేషంతో మాట్లాడటం జరుగుతుంది. కానీ సమస్యను కూలంకషంగా చర్చించి పరిష్కారమార్గం సూచించే సాహిత్యం ఉత్తమ సాహిత్యం అవుతుంది. అలాంటి కోవకు చెందినదే షేక్‌రఫీ 'స్పందన' నవల.



'స్త్రీకి స్త్రీయే ప్రథమ శత్రువు' అన్న నానుడి అక్షరసత్యం. వరకట్నం ఆశించి ఆడపిల్లల చావుకు కారణభూతులవుతున్నవారు పురుషులే అన్నది స్త్రీల అపోహ. కానీ ఆ పనికి పురికొల్పి వారిలో మానవత్వాన్ని సమాధి చేస్తున్నది తల్లి, చెల్లి రూపంలోనున్న స్త్రీ కాదా! ఈ సత్యం ఎందరికి తెలుసు. ఉమ్మడి కుటుంబాలు విచ్ఛిన్నం కావడానికి కారణం స్త్రీ కాదా! కూతురు, కోడలు పట్ల వివక్షతో వ్యవహరిస్తూ స్త్రీ సమానత్వాన్ని గురించి గొంతులు చించుకుంటున్నది స్త్రీలు కాదా! ఇంకా సమానత్వం ఎక్కడినుంచి వస్తుంది? అంజనా శ్రీవాత్సవ పాత్రద్వారా రచయిత ఈ సమస్యలను నిష్పక్షపాతంగా చెప్పించాడు. స్త్రీపురుష భేదం వదలి ఈ విషయాలన్నీ పరిశీలిస్తే సత్యం బోధపడుతుంది. స్త్రీ సమస్యలో కర్త పురుషుడయినా అతడిని కార్యనిర్వాహకుడుగా మార్చేది స్త్రీ అన్నది కఠోర సత్యం. మానసిక పరివర్తన తీసుకురావడం ముఖ్యం కాని స్త్రీ పురుష వివక్షకాదు.

రవికిరణ్ స్పందనల వైవాహిక జీవితంలో ఈ సమస్యలన్నింటికి సాకారమయిన రూపమిచ్చి వాస్తవాలను కళ్లముందు నిలిపారు రచయిత. అపూర్వ, సుమతి, పద్మ, రూపాదేవి, స్పందన ఈ పాత్రలన్నీ ఒక్కొక్క స్త్రీ మనోభావాలకు ప్రతీకలు.

నవలలోని క్లైమాక్సు మాత్రం కొంత నిరాశపరచింది. విడాకులు తీసుకోవడానికి కూడా సిద్ధపడ్డ పాత్ర కేవలం అపూర్వ రాసిన ఒక్క చిన్న ఉత్తరంతో అపోహలు తొలగిపోవడం కొంత టెంపోని చల్లార్చినట్లనిపిస్తుంది. అయితే ఆమె ఏ సంఘటన చూసి అపోహపడిందో అలాంటి సంఘటనే ఆమె జీవితంలో కూడా జరిగినట్లు చూపిస్తే చక్కగా అనుభవమయినట్లు, మార్పు వచ్చినట్లు బాగుండేది. ఏదిఏమైనా స్త్రీ సమస్యను తీసుకొని నిష్పక్షపాతంగా చర్చించి చక్కని కథాగమనంతో ఆలోచనామృతంగా స్పందన నవల రాసినందుకు రఫీకి అభినందనలు.

– సి. హెచ్.శేషయ్య
ఒంగోలు-523001

## స్త్రీవాదానికి సరికొత్త భాష్యం

*(రెండవ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

యువతరంలో ఆవేశం, ఉద్వేగం, ఉత్సాహం, దుందుడుకు మనస్తత్వం ఉండడం సహజం. ఇలాంటి స్వభావాలవల్ల వీరిలో చాలామంది సమాజంలో జరుగుతున్న అన్యాయాల పట్ల స్పందిస్తూ ఉంటారు. ఇజాల వెంట పరుగులు తీస్తూ ఉంటారు. అందులో పరిణతి, పరిపక్వత ఉంటే ఫర్వాలేదు. అది లోపించినప్పుడే జీవితంలో ఇబ్బందులు, సమస్యలు వస్తాయి. ఈ విషయాన్నే నవంబర్ నెల చతుర స్పందన నవలలోని ప్రధానపాత్ర ద్వారా రచయిత షేక్‌రఫీ చక్కగా నిరూపించారు. జీవిత సత్యాలను ప్రస్ఫుటం చేసే ఇలాంటి వాస్తవాలు రచనలద్వారా వర్తమాన సమాజానికి అందించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

నవల ప్రారంభం నుండీ కూడా స్పందన జీవితంలో ఏమి జరుగుతుంది? ఎలా ముగుస్తుంది? అనే ఉత్కంఠ పాఠకులను వెన్నాడుతూ ఆద్యంతం పాఠకులచేత చదివింపచేస్తుంది. దీనికి ఫెమినిజం తోడయ్యేసరికి ఇది మరికాస్త ఆసక్తికరంగా మారింది. అయితే చివరికి రచయిత రూపాదేవి పాత్రద్వారా ఫినిషింగ్‌టచ్ ఇచ్చి ముగించిన తీరు చాలాబాగుంది. ఏ ఇజమైనా మానవప్రగతికి తోడ్పడాలేకాని మనుషులను విడగొట్టి, ఒకరిని మరొకరికి శత్రువులుగామార్చి ఒకరిపై మరొకరు స్వారీ చేసేలా ఉండకూడదు అని రచయిత రూపాదేవి పాత్రద్వారా చెప్పకనే చెప్పారు. ఈ పాత్రద్వారా స్త్రీవాదానికి రచయిత సరికొత్త భాష్యం చెప్పారు.

నవలలోని ప్రధాన పాత్రలైన స్పందన, రవికిరణ్, రూపాదేవీల పాత్రలను మలచడంలో రచయిత అద్భుతమైన ప్రతిభను కనబర్చారు. అదే శక్తి అపూర్వ పాత్ర విషయానికొచ్చేసరికి కాస్త సన్నగిల్లినట్లుంది. ఈ పాత్ర కాస్తా సినిమా పాత్రల చిత్రీకరణ స్థాయిలో మిగిలిపోయింది. అదేవిధంగా స్త్రీల ఔన్నత్యానికి పాటుపడాలని ఆశిస్తూ, స్త్రీవాదానికి తోడ్పాటు నందించాలనుకునే స్పందన చేత రచయిత స్త్రీలను కించపరిచేలా 'ఆడంగి వెధవ' అనే పదప్రయోగాలకు పూనుకోవడంలో ఆ పాత్ర ఔచిత్యం దెబ్బతింది. సులభం, సరళమైన భాష, జీవిత సత్యాలను వెల్లడించే వాక్యప్రయోగాలతో నవల ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది.

– సయ్యద్‌ఖుర్షీద్
మహబూబాబాద్-5060101

## ఫెమినిజం?

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

నవంబర్ నెల చతుర నవల 'స్పందన'ని షేక్‌రఫీ ఎంతో అందంగా మనకందిం

చారు. ఇంత మంచి నవలని అందించిన చతురకు నిజంగా అభినందనలు. ఫెమిస్టు లమనే నేటి యువతులకు దాని గురించి ఎంత అవగాహనుందో స్పందన పాత్ర ద్వారా రచయిత చక్కగా తెలిపారు. అలాగే ఫెమినిజం అనే పదానికి అర్థం ఎంతో అందంగా రూపాదేవి పాత్ర తెలుపుతుంది. స్త్రీల అణచివేతకు, భార్యాభర్తలమధ్య ఉన్న/ ఉండే అవగాహనకు ఎంతో దూరం ఉందని తెలిపిన రఫీగారి రచనాశైలి అద్భుతం.

స్పందన నవల చదువుతున్నంతసేపూ మనకు నిజజీవితంలో సంఘటనలెన్నో జ్ఞప్తికి వస్తాయి. మంచి స్నేహితుల మధ్య ఎంత అనుబంధం, ఆప్యాయత ఉంటాయో ప్రసాదరావు, ప్రభాకరరావులు, రూపాదేవి, సీమాపటేల్‌లను ఉదాహరణగా వివరించారు. అలాగే ఈ రోజుల్లో స్నేహం కూడా కలుషితం అయిందని స్పందన, రవికిరణ్‌ల మధ్య గొడవ తర్వాత ప్రభాకరరావు, ప్రసాదరావుల ప్రస్తావనలో తేటతెల్లం అవుతోంది. ఫెమినిజానికి సరైన అర్థం తెలియని స్పందనకి చివర్లో రూపాదేవి ఇచ్చిన వివరణ నేటి ఫెమినిస్టులకు చెంపపెట్టు లాంటిది. ఆ మాటలే ఈ నవలకి హైలైట్. ఫెమినిజం అంటే తమ పంతం నెగ్గటం, భర్త మాటని మన్నించకపోవటమే అని భావించే యువతకి ఈ నవల కొరడాదెబ్బ లాంటిది.

రవికిరణ్ అందం, చదువు, తెలివి ఉన్న సౌమ్యుడు అని మన ముందుంచిన రఫీగారు అతని పాత్రకు తక్కువ ప్రాముఖ్యం ఇచ్చినట్టు అన్పించింది. అతని అందానికి కాక వ్యక్తిత్వానికి ఇంకా ప్రాముఖ్యత నిచ్చేవిధంగా ఉంటే బాగుండేది.

స్పందన తెలివి, చదువు, ధైర్యం ఉన్న నేటి అమ్మాయి. స్పందన, రవికిరణ్‌ల మధ్య మొదటి పరిచయంలో స్పందన ప్రవర్తించిన తీరునుబట్టి ఆమెకి కొంత మూర్ఖత్వం, మొండితనంతోపాటు పురుషునికన్నా తన డామినేషన్ ఎక్కువగా ఉండాలనే తపన ఉన్నట్లుగా చూపిన రఫీగారు రూపాదేవి పాత్రద్వారా ఆమె అభిప్రాయాలు తప్పని నిరూపించారు. ఫెమినిస్టులు అంటే భర్తల్ని అశ్రద్ధ చేయటం, వారిచేత సేవలు చేయించుకోవటంకాక ఒకరి అభిప్రాయాలు ఒకరు గౌరవించటం, కలిసిమెలిసి ఉండటం అని రఫీగారు ఎంతో అందంగా మనకి వివరించారు. రఫీగారి శైలి అద్భుతం. ఆయన పాత్రల్ని ఎంతో అందంగా హేండిల్ చేశారు. కానీ పాత్రల వర్ణనకిచ్చిన ప్రాముఖ్యత కొంత తగ్గించి కథ నిడివి పెంచితే ఇంకా అద్భుతంగా ఉండేదీ నవల. అలాగే హాస్యం సృష్టించడానికి రఫీగారు నేటి తెలుగు సినిమాల్లోలాగ ఎంతో పవిత్రమైన ఉపాధ్యాయవృత్తిని వాడటం కొంత విచారంగా అన్పించినా కథలో ఉన్న మంచి సబ్జెక్ట్, రచనాశైలి దానిని డామినేట్ చేసింది. ఈ నవలలో స్నేహాన్ని, ఫెమినిజాన్ని ఎంతో బాగా వర్ణించిన రఫీగారు నిజంగా అభినందనీయులు.

– పి.శశిమోహన్
తణుకు- 534211

## స్పందనకు స్పందన

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఈ నెల చతుర నవల 'స్పందన' ఓ కథలా కాక జరుగుతున్న/ జరిగిన వాస్తవాన్ని నా కళ్లముందుంచింది. మరిచిపోదామనుకుంటున్న సంఘటనలను తరచి చూడమంది. అందుకే యీ స్పందన.

ఎవరో కొందరి స్వార్థపుటాలోచనలకు తమ వెలలేని, వెలకట్టలేని జీవితాల్ని పువ్వుల్లా నలిపేసుకొంటున్నారు, మిడతల్లా కాల్చుకుంటున్నారు. కారణం నేటి స్త్రీలకు

ఆలోచనకంటే ఆవేశం, అహంభావం ఓ పిసరు ఎక్కువగా వుంటోంది. తండ్రి, అన్నదమ్ములు, బావమరుదులు, ఇరుగుపొరుగున ఉన్న అన్నగార్లలాంటి మగవారి మీద ఉంచగలిగిన నమ్మకం తనకోసం, తన సంసారం కోసం పాటుపడుతున్న భర్తపై ఉంచలేకపోవడం, వ్యాధికి కారణం వైద్యుడు చెప్పాలేకాని మంత్రగాడు కాదు. అలాగే కుటుంబంలో కలతలు వస్తే ఎవరికి వారుగా కానీ, ఇద్దరూ కల్సికానీ సంప్రదించుకొని సర్దుకుపోవడం మంచిది. అంతేకానీ మూడో మనిషికి అవకాశం ఇవ్వడం పేనుకు పెత్తనం ఇవ్వడం అవుతుంది. ఇలాంటి సందర్భంలో 'ముత్యాల ముగ్గు' సినిమాలో "సిఫార్సులతో సంసారాలు చక్కబడవు" అని ఒక చోట నాయిక చేత చెప్పించిన రచయిత ఎంతో ధన్యుడు.

మాతృదేవోభవ, పితృదేవోభవ అన్నారు. మాతృభూమి, మాతృభాష, జన్మభూమి, మాతృక అని కూడా అన్నారే కాని పితృ శబ్దంతో మొదలైన పదాలు మనకు లేవు. కానీ పాశ్చాత్య పోకడలతో తమ వ్యక్తిత్వాలని తామే పోగొట్టుకొంటూ పురుషజాతిని ఆడిపోసుకొనే ఈనాటి స్త్రీజాతి పునరుద్ధరణ కోసం ఎవరో రావాలి!

ప్రతి జంటకు వివాహమైన తొలిరోజుల్లో చిలిపికజ్జాలు సహజం. కానీ అవి రాను రాను ఇరుగుపొరుగు వారికి వినోదం కలగజేయటం సంసారానికి చెడుపే కాని మంచిదికాదు అని సునిశితంగా మందలించిన షేక్‌రఫీకి నా అభినందనలు.

– యస్.హరనాథబాబు
హైదరాబాద్-500044

## పెద్దకబుర్లు

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఎంతో పట్టుతో సాగిన 'స్పందన' నవల రవికిరణ్ పట్ల అపోహ పెంచుకోవడంతో చప్పబడిపోయింది. దాని తరువాత జరిగిన సంఘటనల బిల్డప్ స్పందన వ్యక్తిత్వాన్ని దెబ్బతీసింది. కేవలం తెలుగు సినిమా 'అపార్థాలు'తో తరువాత కథ నడిచింది. ఫెమినిజం, స్త్రీ స్వాతంత్ర్యం అంటూ పెద్ద పెద్ద కబుర్లు చెప్పిన స్పందనలో తాను చూసింది నిజమా కాదా అన్న వాస్తవం గ్రహించేవిచక్షణాజ్ఞానం కూడా లేకుండా ప్రవర్తించటం విడ్డూరంగా ఉంది. అపూర్వ దగ్గరనించి ఉత్తరం వచ్చేవరకు తానుపట్టిన కుందేటికి మూడే కాళ్లు అన్నట్టు ప్రవర్తించటం, తరువాత మళ్లీ రవికిరణ్‌తో సంసారం సాగించటం స్పందన పాత్ర ప్రవేశపెట్టడంలో ఉన్న ఉద్దేశాన్నే వమ్ము చేసింది. రవికిరణ్ స్పందనను తిరస్కరించినట్లు రాస్తే నవల ముగింపుకి న్యాయం జరిగేది. స్పందనలాంటి కుహనా ఫెమినిస్టులకి పాఠం చెప్పినట్టు ఉండేది.

– ఎస్.రామారావు
హైదరాబాద్-500038

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390;
Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78